ఓం :

# ముఖచిత్ర విషయములు

## ఓంకార పరహంస

జ్ఞానధ్యానాదియు వివిక్తమైన జీవాత్మ యగు హంస, భవోత్తరణావసరమున, వివిధ త్రయాతీతమును, తురీయము నగు ఓంకారముతో సాయుజ్యము (పరము) నొందుట. (తురీయపురుషార్థ మోక్ష (పర) ప్రసక్తి యీ కావ్యమున వేఱుగ లేదు.)

## పద్మజా శ్రీపదములు

పద్మజ యగు లక్ష్మి పాదములు. "శ్రీపదములు" అనునది కావ్యనామము. అందు :—

శ్రీ త్రివర్ణాత్మకము { శ్ + ర్ + ఈ / శుక్ల + రక్త + పీల

శ్రీ త్రివర్గాత్మకము { సత్త్వ రజస్ తమస్ / ధర్మ అర్థ కామ

త్రివర్ణములును త్రివర్గస్ఫూర్తములు. సత్త్వాది త్రిగుణ ప్రేరితములగు ధర్మాది త్రిపురుషార్థములు నీ కావ్యమందలి విషయములుగాఁ దామర పూవు ముందు రేకులపై తెలియును.

## ఇతరములు

తామరపూవు వెనుక రేకులపై ద్రావిడ మూల గ్రంథ నామము "తిరుక్కుఱళ్". క్రింది తామరపాకులపై మూల గ్రంథ కర్త యొక్కయు, ఆంధ్ర కావ్య కర్తయొక్కయు, బిరుద నామములు.

ఓం



# పదములు

(పంచాక్షర మాలికలు)

(దైవకవి తిరువళ్లువర్ రచించిన తిరుక్కుఱళ్ అను ద్రావిడ గ్రంథమునకు అనువాదమును, అనుబంధమునుఁ గల శ్రీకారాంత పంచాక్షరమాలికలలో విరచిత మైన ధర్మార్థకామ త్రివర్గవిషయికము)

"సత్కవిహంస"

**శొంఠి శ్రీపతి శాస్త్రి,**

ఆంధ్ర కావ్యకర్త.

శ్రీ వేంకటేశ్వర పరబ్రహ్మణే నమః

ఓం



శ్రీపదులు, భవదీయపరము, లెదఁ
దోఁపించి, సుపంచాక్షరమాలికా
శ్రీపూజ లెలమిఁగొను గోవింద!
హేపరంధామ! రామా! నమశ్శ్రీల్!

# శ్రీ పురుషార్థ ప్రదాయ నమః

శ్రీపదులు, ఘనసార వంతములు,
తోఁప నామములు వలె, సుముఖంబునన్,
రూపింతు సితసత్వధర్మముల :—
శ్రీపతీ ! వేంకటేశ్వర ! నమశ్శ్రీల్ !

శ్రీపదులు — స్థిర సహాస్థితిఁ బద్మ
నైఁపమిని — జంచలము లవ, నురమునన్,
రూపింతు లోహితరజోర్థముల :—
భూపతీ ! శ్రీనివాసా ! నమశ్శ్రీల్ !

శ్రీపదులు సప్తాద్రిశిరమునన్
మోపి, మ్రొక్కులఁగొనుచుఁ, ద్రొక్కుదు వధో
రూప కల్మషతమఃకామముల :—
వావారిడిమ ! త్రివిక్రమ ! నమశ్శ్రీల్ !

శ్రీపదులు, ధర్మార్థకామ ని
క్షేపములు, తుర్యపురుషార్థ మోక్ష
వాపములు, ధార్మిక సమీపములు ! :—
హేపరాత్పర పురుష ! ఓం ! నమశ్శ్రీల్ !

శాంతి శ్రీపతి శాస్త్రి.

ఓం తత్సత్

# FOREWORD

It gives me great pleasure to contribute a Foreword to this new Translation in Telugu of the great Tamil classic, **Thirukkural**. The **Thirukkural**, the brightest gem in the diadem of the Tamil Muse, has not only been ranked in the Tamil literary tradition as the foremost work, but has also been acclaimed in modern times by savants abroad as a universal book. Albert Schweitzer, in his "Indian Thought and its Development" says "There hardly exists in the literature of the world a collection of maxims in which we find so much lofty wisdom." The **Kural** is also the most translated of Tamil works, at least twenty-five versions of it being known in the leading European & Indian languages

This is not the first time that the **Kural** appears in Telugu. The author of SRIPADULU the present version, Sri Sonti Sripati Sastri, inherits his literary flair from his father Sri Bhadradri Rama Sastri, a poet in Sanskrit and Telugu. Although a born Telugu, Sri Sripati Sastri has spent most of his life in Madras, Tanjore and other centres of Tamilnad and knows Tamil well. His employment in the commercial line has not prevented him from his literary pursuits and one of his earlier works is a verse-rendering of the **Bhagavad Gita**. He is to be congratulated for conceiving the idea of producing a new Telugu version of the Thirukkural.

I have gone through several portions of this new Telugu translation of the **Kural** by Sri Sripati Sastri. He may be congratulated for the success he has attained in the task. Some of the special features of this version are: The translator has devised a new metrical medium for his work, which he calls **Panchakshara-malika** In three feet of each verse of this new measure, the exact rendering of each

**Kural** is completed, and in a fourth foot, ending in the word "SRI", the translator sums up the purport of each Kural. The translation is fairly close to the original, additional words used for filling the lines being very few. When choosing Telugu words, the translator has chosen, as much as possible, the cognate Telugu forms of the Tamil vocabulary of Tiruvalluvar Even in verses like I-2.2: **Tupparkku tuppaya** etc. where the same sound-groups repeat themselves all through, the translator attempts a similar repetition of sounds in his Telugu version also There is ease, flow and rhythm which make the translation very pleasing. It is clear that the translator has enjoyed doing his work and has brought to bear on his Telugu version his admiration of the Tamil original and his first-hand knowledge and reading of it.

I am sure that in this new Telugu version, the **Tirukkural** will make a fresh appeal to the Telugu public and I give my best wishes to Sri Sripati Sastri for success in his further literary undertakings.

University of Madras,
26—5—1966

V. RAGHAVAN.

• • •

## ACKNOWLEDGMENT

I am grateful to "PADMA-BHUSHAN," "KAVI-KOKILA," "SAKALA-KALA-KALAPA," **Dr. V. Raghavan**, Professor of Sanskrit, University of Madras, for his kind contribution of the above Foreword to this book. I wish him all the best.

**Madras,**
26-5-1966

S. SRIPATY SASTRY.

# DEDICATION

***This Ethical Lyric Poetry, "SRIPADULU", presenting codes for Spiritual, Virtual, Economical, Political, Material & Emotional Welfare of Human Career, is Dedicated by the Author to :***

***His Excellency***



***Dr. S. RADHAKRISHNAN,***

PRESIDENT OF INDIA

## సమర్పణము

శ్రీ విద్యామేధా ప్రపంతునకు, మేదినీ సర్వాదిప్రతి కీర్తికిన్,
వేదాంతబోధ నాచార్యునకు, వేది రాధాకృష్ణ నాహ్వయునకున్.

పల్లవించుమతికి, భారతరత్న తల్లజాన, కురుధారిత్రోర్వీ ప్రజా
వల్లభున, విశిష్ట సర్వేపల్లి రాధాకృష్ణ పండితునకున్.

ఉపనిషత్తో, ఏ.పి. సమర్పింపను, పురుషార్థఖని సుభాషితము, పంచా
శబ్దమాలికా శ్రీయుతము, హితము, సిరి పాపలు " శ్రీపదులు ", మత్కృతిశ్రీ.

కొండి శ్రీపతి శాస్త్రి.

ఓం తత్సత్.

# పరిచయము

## శ్రీపదులు

ఈ యాంధ్రకావ్యము, ద్రావిడ (అఱవము = తమిళ్) వాఙ్మయమునఁ దలమానికమైన,— సుమారు 1600 సంవత్సరములకుఁ బూర్వము దైవకవి తిరువళ్ళువర్ చే రచింపఁబడిన— "తిరుక్కుఱళ్" అను గ్రంథమునకు అనువాదముగానుఁ,— క్రింద వివరింపఁబడు నవ్యపద్ధతిని—అనుబంధముగాను, విరచితమైనది.

కావ్యనామము : మూలగ్రంథనామము గ్రంథస్థ విషయము సూచింపదు. (తిరు = శ్రీప్రదము ; కుఱళ్ = కుఱుచదగు, రెండు పాదములుగల, కుఱళ్ అను తమిళ పద్య భేదము) మూల మందన్నియు కుఱళ్ పద్యములగుటచేఁ బద్యనామమే గ్రంథనామముగాఁ బరఁగెను............ఆంధ్రకావ్యనామ మగు "శ్రీపదులు" గ్రంథస్థవిషయ మగు త్రివర్గము (ధర్మార్థ కామముల) నేకాక,— ప్రతి పద్యాంతమున సవిభక్తిక "శ్రీ" పదము ప్రయోగింపఁబడుటచేఁ— గొన్ని యితరార్థములఁ గూడ సూచించును.

(1) శ్రీ = త్రివర్గము = ధర్మార్థ కామములు.
పదులు = "పది" (దశకము = 10) అను తెలుఁగు మాటకు బహువచనము.

శ్రీపదులు = త్రివర్గ విషయకము లగు పదేసి పద్యములు. (ఈ కావ్యమున 133 అధికారములు కలవు. ఒక్కొక్క యధికారమున నొక్కొక్క యుపవిషయము పదేసి పద్యములలోఁ బ్రస్తావింపఁబడెను.)

(2) శ్రీ = త్రివర్గము ; లక్ష్మి ; సంపద (పద్యాంత "శ్రీ" పదములకు సరిపడు అర్థములు వేఱొకచోఁ గన నగును.)

పదులు = "పది" యను సంస్కృత శబ్దమునకు బహువచనము.

పది = పాదము ; పదము (పద్యపాదము/చరణము/చిహ్నము/శబ్దము) కలది.

శ్రీపదులు = త్రివర్గ విషయిక పద్య పాదములు కలవి :— శ్రీ పదములు—(పద్యాంతముల) శ్రీ చరణములు కలవి ; శ్రీ చిహ్నములు కలవి ; శ్రీ శబ్దములు కలవి. (ఇట్లు వేఱు వే అర్థములు కలుగును.)

కావ్యనామమునను, పద్యాంతములను, నా పేరు కొంత ధ్వనించుట యుద్దిష్టముకాదు.

**అనువాదము :** తిరుక్కుఱళ్ పద్యములు రెండేసి పాదములు గలవి. ఈ యాంధ్ర కావ్యములోని పద్యములు నాలుగేసి పాదములు గలవి. మూలములోని సూత్ర ప్రాయములగు రెండేసి పాదములకును, ఆంధ్రానువాదము మొదటి మూడేసి పాదములలో,— యథామూలక్రమముగనే కాక, వీలుపడు తావుల ద్రావిడ సమాంధ్ర పదప్రయోగములతోను, మూలార్థ భావాంతరముల విశదీకరించుటకుఁ దగిన పదాంతర ప్రయోగములతోను,— సాగినది. తృతీయపాదానంతరమున, అనువాద పూర్తి సూచకములుగా నిట్లు :— గుర్తు లిడఁబడినవి.

**అనుబంధము :** ఇందలి తెలుఁగు పద్దెముల నాలుగవ పాదములన్నియు అనుబంధములే ; అనువాదములు కావు. మొదటి మూడు పాదములలో అనువదింపబడిన భావములను, సందర్భానుసారముగ, విపులముగఁ, బుష్టికరించుటకును, స్పష్టీక

రించుటకును, అన్వర్థోత్తర భావ ప్రతిపాదకములుగ, మద్విర చితములై యనుసంధింపఁబడిన "శ్రీ" పదాంతములు తురీయ పాదములు. "శ్రీ" పద వివరణము వేఱొకచోఁ గలదు.

ఆంధ్ర పద్య లక్షణము : ఈ కబ్బములోని పద్దెము లన్నిటికివి ఛందోలక్షణము సమానమే. వాడుకలోని పద్య భేదములం దేదియుఁగాక, ప్రసిద్ధ గణయతి నియమములు లేక, నాచే స్వచ్ఛంద చ్ఛందస్సరణి నేర్పఱచుకొనఁబడిన లక్షణములు గల పద్దెము. ప్రతి పద్యపాదమునకును బంచమాత్రాగణత్రయ నియమమును, ద్వితీయ తురీయపాదాంతముల నదనముగా గురు ప్రయోగనియమమును (చతుర్థ పాదాంత్యగురువు సవిభక్తిక శ్రీకారము), ప్రాసనియమమును, ఇందలి పద్యమునకు లక్షణములు. కందపద్యమువలె మొత్తము 64 మాత్రల పద్యమే. తాళమువేయుచుఁ బాడుటకుఁగూడ ననువుపడును. తాళమువేయు నపుడు మాత్రము, ద్వితీయచతుర్థ పాదాంత్య గురువులు పంచ మాత్రా కాలప్రాప్తములగును.........పద్యారంభ పూర్వమునఁ బద్యనామము సూచింపఁబడ కున్నను, లక్షణములనుబట్టి, "పంచాక్షర మాలిక" యనఁదగును. (మాత్ర = అక్షరావయవము)

## తిరుక్కుఱళ్

ఈ మూలగ్రంథమందలి విషయములు, చతుర్విధ పురు షార్థములలో మొదటి మూడైన ధర్మార్థకామము లగు త్రివర్గము. గ్రంథమంతయు 133 అధికారములుగలదై, ఒక్కొక్క యధి కారమున నొక్కొక్క యుప విషయము పదేసి పద్యములలోఁ బ్రస్తావింపఁబడుటచే, నిదియొక త్రివర్గ ఖండ కావ్యమనఁదగును. ధర్మార్థకామ శాస్త్రములం దిందలి విషయములకంటె నధికము

లుండవు. ఇవి, యే దేశమునకును, ఏ కాలమునకును, ఏ మతమునకును, విరుద్ధములుకాక, సర్వ మానవులును దమతమ జీవనవిధానములం దనుసరించదగిన సూక్తులుగా, విధినిషేధములతో, ఉత్తమకవితా క్రమమున నుపదేశింపబడినవి. నవరసములును వెదచల్లబడిన గ్రంథరాజ మిది.

మోక్షము : ఈ తురీయపురుషార్థ విషయము తిరువళ్లువర్ వ్రాయలేదు. మోక్షము పరోక్ష మనియు, మోక్షవాప్త్యనంతరానుభవము, జీవన్ముక్తులకైనను, అనిర్వాచ్యమనియుఁ, గావున నది ప్రత్యేకముగా వ్రాయుట అసమంజసమును అసమగ్రమును అగు నూహాగానమే యగుననియు ఆ మహాత్ముఁడు మోక్ష విషయము వ్రాసియుండఁడుగాని, బ్రాహ్మణేతర జాతియందుఁ దాను వర్తిల్లిన కారణమునఁ దనకు మోక్షప్రసక్తి కర్హతలేక వ్రాయలేదనుట అన్యాయ్యము. మోక్షార్హత, జాతినిబట్టి కాదు ; శీలనియమతపః ప్రవృత్తులనుబట్టి. ధర్మమార్గమునఁ, గామ్యకర్మలకుఁ బునరావృత్తిగల స్వర్గతియు, సర్వ సంగ పరిత్యాగులకు నిష్క్రమములేని మోక్షగతియు, వారివారి యర్హతలనుబట్టి యాయా గతులు ప్రాప్తించును. ధర్మవర్గమున, విశేషించి సన్యాస ప్రకరణమందలి జ్ఞానభాగమున "నిలువమి" 'తత్త్వ జ్ఞానము" మున్నగు నధికారములలో మోక్షార్హతకుఁ దగిన విధానము సూచించఁబడెను.

గ్రంథ ప్రాశస్త్యము : తిరుక్కుఱళ్ పద్యములు సూత్రప్రాయములైయుండ, విస్తారభావము లందిమిడి యుండుటచే, "ఆవగింజను దొలిచి యందు సప్తసాగరములఁ జొప్పించి" రనియు, "జలబిందువున మహావృక్షము ప్రతిబింబింపఁజేసి"

రనియు తిరువళ్ళువర్ ప్రణుతింపఁబడిరి. ఈ గ్రంథమునకు "తమిళ వేదము", "సార్వజనీనవేదము" మున్నగు ననేక కారణ నామములు వెలసినవి. కొన్ని ప్రాక్పాశ్చాత్య భాషలలో ననువదించఁబడినది. తెనుఁగునందునుఁ గొన్ని యనువాదము లున్నవఁట. గ్రంథ ప్రాశస్త్యమును, గ్రంథ కర్తృ విశిష్టతయు, గ్రంథ పరిశీలనముననేకాక యీ క్రింది యద్భుత వృత్తాంతమువలననుఁ దెలియును.

తిరువళ్ళువర్ కాలమున మధురలో "సంగమ్" అను తమిళ్ పండిత కవుల సంఘ ముండెడిది. ఆ కాలమున రచింపఁబడిన గ్రంథము లా సంఘమునఁ బరిశీలింపఁబడి యోగ్యములుగా నంగీకరింపఁ బడినవే ప్రకటింపఁబడవలెను. తిరుక్కుఱళ్ ఏ కారణముననో ఆ (పిడపటి) సంఘసభ్యులచే నామోదింపఁబడకయుండెను. మహాకవయిత్రి అవ్వైయార్, సంఘమందు తిరుక్కుఱళ్ యొక్క ప్రాశస్త్యము నుగ్గడించినను సభ్యులు విముఖులైరి. (కారణము తిరువళ్ళువర్ జాతియేమో?) అవ్వైయార్ అంతతో నూరకుండక, సభ్యులు చూచుచుండ తిరుక్కుఱళ్ నొక పలకపైఁబెట్టి, సభామంటపసమీపమున నున్న యొక కొలనిలోనికి విసరివైచెను. చూచువారెచ్చెరువొందఁ, దబ్బిబ్బునొంద, ఆ పలక కొలవిలో మునిఁగిపోయి, తిరుక్కుఱళ్ మాత్రము నీటిపైఁ దేలి యాడుచు జీవచైతన్యముతోఁ గదలి యెడుఁజేరెను. సభ్యులు తమ యజ్ఞానమునకు సిగ్గుతో వగచి, తిరుక్కుఱళ్‌నకును, తిరువళ్ళువర్‌నకును సాష్టాంగ దండప్రణామము లొనరించి, యా గ్రంథము సర్వోత్కృష్టముగా శిరసావహించిరి.

వ్యాఖ్యానములు : తిరుక్కుఱళ్‌నకుఁ బెక్కు వ్యాఖ్యానములు వెలువడినవి. అందు, సుమారు 600 సంవత్సరములకుఁ బూర్వము, " పరిమేలళగర్ " రచించిన వ్యాఖ్యానమే సర్వ విధముల నుత్తమోత్తమముగఁ బరిగణింపఁబడుచున్నది.

పరిమేలళగర్ కాంచీపురమునఁగల త్రివిక్రమ దేవాలయార్చక పరంపరకుఁ జెందిన వైష్ణవ బ్రాహ్మణుఁడు. కాంచీపుర రాజసభలో వీరొక కంచు గుఱ్ఱముపైఁ గూర్చుండి తిరుక్కుఱళ్ వ్యాఖ్యానముఁ జదువుచుండఁగా, ఆ గుఱ్ఱము కదలుటచే వీరికి " పరిమేలళగర్ " (గుఱ్ఱముమీది యందగాఁడు) అను పేరు కలిగి, యంతకు ముందున్న పేరు విస్మృతమయ్యె నందురు. వీరు బహు శాస్త్రి వేత్తయు, విదగ్ధుఁడు నని వ్యాఖ్యానము వలనఁ దెలియును. తిరుక్కుఱళ్ వలెనే వీరి వ్యాఖ్యానము గూడ సులభముగ బోధపడక ఉపవ్యాఖ్యానాపేక్ష కలిగించును. ఈ కావ్యమం దాంధ్రానువాదము పరిమేలళగర్ వ్యాఖ్యానము ననుసరించినదే యైనను, ఎక్కడనైనఁ గొంచెము భేదించును.

## తిరువళ్లువర్

తిరుక్కుఱళ్ గ్రంథకర్త పేరు తిరువళ్లువర్ అయియుండదు. ఆ మహాత్ముఁడు వర్ధిల్లిన వళ్లువకుల నామమే యతని నామముగ వాడుకయందున్నది. గ్రంథమునకువలెనే గ్రంథకర్తకును " దైవకవి ", " ఆదికవి ", " దేవుఁడు ", " చతుర్ముఖుఁడు " మున్నగు పెక్కు కారణ నామములు గలిగినవి.

వీరి జన్మము, వివాహము, గృహస్థాశ్రమ జీవనము, సతి వాసుకి పాతివ్రత్యమహిమ మున్నగు వానినిగూర్చి కొన్ని కథలున్నవి. అవియన్నియుఁ బుక్కిటి పురాణములు కాక పోయినను, గ్రంథవిస్తర భీతిచే నన్నియు నిటఁ బొందుపఱుచుటలేదు.

వీరి పుట్టుక మధురయం దనియుఁ, జెన్నపట్టణమున మైలాపురమునం దనియు, భిన్నాభిప్రాయములున్నవి. మైలాపురమునందు తిరువళ్లువ నాయనార్ దేవాలయ మున్నది. ఆలయ ప్రాకారమున వారి సతి వాసుకీదేవి యాలయమును మఱికొన్ని యాలయములు నున్నవి. ప్రాకార ప్రాఙ్ముఖ గోపురమున (కడైచ్చంగమ్) మధురలోని కడపటి సంఘ సభ్యుల ప్రతిమలును, మధ్య, తిరువళ్లువర్ ప్రతిమయుఁ గలవు.

ప్రాకారములో తిరువళ్లువనాయనార్ ఆలయ ముఖమంటపమున కుత్తరదిశయందు, వారొక వృక్షచ్ఛాయను జన్మించినట్లు నిరూపించు గుఱుతుగా, శాఖలులేని యొక పురాతన వృక్షముయొక్క మూలస్తంభము, నిర్మూలము గాకుండుటకై చుట్టునుఁ గొంత యెత్తువఱకు వేదికచేతను, బైని రాగిరేకుచేతను మూయఁబడి, భద్రము చేయఁబడినది. వేదికపై తిరువళ్లువర్యొక్క తలిదండ్రుల ప్రతిమలును, శిశు ప్రతిమయుఁ గలవు.

తిరువళ్లువర్యొక్క తండ్రి అగస్త్యముని సంతతివాఁడగు బ్రాహ్మణుఁడు ; తల్లి యొక బ్రాహ్మణునిచేఁ బెంచఁబడిన ఆదిద్రావిడ జాతిదఁట. తల్లిదండ్రుల నామములు "ఆది", "భగవన్" అనియు, తిరుక్కుఱళ్ మొదటి యధికారమగు

"భగవన్నుతి" యందు మొదటి పద్యమున "ఆది భగవన్" అను పరమేశ్వర నామ ప్రతిపాదక సమాసమున తిరువళ్ళువర్ తన మాతాపితరుల స్మరించుకొనె ననియు, అందురు. తలిదండ్రుల నామము లా మహాత్మునకుఁ దెలిసియుండినఁ, దన్నామములు పరమేశ్వర నామమున ధ్వనింప స్మరించుట సమంజసమే కదా ?

తిరువళ్ళువర్ తలిదండ్రులు వివాహమాడునపుడు, తమకెప్పు డెచట బిడ్డలు పుట్టినను, ఆ బిడ్డల నపుడే యచటనే విడిచి పోవలెనని నియమము చేసికొనిరఁట. వారికి జనించిన అవ్వై, ఉప్పై, అధిగమన్, ఉరువై, కపిలన్, వళ్ళి, వళ్ళువన్, అను ఏడుగురు శిశువులను నియమప్రకారము విడిచివైచిరఁట. అగ్రజన్మయగు అవ్వైయార్ అగ్రజన్ముఁడగు నొక బ్రాహ్మణుని చేతను, అంత్య జన్ముఁడగు తిరువళ్ళువర్ అంత్య జన్ముఁడగు (ఆదిద్రావిడులలోఁ బౌరోహిత్యాదివృత్తులు చేయు) నొక వళ్ళువుని చేతను బెంచఁబడిరి. అవ్వైయార్ మహా మహిమురాలైన ప్రఖ్యాతకవయిత్రి యయ్యెను. తిరువళ్ళువర్ మహా మహిమాత్ముఁడై, ప్రఖ్యాతి వహించిన దైవకవియై, నేఁత పని చేయుచు, సతీమణియగు వాసుకితో సానందముగా గార్హస్థ్యమును, మధురమగు నధ్యాత్మ జీవనమును నడుపుచుండఁగా నామె మరణించెను. ఆమె సౌశీల్య పరిచర్యాదుల స్మరించి భగ్నహృదయుఁడై యా మహాత్ముఁడు పిదప సన్యసించెను. ధర్మపథమున నెఱపు గార్హస్థ్యము సన్యాసముకన్న నుత్తమమని వారి యభిప్రాయము. వాసుకీదేవివంటి సత్సతీమణులు గల గృహస్థులకు సన్యాస మున్నతము కాదు.

## ధర్మ వర్గము

"భగవన్నుతి"తోఁ బ్రారంభింపఁబడి, "విధి" యను పూర్వ కర్మ విషయముతో ముగియు ఈ వర్గమునందు 38 అధికారములు కలవు. ప్రధాన ప్రకరణములు గార్హస్థ్య, సన్న్యాసములు. బ్రహ్మచర్యవానప్రస్థములు వేఱుగ లేవు.

సద్గృహస్థ, గృహిణీ, పుత్ర ధర్మములును, సన్న్యాస ప్రతి దాన ధర్మములును విపులముగఁ బ్రతిపాదింపఁబడి, మానవ జీవయాత్రకు వేఱేయు నుత్తమ ధర్మములు లేవని గోచరించునంత పక్కాని రీతిని విధి నిషేధములతో సమగ్రమగు కవితా ధోరణిని గొనసాగిన ధర్మపుంజము ధర్మవర్గము.

## అర్థ వర్గము

రాజు, అంగములు, పరిశిష్టము, అను మూడు ప్రకరణములు గల 70 అధికారములలో అర్థవర్గము సాగినది. రాజ్య సప్త ప్రకృతులలో "స్వామి" యనునది రాజప్రకరణమునందును, దక్కిన యాఱు నగు అమాత్య, రాష్ట్ర, దుర్గ, కోశ, బల, సుహృద్భాగములు అంగప్రకరణమందును, పరిశిష్ట ప్రకరణమున, రాష్ట్రజనుల కావశ్యకములైన, ముందు ప్రకరణములలో వక్కాణింపఁబడని, కొన్ని విషయములును, ఈ వర్గమునందుఁ గలవు.

కేవల రాజ్యాంగ విధానములేకాక, సర్వజనులు ననుసరించవలసిన సూక్తు లనేకము లిందుఁగలవు. రాజాంగ ప్రకరణములలో నచ్చటచ్చటఁ గొన్ని విషయము లాధునిక రాజ్యాంగ విధానములకు సరిపడక పోవచ్చుఁగాని, యేయే కారణములఁ బురస్కరించుకొని ఆయా విషయము లిందుఁ బ్రతిపాదింపఁ బడినవో, ఆయా కారణము లేకాలమందును, ఏ రాజ్యాంగ విధానమునకును సామాన్యములే; కార్యవిధానములలోనే భేదములుండును. ఈ వర్గము రాజనీతికిని, సర్వమానవులకు నావశ్యకములైన నీతులకును నిధాన మనవచ్చును.

## కామ వర్గము

సంయోగ (గాంధర్వ) వియోగ (పాతివ్రత్య) ప్రకరణములుగా విభజింపఁ బడిన యీ వర్గమునందు 26 అధికారములు గలవు. కామ మనునది, యీ కావ్యమున మనోభవప్రేరిత స్త్రీ పురుష కామానురాగమేకాని, తదితర వాంఛా విషయముకాదు.

ఈ వర్గమంతయు రూపక పద్ధతిని సాగినది. ఇందలి 250 పద్యములలోఁ గొన్ని యొక యుత్తమ యువకునియొక్కయుఁ, దక్కిన వొక యుత్తమ యువతి యొక్కయు వాక్కులుగా నచటచట సూచింపఁబడెను. చెలికత్తె ప్రవేశముకూడ

నున్నట్లు కొన్ని పద్యములవలనఁ దెలియునుగాని, యామె వాక్కులుగా నీ కావ్యమందే పద్దెములును నిరూపింపఁబడలేదు. పరిమేలళగర్ వ్యాఖ్యానమునఁ దెలికత్తె పలుకులుగాఁ గొన్ని పద్యములను సూచించుటయేకాక, అధికార పద్య సముదాయపూర్వములఁ గొన్ని వాక్యములను సంధించి, తత్తత్కారణముల సూచించిరి.

మధురాతిమధుర మగు కవితాచాతురిఁ బ్రకటించుచుఁ గామవర్గమును తిరువళ్లువర్ బహు మనోజ్ఞముగ రచించెను. కల్పనాశక్తి సామర్థ్యములతో ననన్యసామాన్య సరణిని వెల్లివిరిసిన కవితా విశేషము కామవర్గమునఁ గానఁబడును. శృంగార రసవైవిధ్యమిం దుట్టిపడుచుండును.

పూర్వ సంకేతము లేకయే, యొక పొలిమేర యందొక యుత్తమ యువకుఁ డొక యుత్తమ యువతిని గాంచినపుడు, వారు పరస్పర హావభావప్రకటనలవలనఁ గామపారవశ్యమునొంది, స్వచ్ఛందమగు గాంధర్వ సంయోగమునఁ గామ మనుభవించుటయు, ఆ సంఘటనా మాధుర్యమునఁ బరస్పర గాఢ ప్రేమానుబద్ధులగుటయు, వారి సంయోగము ఉపహాసీకృతమైనను, వారియందుఁ బొలుచు వికృతులచే నపవాదము గలుగుటవలనఁ, దమ వివాహము సర్వజనాదరణీయ మగుటకు యువకుఁ డొకవిధమైన శిక్షవిధి యగు * మట్ట యూరేగింపునకు (114 వ అధికారము) ఆయత్తుఁడగుటయు, వారికి వియోగము గలిగినపుడు పరస్పర లగ్నమనోవృత్తులవలన వియోగమోర్వలేకున్నను సౌశీల్యమును విడువక ప్రేమికులలోఁ గామాతురత నొందఁగా నుదయించు సూక్ష్మాతిసూక్ష్మ భావములఁ బ్రకటించుటయుఁ, బునస్సంయోగావసరమున సహజ ప్రణయ కోప ప్రకటనయు, నత్యద్భుతముగ రచింపబడినవి.

* తమిళనాడులోఁ బూర్వకాలమున, ఇద్దఱు యువతీయువకు లొండొరులఁ బ్రేమించుకొని, గూఢములైన వారి ప్రేమలు గాఢములైనను, సహజీవనమున కాటంకములున్నయెడ, యువకుఁడు తన అనివార్యకామముఁ బ్రకటించుటకుఁ, దాటిమట్టల కట్టనుగట్టి, దానిపై గూర్చుండి, తనయొక్కయు యువతియొక్కయు బొమ్మలును ఊరుపేరులును వ్రాయఁబడిన పలకను బట్టుకొని, కొందఱు మట్టల గుఱ్ఱమును దెరువులం దీడ్వ, నూరేగవలెను. యువతి తలిదండ్రులో, ఊరి పెద్దలో, రాజసేవకులో, చూచి జాలిపడినచో, వారి వివాహము సమ్మతించఁబడును.

## స్వ వి ష య ము

తమిళ్ భాషా పరిచయము, మాటాడుటయందే కాని, తద్గ్రంథములందేకాక, తదక్షరములందైన, నేమాత్రమును లేని వాఁడనై యుండినపుడు, కొన్ని యేండ్లకు ముందు, కీ. శే. శ్రీ వి. వి. సుబ్రహ్మణ్యముగారు (ఐ.సి.యస్.) నా భగవద్గీత గీతలనుగుఱించి ముచ్చటించు సందర్భమున, నంతవఱకు " తిరుక్కుఱళ్ " నకు సరియైన యాంధ్రానువాదము లేదనియు, నేనది పూని నెరవేర్చవలెననియు, నభిలషించిరి. నేనప్పటి కుద్యోగమునుండి నివృత్తుఁడనై, ముండక మాండూక్యోపనిష ద్గౌడపాదాచార్య కారికల నాంధ్రీకరించుచుంటిని. తరువాత తమిళ్ లిపి పరిచయము చేసికొని, యన్య సహాయ మపేక్షింపక, సాహసించి, తిన్నగా శ్రీ పరిమేలళగర్ వ్యాఖ్యాన మాత్ర సహాయముతో తిరుక్కుఱళ్ కడలిలో దిగి, యొక్కొక్క పద్య తరంగమున మునుఁగుచుఁ, దేలుచు, దేఱుచు, నపుడపుడే అను వాదానుబంధములు గల శ్రీకారాంత పద్య విరచన మొనరించుచు బహుశ్రమ మొంది దరిఁజేరి మూడు సంవత్సరములైనను, నింత వఱకు ననివార్య కారణములచేఁ బ్రకటన మాలసింపఁబడినది.

తమిళ్ తెలుఁగులం దల్పజ్ఞుఁడ నగుటచే, ఈ కావ్యమున ననేక దోషములుండవచ్చును. నా దోషములను, ముద్రణ దోష ములను మన్నించి యూరకుండక నాకుఁ దెలుపఁ బాఠక విమర్శ కులను బ్రార్థింతును. తప్పొప్పుల పట్టికలోఁ జూపఁబడవి దోషములు మఱికొన్ని యందందుఁ జూపట్టును. పునర్ముద్రణ ప్రాప్తి యీ కావ్యమునకున్నయెడ నపుడు సవరించవచ్చుఁ గదా ?

ఈ యాంధ్ర కావ్యముగూడ, నందందు విశేషార్థములు గల దగుటచే, వ్యాఖ్యానాపేక్షఁ గలిగించవచ్చును గావి, యా కొఱఁతఁ దీర్చుటకు నే నుద్యమించలేదు. ఇందలి విషయములు ప్రతి మానవునకును నావశ్యకములును, అనుసరింపఁదగినవియు నయియున్నవి. ధర్మార్థ వర్గములలోని పెక్కు విషయములు బాలబాలికలకు బోధింపఁదగినవి ; కావున విద్యా సంస్థలలో నవి పఠనీయములుగా నేర్పఱచుట సమంజస మని తోఁచుచున్నది. ఈ పరిచయమునందు వివిధ విషయములు విరివిగా వ్రాయఁబడి నందునఁ బాఠకులకుఁ గొంత శ్రమ కలుగునేమోయని, మన్నింపఁ గోరుచున్నాను.

నా పితరులును, గురువులును, సంస్కృతాంధ్ర పండిత కవులు నైన, కీ॥ శే॥ శ్రీ శొంఠి భద్రాద్రిరామ శాస్త్రిలవారిని సంస్మరించుకొనుచున్నాను.

దైవకవి తిరువళ్లువర్‌నకు హృదయపూర్వకాభివాదము లొనర్చుచున్నాను. ఈ కావ్య ముద్రణము ముగించి ప్రకటించు చున్న నేఁడు (2-6-1966) తిరువళ్లువ నాయనార్‌యొక్క జన్మోత్సవ దిన మని యెంతయు నానంద మొందుచు, నీ పరిచయ ముపసంహరించుచున్నాను.

చెన్నపట్టణము
2—6—1966

శొంఠి శ్రీపతి శాస్త్రి.

# శ్రీ ప్రశంస

| | | | |
|---|---|---|---|
| శ్రీ త్రివర్ణా త్మకము | శ్<br>శుక్ల | ర్<br>రక్త | ఈ<br>నీల |
| శ్రీ త్రివర్గా త్మకము | ధర్మ<br>సత్వ | అర్థ<br>రజస్ | కామ<br>తమస్ |
| శ్రీ త్రిమాత్రా త్మకము | బ్రాహ్మి<br>* శ్ | వైష్ణవి<br>ర్ | మాహేశ్వరి<br>ఈ |

* మాత్ర = అక్షరావయవము. శ్ ర్ ఈ అను మూ డక్షరావయవముల చేరిక, శ్రీ, ద్విమాత్రాకాలికమే. ప్లుతోచ్చారణమునఁ ద్రిమాత్రా కాలిక మగును.....త్రిమాత్రాపర్యంతమును శ్రీకారము ఓంకారముతో ఒద్దిగా నిరూపించఁ దగును.

అఉమ్ అను మూడక్షరావయవముల చేరిక, ఓం, ద్విమాత్రాకాలికమై, ప్లుతోచ్చారణమునఁగాని త్రిమాత్రాకాలికము కాకున్ననుఁ, ద్రిమాత్రాయతి కలదనియు, మాత్రారహితపరమే తురీయ మగు పరమాత్మ యనియు నుపనిష దుపదేశము.

## ప్రతి పద్యాంత శ్రీ శబ్ద వివరణము

శ్రీ = లక్ష్మి ; కలిమి ; గౌరవ వాచకము.

(పై యర్థములు కాక, యితరములైన యీ క్రింది యర్థము లుద్దేశింపఁ బడి పద్యాంతములఁ బ్రయోగింపఁబడిన సవిభక్తిక శ్రీ శబ్దముల తరువాత నాయా యర్థములు కుండలీకృతములయి సూచింపఁ బడినవి.)

శ్రీ = వృద్ధి ; బుద్ధి ; కీర్తి ; శోభ ; అలంకరణము ; సాధనము ; త్రివర్గము ; విషము.

#  పదములు

(పంచాక్షర మాలికలు)




" సత్యవిహంస "

శొంఠి శ్రీపతి శాస్త్రి,

ఆంధ్ర కావ్యకర్త.

శ్రీపదులు

ధర్మ వర్గము

# విషయసూచిక

ఉపోద్ఘాత ప్రకరణము

ఓం



1 వ అధికారము

# భగవన్నుతి.

1. అకారస్వరము మొదలుగఁ గలవి
సకలాక్షరములు ; నాదిభగవానుం
డొకఁడు మొదలుగఁ గలదె లోకంబు :-
అకారాదికమె 'ఓం' పరాత్మశ్రీ. 1

2. కఱచి చదువరు లయిన ఫలమేమి,
పరిశుద్ధ చిన్మయుని పరమప్రభల్
వఱలు శ్రీపదులఁ గొలువరయేని ?:-
వరకలాతీతంబు తత్పదశ్రీ. 2

3. అలరుపెద వేంచేయు పరు మహిమ
గల పదము మనసారఁ జేరువారల్
నిలయపరమున నిడుద మనియెదరు :-
కలకాలమును ముదమె తత్పదశ్రీన్. 3

4. వేఁడుటయు, వేఁడమియు, లేనతని
పోఁడియడుగులఁ జేరుకొనువారి, కే
నాఁడు నడలించు నిడుమలు లేవు :-
పీడించు పుట్టు వఱుఁ దత్పదశ్రీన్. 4

5. ఇరులుచేఁ దఱియు నిరుపనులునుం
దఱియ నీశ్వరు సత్యయుతసన్నుతిన్
నిరతితో ధ్యానించు వారియెడ :-
మరులు, మేల్సెబ్బరలుఁ, దెరలుఁ దచ్ఛ్రీన్. (కాంతిచే)

6. జ్ఞానేంద్రియద్వాంత్ర్యప లైదుఁ
బో నడఁచినతని నాన్నృతశీలమా
ర్గానుసారులు సదా మనియెదరు :-
జ్ఞానజితమతులకు సదాగతిశ్రీ. 6

7, తన కుపమ లేనతని పదముఁ జే
రినవారలకుఁ గాక, పెఱవారికిన్
మనసుకలవరము మార్చుట యరిది :-
జనిదుఃఖ మఱుఁ దత్పదాశ్రయశ్రీన్ 7

8. ధర్మాబ్ధిమహితు పదమును జేరు
నిర్మలులకే కాని, కామార్థభూ
తోర్మ్మల భవాబ్ధి నీఁదుట యరిది :-
కర్మవిలయాస్పదము తత్పదశ్రీ. 8

9. చేష్టావిరహితేంద్రియములు వలె—
దృష్టంబు లయ్యు—గుణవిరహితములే,
అష్టగుణి పదము మ్రొక్కని తలలు :-
భ్రష్టమతు లెంచఁగ రీశ్వరపదశ్రీన్. 9

10. పుట్టుపేర్కడలి నీఁదంగలరు
పట్టుకొనువారభవు నడుగుఁదెప్పన్—
బట్టనట్టిఁదు లీఁదఁగా లేరు :-
కట్టు విడ సుగతి భగవన్నుతిశ్రీ. 10

2 వ అధికారము

# వాన పేరిమి.

1. వాన, కురియుచునున్న కతముననె
ప్రాణిలోకంబు మనివచ్చు కతనన్,
దా "నమృత" మని యెఱుఁగఁబడఁ దగెను :-
పూనెఁగద "జీవ" నాఖ్యయు జలశ్రీ ? 11

2. కుడుపరులకుం గుడువనగు మేలి
కుడుపులం బొడమించి, కుడుపరులకుం
గుడుపు తా నౌనదియునున్ వాన :-
కుడి బెడియ, వడి మడియు నొడ లిడాశ్రీన్. 12

3. జడివాన పడ కెడయ, విరివినీ
ర్కడలిచే సుడియఁబడు విస్తృతజగతిన్,
గడుపులో నిల్చి యాఁకలి వేఁచు :-
కుడుపు వాడమునె క్షారనీరధిశ్రీన్ ? 13

4. ఏరుఁ గొని దున్నరు కృషీవలులు
పైరు నిడ నిడయుండు, నీరందం బన్
వారి రాబడిపెంపు కుందుతఱి :-
పైరు లేకున్న నెట భోజనశ్రీ ? 14

5. చెఱచునదియుం గురియమిని, చెడిన
నరుల కౌఁగి సాయమయి కురిసి యట్లే
మఱి యెత్తునదియు, నెల్లను వాన :-
పరశక్తియుతము వర్షము జగచ్ఛ్రీన్. 15

6. విస్తృతగగనమునుండి చినుకు మున
ముసఁ బడిననే కాని, మాత్రైనచోఁ
బసికసవుకొసయుఁ గాంచుట యరిది :-
ఉనుటు లెటు లెసఁగు నీరసంసాశ్రీన్ ? 16

7. విడుకడలియును నైజమునఁ గుందు
వడు, దావిఁ గొఱపఱచి, యెగుమొగులు తా
నడరి కురియనిదియై విడుచునెడ :-
జడధి యప్పును దీర్చు జలధరశ్రీ. 17

8. తిరునాళ్లతోడ దినపూజయును
జరుగ దొగి, వాన వఱపొందునేనిన్,
సురలకును నీలోకమునయందు :-
సురనరపరస్పరత కద విధిశ్రీ ? 18

9. దానమును దపము నను రెండునున్
లేవి వగు సువిశాల లోకంబునన్
వాన కురియకయె మానునయేని :-
వానవలననె నెఱయు సుధర్మశ్రీల్. 19

10. నీరులే కమర దొగి లౌకికా
చారంమే, నెవరెవరికిని, వానలే
కూర దిల జీవన ప్రవాహంబు :-
నీరహైతుకము లర్థకామశ్రీల్. 20

3 వ అధికారము

# సన్న్యాసుల పేరిమి.

1. శీలమున మను విషయవిగ్రహుల
మేలిమియె మహితార్థములలో మహో
త్తాల మని శాస్త్రసిద్ధాంతంబు :—
మాలు మమతాహంత లసంగ శ్రీన్. 21

2. ఇరుతెఱఁగుపట్టుఁ దొఱఁగినవారి
పెరిమె కొలఁదిని నుడువు, టిల మృతులదొ
వెరసి, వరుసగ నెన్ని, కొను టల్లె :—
నిరవధిక మిల యతుల యతిశయశ్రీ. 22

3. ఇరుమెయుల—పట్టువిడుపుల—వగల
నెఱిగి, యిట ధర్మ మూవినవారిదొ
పెరిమెయే యున్నతము లోకమున :—
పరం మమరు సన్న్యాస సుధర్మశ్రీన్. 23

4. ఉఱిది యను నంకుశముచేఁ గరిణ
కరు లైదిటివిఁ గాచు నిర్విషయి, తా,
వరమనెడు నెలవునకు నొక విత్తు :—
పరవనస్థిర మగును దదాత్మశ్రీ. 24

5. పంచవిషయేచ్ఛ లడఁచినయతని
మించునకు, దివిజపతి. వేయికనులన్
గాంచిన మహేంద్రుఁడే, చాలు కరి :—
నొంచె గౌతమశాప మమరరాట్శ్రీన్. 25

6. చేయుటకు సరిదివగు కార్యములఁ
జేయువారలె పెద్ద లిలఁ; బిన్నలో
చేయ నరిదివి చేయ నట్టిఁడులు :—
చేయ నరిదివి యమాదియోగశ్రీల్. 26

7. దవళి, తాఁకుడు, టూపు, చవి, తావి,
యిప యైదిటివి పాళ్లు గను వానిదౌ
సువివేక మందలిదె లోకంబు :—
వివిధపంచీకృతము ప్రపంచశ్రీ. 27

8. ఫలపూర్ణవాఙ్మహిమ గల మహ
ర్షుల పెరిమె, నిలఁ విదాదేశంబులై
వెలయు మంత్రోక్తులే వినఁబఱచు :—
కలుగు మేత్సెబ్బిలు ఋషివచశ్శ్రీన్. 28

9. గుణము లను కొండెక్క నిలుచున్న
మునివరుల కోపమును, క్షణిక మేయున్,
మొనసి యడ్డిడి కాచుకొను టరిది :—
మెఱుఁగులును మిడియు సంయమి శమశ్రీన్. 29

10. ఒనరు చల్లసివాఁ లనువారు
మునిధర్మచరితు, లే యుసుఖు నెదసున్
చనరు కనికరం మూని మను కతన :—
ఘనశీతలమును ముని ప్రతాపశ్రీ. 30

* * *

4 వ అధికారము

# ధర్మబలాధిక్యము.

1. పర మీను, దివ్యసంపద నీను,
పురుషార్థ ముఖ్య ధర్మము మించు బల్
పరిపుష్టికర మేది యుసుఱునకు ?:—
తురీయార్థప్రదము ధర్మంబె శ్రీన్. [త్రివర్గమున]  31

2. ఉరుధర్మమును మించు పరిపుష్టి
కరమునున్ లేదు ; దానిని మరులుచే
మఱచుటను మించి లేదుసుఁ గీడు :—
పొఱయు నరకమె, మఱవఁ దదర్థశ్రీన్.  32

3. పల్లనగు వగల, స్వాశ్రమ మందుఁ
జెల్లు ధర్మాచరణ, మెల్లపవెడున్,
జెల్లు మొగలను నెల్లఁ జేయవలె :—
చెల్లవలె ధర్మంబె త్రికరణశ్రీన్.  33

4. మనసునందున మాసియే లేని
మనుజుఁ డవవలె;—నంతటిదె ధర్మమౌ ;
అనుచితం బగు డంబ మితరంబు :—
పెనుఁబ్రాము నటనమొకొ సుధర్మశ్రీ?  34

5. అసహనము, కామంబు, క్రోధంబు,
పసికాని మాట, యను నాలుగింటిన్
వసుల నీఁగుచు నడచినదె పాడి :—
బెసుకుచోఁ బొసఁగునే సుధర్మశ్రీ ?  35

6. "చావొందు నాఁడు చేయుదు'' మనకి,
యేవేళఁ జేయవలె ధర్మ ; మదియే
పోవునపు డుడిగిపోవవి తోడు :—
జీవరక్షకము నిత్యధర్మశ్రీ. 36

7. "ధర్మఫల మిద్ది''యన వలదు ; పే
దర్మిఁ బల్లకి మోయువానికిని, లోఁ
బేర్మిఁ జను వానికిని, నెడఁ దోఁచు :—
ధర్మకర్మంబునకె శుభఫలశ్రీ. 37

8. బీఱునా ఖండనీయక, ధర్మ
మాఱఁ జేసిన, నద్ది, యొకఁ దొడలితోఁ
జేరి మను నాళ్లెరు వడ్డు శిల :—
తూరు సంతతధర్మమునఁ బరశ్రీ. 38

9, పాడిచే వచ్చునదియే ముదము ;
వేడుకలు, తదితరము లెల్ల, వెలిపై,
గో డిడునవే, యశోహీనములె :—
పాడి నిహమునఁ గూడఁ బ్రమోదశ్రీల్ (కీర్తులు) 39

10. చేయఁదగు పాలిటిది పాడియే,—
యే యొకని కైనఁ దన జీవితమునన్—
ద్రోయఁగాఁ దగు పాలిటిది కీడె :—
శ్రేయఃప్రదము ధర్మవర్తనశ్రీ. 40

6 వ అధికారము

## ఇలు మనికి

1. ఇలుమనికివాఁ డనంబడెడు వాఁ
డిల ధర్మచరులగు త్రయాశ్రములకున్
బొలుచు సద్గతుల నిల్పిన తోడు :—
లలిత మగుఁ దద్గృహస్థాశ్రమశ్రీ. 41

2. ఆదరువు తొఱఁగినట్టిఁడులకును,
బేదలకునున్, గతించిన వారికిన్,
మేదినిన్ గృహమేధియే తోడు :—
స్వాదు వగుఁ దద్గృహస్థాశ్రమశ్రీ. 42

3. పితరులును, దేవు, లతిధులు, బంధు
తతి, తాను, నను నైదెడల ధర్మమౌ
గతి నోము టిలుతేని కుత్తమము :—
కృతకృత్యుఁ డట్టి గృహి స్వధర్మశ్రీన్. 43

4. పాపమున కంజి, యొగిఁ బంచియిడి,
సాపడుట కలదేని, బ్రతుకుతెరువం
దేఁపు నిడు కొఱ యెన్నఁడును లేదు:—
ఏపు చెడుఁ, జెడ గృహస్థధర్మశ్రీ. 44

5. అనురాగమును, ధర్మమును, నెఱపు
ఘనవియతి కలదైన, నిల్లాలితో
మనికి, యొగి, సుగుణమును, ఫలము, నది:—
మొనయు నా యమ నియతి నిహపంక్తిల్. 45

6\. ధర్మమార్గమున గృహజీవనముఁ
బేర్మి నెఱపిన, నవలి వనిమార్గమం
దర్మిలిం బోయి పొరయున దేమి ? :—
నిర్మల గృహస్థతనె సత్ఫలశ్రీ. 46

7\. సొరిది నిలుమనికి మను ననఁబడెడు
పురుషుండు, శమదమాదిప్రయత్నముల్
జరుపు ఘనులందెల్ల శ్రేష్ఠుండు :—
వరగృహికి సులభమగు సత్ఫలశ్రీ. 47

8\. నెఱి నొరుల మనుపు నాదరు వగుచు,
సుఱుపాడి చెడని యిలుమనికియె, వ్రతా
చరణమునకంటె సహనము కలది :—
పరుల కాపరు వవదు తపస్యాశ్రీ. 48

9\. ఉరుధర్మ మనఁబడినదే యింటి
దొరతనపు మనికి ; యదియును, సుంతయున్
బరదూషితము కా దయిన నయము :—
పురుషార్థనిధి సద్గృహస్థతాశ్రీ. 49

10\. భూవలయ మందు మనఁదగిన మొగి
జీవించు గేస్తుండు నాకస్థులౌ
దేవతాళులయందు వైవఁ బడు :—
భావుకప్రదము గార్హస్థ్య సుశ్రీ. 50

6 వ అధికారము

# జీవన సహకారిణి మేలిమి

1. ఇంటికిం దగు శీల మున్న దయి,
జంటఁ దన్ గొన్నతవి వచ్చుబడిలో
నొంటి, మసఁ దగినదె మనువుతోడు :—
కొంచెతన మున్నదొకొ సహచరీస్త్రీ ? 51

2. గృహధర్మమున కొనరు గుణమహిమ
గృహిణియెడ లేదైన, నింటిబ్రతు, కే
మహిమ గలదైననున్, లేనిదే :—
"గృహిణి" యనునదియు "గృహ"పదార్థస్త్రీ. 52

3. లేని దెది, యింటిదే మాన్యగుణ
యైన ?—నొకనికి—నున్న దెది, యింటిదే
మాన మ్మఱు హీనగుణ యైనయెడ ? :—
ఊను నిలుబ్రతుకు గృహిణీగుణస్త్రీన్. 53

4. ఇలురాణికిం జెంౘ బెన్దగిన వె
ఎల వొకవి, కామెయెడ గరితతన మన్
బలుదిటవె యుండఁగాఁ బొంయినెడ :—
వెలయుఁ గ్రొత్తది పలనఁ ద్రివర్గస్త్రీ. 54

5. దైవమును గొలువ, కొగిఁ దెలిసి, తన
జీవితేశ్వరుఁ గొలిచి లేచెడు మహా
దేవి "కురియు" మనఁ గురియును వాన :—
దైవ మగపడును సతి మహత్త్వస్త్రీన్. 55

6. తన సతీత్వముఁ గాచికొని, తన్నుఁ
గొని నతని సేవించి, యుక్తవినుతిన్
గని కాచి, పొరపడని దిల్లాలు :—
చెనఁటిగయ్యాళి యా లవఁ జెడును శ్రీల్. 56

7. చెఱఁ గాచు కా పేమి చేయునొకో ?
పొరపడక మగనాలు స్వసతీత్వపున్
నెఱిఁ గాచుకొను కాపె శ్రేష్ఠంబు :—
చెఱ నున్న మెయి, తిరుగ కున్నె దుశ్శ్రీ (బుద్ధి) 57

8. పొరసినాతనిఁ గొలుచు పున్నెముం
బొరయునేనిం, బొరయుఁ బెండ్లా మొగిన్
బొరిఁ బేర్మి సుంలు మను లోకమును:—
గరితకున్ నెఱయు నిహపరశుభశ్రీల్. 58

9. పొగడితను గోరు నింటిది లేని
మగని కుండదు, తెగడువారి యెదుటన్
మగసింగమునకు వలెఁ, బెరిమెనద :—
మగనాలి చెడుగైనఁ జెడు మగని శ్రీ. (కీర్తి) 59

10. మంగళం బం ద్రొకని కిల్లాలి
తుంగసౌశీల్యమును ; మఱి దాని మే
లంగైన నగ సత్సుతులఁ గనుట :—
పొంగు మగబ్రతుకు సత్సహచరీశ్రీన్. 60

7 వ అధికారము

# పుత్రులఁ గనుట.

పొరయఁ దగు భాగ్యములలో, మేము
పొరి మదించుట లేదు, జ్ఞేయజ్ఞులౌ
వరసుతులఁ గనుటఁ గా, కితరములు :—
వెరసి యేటికి, సుసంతతిలేక, శ్రీల్ ? 　　　　61

ఏడు పుట్టువుల యందును నొకవిఁ
గీడు లంటవు, దూఱుపడని గుణముల్
కూడియుండిన బిడ్డలను గనిన :—
కీడు లఱుఁ బుత్రకృత సుకర్మశ్రీన్. 　　　　62

తమ ధనం బంద్రు తమ సుతుల, న
క్కొమరుల ధనంబు తమ తమకు వారల్
సమకట్టు కర్మముల వచ్చు నని :—
తమ పితౄణముఁ దీర్తు సుపుత్రశ్రీల్ 　　　　63

అమృతంబు కంటెఁ గడు రుచిరంబు
తమ బిడ్డ లరితిమెయిఁ జిఱుచేతులన్
దమిఁ గలిపి చెదర వైచిన కూడు :—
సము లీశశిశు లమాయికత్వశ్రీన్. 　　　　64

బుడుతండ్రు మొయితాఁకు టొడలునకుఁ
గడువింపు; మఱియు వా రాడునవియౌ
బుడిబుడి నుడుల వినుట చెవికింపు :—
అడరు నవ్యక్తమాధురి శిశుశ్రీన్. 　　　　65

6. వేణు వింపగు, వీణ యిం పండ్రు,
కూన లగు నాత్మజుల బిలిబిలినుడుల్
వీనార నాలకింపని వారు :—
ఆనంద మిడు నాత్మశిశురవశ్రీ. 66

7. తండ్రి సుతునకుఁ జేయు మేలు, పలు
వుండ్రు విదురుల సభను ముందుకొను బల్
గండ్ర యగు చదువరిగఁ జేయుటే: —
తీండ్ర నిడుఁ జదు ; వీండ్ర మిడు ధనశ్రీ. 67

8. తమకంబెఁ, దమ సుతుల విజ్ఞాన
సమన్వితత్వము, మహాదరణిలో
నమరు ప్రాణులకు నెల్లను నింపు :—
సుమనస్సు లగుట సుతు, లదృష్టశ్రీ. 68

9. కన్నపుడు కన్న నుప్పొంగుఁ, దన
కన్న కొడుకును "బాండితీప్రపూర్ణుం"
డన్న వినుతిని వి న్నపుడు తాయి :—
కన్న కడుపున కదియె సత్ఫలశ్రీ. 69

10. సుతుఁడు తండ్రికిఁ జేయు మాఱు మే
"లితని పితరుం దేమి నోచెనొక్కొ
యితనిఁ గన ?" నను మెప్పుఁ గొలుపుటయె :—
కృతార్థుఁడు గృహి సత్సుతోదయశ్రీన్. 70

8 వ అధికారము

# ప్రేమ సంపద.

1. ప్రేమకును నుండునో యడ్డకముగఁ
ప్రాము తాళము ? ప్రేమయుతులచౌ లో
ప్రేమఁ, బులుకన్నీరె వెలిపుచ్చు :—
ప్రేమ, చెయ్వులఁ దోఁచు నరూపశ్రీ. 71

2. అనురాగరహితు, లెల్లనుఁ దమకె
యనుకొందు ; రనురాగయుతులు తమ యె
మ్మను నగ్గ మనుకొందు రితరులకు :—
తన తనువు నిడెఁగదా శిబి కృపాశ్రీన్ ? 72

3. అనురక్తి తోడ మును మనిన ఫల
మవియెదరు బుధు, లుసుఱునకు నరిదియౌ
మనుజదేహముతోడ మను తొడును :—
నెన రౌనరు మర్త్యుల, కమర్త్యతాశ్రీ. 73

4. అనురాగ మీనుఁ బెఱవారి ప
ట్టున నపేక్షావహత ; నద్దియీనున్
నను పనెడు మితిలేని మేలిమిని :—
అనురాగ మఖిలార్థదాయకశ్రీ. 74

5. నెమ్మినిం బూని యమరిన వర్త
నమ్మునకు ఫలమంద్రు బుధు, లిహము నం
ది మ్మొందువా రెయిదు మేలిమిని :—
నెమ్మి చేకుఱుచు నిహపరసుఖశ్రీన్. 75

6. పాడి కొక్కుటికి మాత్రమె ప్రేమ
తోడందు రెఱుఁగనట్టిఁడు; లంయఁగాఁ,
గీడునకుఁ గూడ నదియే తోడు :—
కీడదఁగి పాడి యదరును బ్రియశ్రీన్. 76

7. ఎముక లేనట్టి కీటకళరీ
రము నెండవలె, ద్రేఁచునే, ప్రేమభా
వములేని జీవమును ధర్మంబు :—
సమవర్తి యగు ధర్మదేవతాశ్రీ. 77

8. నెన రంతరంగమున లేని జీ
వుని బ్రతుకు, చౌటినేలను వట్టి పో
యిన ప్రమాఁకు చిగిరించునట్టులే :—
కొన లొత్తుటకు వలదె లో రసశ్రీ? 78

9. వెలిరూపు లెల్ల నేమిటిఁ జేయుఁ,
గలితదేహాంత స్స్వరూపంబుగాఁ
బొలుచు ప్రేముడి లేని వారలకు ?:—
వెలయుఁ బ్రేమమునఁ గద స్వధర్మశ్రీ. 79

10 నెమ్మినెఱి మను నొడలె యసువునికి;
అమ్మెలి గొనము లేనట్టిఁడులకో
ఎమ్ములం దోలు గప్పిన దొడలు :—
వమ్ముగద మనుపీనుఁ గగు టిలాశ్రీన్? 80

9 వ అధికారము

# విందుల నోముట.

1. ఇలుకాఁపురం బుండి. ధన మోమి.
యిల మనుప దెల్ల, విందుల నోముటన్
వలయు నుపకృతులఁ జేయుట పొంటె :—
ఇలుమనికి కివి యవశ్య ధర్మశ్రీల్. 81

2. అతిథి వెలి నుండఁ దాఁ గుడుచునది,
హితమైన చావమికి మందు దివ్యా
మృత మేనియునుఁ, గోరఁ దగ వదదు :—
హిత మవదు. అట్టి కుడు సగు సఘశ్రీ (విషము) 82

3. వచ్చు విందులను నిచ్చలు నోమి
మెచ్చు లిడు సచ్చరితు బ్రతు కెన్నఁడున్
నొచ్చి, లేమినిఁ బాధయుట లేదు :—
హెచ్చిరిలు నాతిథ్యమున శుభశ్రీల్. 83

4. అంతరంగం బమరి సిరి వఱలు.
నెంతయును ముఖ మమరి తగు విందులన్
సంతృప్తి నోము నాతని యింట :—
సంతసిలుఁ దన సదుపయోగమున శ్రీ. 84

5. విత్తనంబులు నిడఁగ వలెనొకో,
బత్తి నతిథుల నోమి, వెనుక మిగులా
బుత్తి మెసవెడువాని పొలమందు ? :—
ఉత్తమాతిథ్యమున నిహఫలశ్రీ. 85

6. వచ్చి యుండిన యతిథులను గుడిపి,
వచ్చు నతిథుల నెదురుచూచు గేస్తుం
డె చ్చయిన యతిథి నాకస్థులకు :—
మెచ్చు లిడ నతిథులకు, స్వర్గతి శ్రీ. 86

7. ఇంత మిత మన, నలవి లే దొకటి ;
ఎంత మిత మతిథిపాత్రత్వ మగునో
అంత మిత మగును, వేలిమి ఫలము :-
చెంత యగుఁ బర, మర్త్యాన్రృయజ్ఞశ్రీన్ 87

8. " కష్టపడి ధన మోమి, ప ట్టఱిన
భ్రష్టుల " మటంద్రు, విందుల నోమి ము
వ్విష్టి చేయఁగఁ దలపడనివారు ;—
పుష్టిఫలదము మనుష్యయజ్ఞశ్రీ. 88

9. కలిమిలో లేమి, విందుల నోము
తెలసి యోమని మడ్డితనమె యగు ; ఆ
కలుచ మడియంద్రయందే యుండు :—
కలిమి కలదగుట అతిథేయశ్రీన్. 89

10. మూరుకొన వాడున *దవిచ్చపువు ;
మాఱుపడి మొగము, గృహి చూడంగనే
తీరు చెడి వాడునుగదా విందు ? :—
తేఱవలె నతిథిఁ గన గృహిముఖశ్రీ. 90

* అనిచ్చపువు = అనిచ్చ మను చెట్టు పువ్వు." అనిచ్చము", అనగా "అనిత్యము" కావలయును.

10 వ అధికారము

# ప్రియములఁ బలుకుట.

1. ప్రియవచనములు- ప్రేమమిళితంబు
లయి, కైతవము లేనివైన, ఋజుతా
ప్రయతార్థదర్శనుల వానుడులు :—
నయహితవిశిష్టంబు ప్రియవచశ్శ్రీ. 91

2. మది యలరి యిడుటకంటెను నయమె,
వదనం బలరి యెవరిఁ గన్నను ప్రియఁ
వదుఁడుగా నుండఁగా బెరయునెడ :—
హృదయగతవిషయసూచిక ముఖశ్రీ. 92

3. మొగమార నిచ్చవడి, కన్నులా
రఁగ విమ్మగాఁ జూచి, మనసారఁగా
నగు ప్రియోక్తులయందలిదె పాడి :—
నెగడ దీవినెయైన సుధర్మశ్రీ. 93

4. అదఁ బెంచెడు కుడుపులేమి యను
పేదర్మి లే దగును, వేరి యెడనే
నాదటను బెంచు ప్రియభాషలకు :—
రాదు దైన్యము, సర్వసమత్వశ్రీన్. 94

5. అడఁకువగలాతఁడును బ్రియభాష
ణుఁడు నగుట, యొక్కనికి సహజంబులౌ
తొడవు లగుఁ ; గావు మఱి యితరములు :—
నుడినయము రత్న మగు వినయసుశ్రీన్ [తొడవున] 95

6. దురితములు తఱుఁగ, నొగి. ధర్మంబు
పెరుఁగు, హిత మొనగూర్చునవి మనసునం
దరసి, ప్రియ మైనయవి పలుకునెడ :—
పరుషవాక్కులఁ దఱుఁగు సుధర్మశ్రీ. 96

7. నయ మీని, యొక్కనికి, శుభఫలా
నయములగుఁ, బరుల కొగి ఫల మీనుచున్
ప్రియగుణమునుండి తలఁగని నుడులు :—
ప్రియవచోనియతి విహాపరసుఖశ్రీల్. 97

8. పరులకుం బీడాకరము లవని
యుఁ చౌనరు నిచ్చకము లొక్కరునకున్
మఱుమెయిని, నిమ్మెయిని, నిమ్మ విడు :—
పరమ మగు తపము ప్రియహితవచశ్శ్రీ. 98

9. ప్రియభాషణం బన్యులది, తనకు
నయ మీనుటను గాంచు వాఁ, డేలొకో
నయ మెడపి, తాఁ బరుస మాడునది ? :—
ప్రియము లాడమిఁ జెడదె స్వధర్మ శ్రీ : 99

10. రసవత్సుభాషితము లుండఁగా
రసహీనముల ననుట, పండ్లుండఁగాఁ
గసుగాయలం దినుట వంటిదె :—
రసన యెఱుఁగదొ ప్రియవచఃఫలశ్రీల్. 100

11 వ అధికారము

# చేసిన మేలు మఱవమి

1. చేయకయె మేలు, తన కొకఁడు, తాఁ
జేయు సుపకృతికి, భువియును దివియు మా
ఱీయఁబోయిన, నీ డగుట యరిది :—
శ్రేయ మిదు మిషలేని యుపకృతిశ్రీ. 101

2. కాలానుకూలముగ నొనరిచిన
మేలు, మితి నెన్నఁ, జిన్నది యైనసున్
భూలోకమునకంటెఁ గడుఁ బెద్ద :—
వేళఁ గడపమి మేల్మి యుపకృతిశ్రీన్. 102

3. ప్రతిఫలము నాసయనివారి యుప
కృతి వయము నారసిన, సద్గావిదొ
నతిశయము కడలికంటెనుఁ బెద్ద :—
అతిసుకృత మమిషోపకృతికృతిశ్రీన్. 103

4. జొన్నంత చిఱుమేలె చేసినను,
నున్నతంబగు తాటి యంతటిదిగా
నెన్నుదురు ఫల మెఱింగినవారు :—
అన్నెనరు వలనఁ, బున్నెము ఫలశ్రీ. 104

5. తొలిమేలి మేర కలయది కాదు—
మలుమేలు — మేలు చేయంబడినవా
రల స్వభావపు మేర కల దగును :—
కలిత మగు తని వలపి యుపకృతిశ్రీన్. 105

6. మఱవరా దమలజనసంగతము ;
తొఱఁగరా దిడుమతటి నాదరువుగా
నుఱు మే ల్సలిపినట్టిఁడుల చెలిమి :—
ఇరుమెయుల నట్టి పొం దిడు ధృతి శ్రీన్. 106

7. ఏడు మెయు లగు నేడు పుట్టువులఁ
గూడఁ, దలఁతురు తమకు నేర్పడినవౌ
కీడు లెడపినవారి ప్రేముడిని :—
కూడఁబడుఁ బూర్వవాసన లసు శ్రీన్. 107

8. మేలు నెద మఱచునది మే లవదు ;
మేలు కానిది చేయఁబడిన యపుడే
వాలాయముగ మఱచునది మేలు :—
శీలవంతుల కివి సులక్షణ శ్రీల్. 108

9. కొల యంత యప్రియం బొక్కండు
సలిపినను, ముం దొకానొకపు డతఁడే
సలిపినది, యొక మేలుఁ దలఁపఁ, జెడు :—
చల మడఁగు సంతతోత్కృతజ్ఞతా శ్రీన్. [సాధనమున] 109

10. ఎట్టి ధర్మఘ్నునకునే నఘము
నెట్టు ప్రాయశ్చిత్త ముండు నిల ; లే
దెట్టి ప్రాచితమునుఁ గృతఘ్నునకు :—
పట్టఁ దగు ధర్మ్యము కృతజ్ఞతా శ్రీ 110

12 వ అధికారము

# నడునిలుకడ.

1. తగ వనెడు నొక పాడియును నయమె,
పగ, తగులు, తగులమి, యనెడు పగుదులన్
మొగిఁ దప్పకుండ మనఁ బొంియునెడ :—
సుగుణప్రధానము తటస్థతాశ్రీ. 111

2. నడియునికిఁ బూనునాతని పెంపు,
చెడిపోప కవశిష్టసంతతికినిన్,
దొడరి బలు పగుటఁ బూనిన దగును :—
నిడుపొగడు నుండు మధ్యస్థతాశ్రీన్. 112

8. నయమె యిడునేనియును, నడియునికి
మయికమున విడనాడి యగు సంపదన్
ంయమునను నాఁడె పో విడువవలె :—
ఎయిదుదురు దుఃఖ మనయార్జితశ్రీన్. 113

4. తగవరులు, తగ వఱినవా, రనున
దొగి, వారి వారి మిగు లగు సంతతిన్
సుగుణవిగుణంబులం గానఁబడు :—
మిగులుఁ గద పొగడుతెగడులు కులశ్రీన్. 114

5. హానివృద్ధులు లేనియవి కావు ;
మానసమునందు వంకర గామియే
జ్ఞానపరిపూర్ణులకు భూషణము :—
మానసీయము కరణఋజుత్వశ్రీ. 115

6. "చెడుదునే" నని యొఱ్ఱఁగవలయుఁ, దని
యెడఁద, నడియునికి విడి, దుర్నయంబుల్
వెదఁగుటకునై తలఁపు సేయునెడ :—
పెదదారితలఁపె యుపకరుసు మగు శ్రీన్. [బుద్ధియందు]

7. కీడుపాటుగఁ గొనదు లోకంబు,
పోఁడిమెయి నడునెలవుఁ గొన్నవాఁడై,
పాడియం దున్నతని దైన్యమును :—
ఈ దవునె మధ్యస్థతకు ఘనశ్రీ ? 117

8. సమముగా నున్నదై పస్తుభా
రముఁ దూఁచు కోలవలె, నమరి యొక పా
ర్శ్వమును కొఱగమి పూర్ణులకుఁ దొడవు :—
సమధర్మ భావమే సుయోగశ్రీ. 118

9. సుడియందుఁ గోణంబు లేనియది
నడియునికి, యొదఁగూడునటు లుఱిదిగా
నెదఁదఁ గోణములేమి బెరయునెడ :—
నుడియెడఁద లెడపడుటొ సమత్వశ్రీ ? 119

10. వాణిజ్యమును జేయువారి కరు
వాణిజ్య, మోపు యితరుల యర్థమున్
బోణిమెయిఁ దమదివలెఁ, జేయునెడ :—
నాణెమొకొ నీలవర్తక మిలాశ్రీన్ ? 120

13 వ అధికారము

# అడఁకువకలిమి.

1. అడఁకువ యమరులందుఁ గొని విడును ;
అడఁగమి యసహ్యతామిస్రమందున్
గడగండ్లఁ గుడుపఁగాఁ గొని విడును :
అదర నడఁకువ. యదరు సుధర్మశ్రీ. 121

2. కాపవలె సొత్తుగా నడఁకువను ;
ఏ వేఱు సంపదయు దానికంటెన్
బైవాసి కలదు, లే దుసుఱునకు :—
మేవడియె బహుభావుకప్రదశ్రీ. 122

3. వినతి, విబుధులచేత నెఱుఁగఁబడి
వినుతి ఫలియించు, జ్ఞేయము నెఱుఁగుచున్
సునయపథమున నడఁగ బెరయునెద :—
వినయ మనయము ననుఁగు త్రికరణశ్రీన్. 123

4. నిలుకడం దిరిగిపోవక యుండి,
లలి నడంగినవాని యున్నతి గనన్
మలకంటెనున్ మిగులఁ బెద్ద దగు :—
మలయరా, దడఁగవలె, నింద్రియశ్రీ. 124

5. ఎల్లరకు మంచి దగు వినయ ; మా
యెల్లవారలలోనుఁ, గలవారికే
పెల్లగు మఱొక కలిమిగాఁ దగును ;—
త్రుళ్లున్నయెడఁ ద్రెళ్లి చెడకున్నె శ్రీ ? 125

6. ఒక మేనఁ గూర్మ మటు, కరణపం
చకము నొకఁ డడఁచ నోపిన, నట్టి యో
పిక యేడు మేనులను రక్షకము :—
సుకృతతత్వవిజ్ఞయె ప్రతిష్ఠితశ్రీ. 126

7. వేనిఁ గావనివా రయిన, నాల్క
నేనిఁ గావంగ వలయును ; గావరే
యేని, శోకింత్రు నుడి పొరను బడి :—
మానితం బగు వినయవాక్తపశ్శ్రి. 127

8. ఒకటైన దుష్టవచనార్థఫల,
మకము కల్గిన, నితర ధర్మంబులన్
సుకృతంబు కాకుండి, కీ డగును :—
ఒక కడవ పాల నొక చుక్క దుశ్శ్రి. [విషము] 128

9. విప్పుచేఁ గాలిచిన పుండు, లో
నొప్పి విడి, యాఱు ; అఱదె నాల్కదౌ
వెప్పుచేఁ గాలిచిన లో బొప్పి :—
మెప్పుఁ గలిగించవలె వినయవాక్శ్రిన్. 129

10. కినియ నటు లెదఁ గాచి, చదువుకొని,
యణఁగఁ గలవాని సమయమును, ధర్మం
బొనరఁ గను, వాని దారిని జొచ్చి :—
పెనుపునకు వలసినవి శమదమశ్రీల్. 130

14 వ అధికారము

# మంచి నడవడి కలిమి.

1. శీల మౌన్నత్యంబు నిడుఁ గాన,
శీలంబునే ప్రాణమునకంటెనున్
వాలాయముగ నోమఁగా వలయు :—
మేలొందు సౌశీల్యమున నస్రశ్రీ. 131

2. శ్రమపడియు సేవించి కాపవలె
సమయమును ; దెలిసికొని, యోమి, పెక్కుల్
విమర్శించినను, నదియే తోడు :—
అమితహిత మిరుమెయుల సుశీలశ్రీ. 132

3. మానసీయస్వధర్మాచారం
మూని జీవించుటె కులీనత్వమౌ ;
దానిఁ దప్పుట హీనజన్మ మగు :
హీనులు కులీనులే సుశీలశ్రీన్. 133

4. మఱచిపోయినను వేదముఁ బున
శ్చరణమునఁ గొన నగును ; బాఁపనువిపౌ
నురుజాతి, శీలంబు కుందఁ, జెడు :—
నెఱపవలె ధర్మప్రవర్తనశ్రీన్. 134

5. అసహనం బూను నాతనియందుఁ
బస వలెనె, లేదు, శీలము లేవి మా
నిసి మనికియందు నౌన్నత్యంబు :—
బెనుకు దుశ్శీలు కులగౌరవశ్రీల్. 135

6. మంచి నడవడిసుండి చలియించ
రించకయు సురుధీరు, లది చెడుటచే
యించు కీడును బడయు పా పెఱిఁగి:--
మంచి నడవడి యుత్తమవ్రతశ్రీ. 136

7. నయవర్తనంబు నెఱపుటచేత
నెయిదుదురు మేలిమిని ; జెడు నడతచే
నెయిదుదురె. యెయిదఁ గూడవి యగడు :—
జయము సర్వత్ర సద్వర్తనశ్రీన్. 137

8. పున్నెంబునకు విత్తనం బగును
దిన్నసగు నడత ; చెడు నడవడికయో
యెన్నఁడైనను నిడుమనే యిడును :—
పున్నె మిరుమెయుల నిడు ఘనఫలశ్రీన్. 138

9. సారప్రవర్తనుల కొప్పవే,
యారాటపెట్టునవి, పొఁపాటునన్
జాటియును, వాయాం వాకొనఁగ :—
నో ంలవరించవలె నయవచశ్శ్రీన్. 139

10. లోకంబుతో నొప్ప నడచునది—
ప్రాకటానేకవిద్యల నేర్చియున్—
వీఁక నేర్వవివా ంలజ్ఞులే :—
లోకోత్తరానుగతి సువిద్యాశ్రీ. 140

15 వ అధికారము

# పరు నిల్లాలుఁ గామింపమి.

1. పరుని సొత్తగు నాలుఁ గామించి
చరియించు దైన్య, మిల ధర్మార్థముల్
పరికించి కనువారి యెడ లేదు :—
పరకీయ మరగఁ, దఱుఁగును శుభశ్రీల్. 141

2. పాడిఁ గడపుచుఁ, గీడునను నిల్చి
పాడులం దెల్ల, నొరు గడపకడఁ దా
రాడు ఖలు లట్టి పేదలు లేరు :—
కూడ దన్యులఁ గూడు ధృతి, మతిశ్రీన్. 142

3. మృతులకంటెను వే ఱవరు, మంచి
హితులుగా నమ్మినట్టిఁడుల యాండ్రన్
వ్యతిక్రమం బాసించి మనువారు :—
మృతు లవరె. ఫలఁ హితులపఁ ద్రివర్గశ్రీన్ ? 143

4. ఎటువంటి వారైన నెటు మునిగియుఁ.
చిటిజొన్నగింజంతయును నరయకే,
విటుఁడుగాఁ బరు వింటఁ జొఱఁబడుట :—
విటతటం బయ్యె నింద్రుని తనుశ్రీ : 144

5. ఎల్లిదం బని పరగృహిణియందు
నెల్ల మీఱెడు జారుఁ డెయిదు నెప్పుడుం
జెల్లిపోవక నిల్చు పెనుదూఱు :—
త్రెళ్ళఁగద పల్లవుల సుగ మఘశ్రీన్. [విషమున] 145

6. ప్రతికారకులకు నొకనాఁడె ముద
మతికి యుండును ; క్షమాకారకులకో,
క్షితి పొసుఁగువడు వఱకునుం బొగడె ;—
ప్రతికృతము సుకృతమే నది క్షమకు శ్రీ. [అలంకృతి]

7. కూడనివి తన కొరులు చేసినసుఁ,
"గీ దగునె వారి" కవి నొచ్చుకొని తాఁ
బాడి కానివి చేయమియె నయము :—
తో దగుట క్షమకుఁ గృప, సుధర్మశ్రీ 157

8. పొగరుచే నక్రమము లొనరిచిన
విగుణులను నొగిఁ దాము తమ సహన మన్
తగవుచేతను గెలువఁగా వలయు :—
పగ మొగిసి నొగులుచుటనొకొ జయశ్రీ ? 158

9. ఎల్లఁ దొఱఁగిన మునులుపలె శుచులె
యిల్లుదొర, తెల్లఁ దప్పినవారి వా
ప్రల్లదము లోర్చుకొనఁగలవారు :—
చెల్ల, దెద నల్ల దగునెడ, క్షమాశ్రీ. 154

10. నిరశనవ్రత మోర్చుకొనువారు
పెరిమెకాం ద్రగుట, పరు లాడినవియో
పరుషోక్తు లోర్చువారల వెనుక : —
పరము పరపరుషవా క్సహనతాశ్రీ. 160

17 వ అధికారము

# ఈరసింపమి.

1. మంచి నడవడిదారిగాఁ బరిగ
ణించుకొనవలె నొకఁడు తన మనమునన్
గించిదీర్ష్యయు లేవి నైజమును :—
అంచితజ్ఞానజము నిరీర్ష్యాశ్రీ. 161

2. ఘనసంపదలయందు దానితో
నెనయునది లే దొండు, నెవరియెడసున్
మన సీరసము లేమి బెరయునెడ :—
తనరు సిరు లెవియు అనసూయ యను శ్రీన్. 162

3. పాడిపెంపులు గోరఁ డనఁబడెడు
వాఁ, డొరుని పెంపు నరుసంబుతోఁ
జూడ నోపక యీసు పడువాఁడు :—
కీ డగును గడుపూఁదఁ గొన మనశ్శ్రీన్. 163

4. ఈసునను గాని వొనరుపరు బుధు,
లా నేగిదారి విహాపరములందున్
గాసియే పడవలయు నని యెఱిఁగి :—
ఈ సఱుగ, మీసరం బగు ఫలశ్రీ. 164

5. ఈరసము గలవారి కదె చాలు,
వేఁతేల ?—యొంటరముగలవారు పా
లారిచినను—గీడు నీను నది :—
లో రగులు పగల నొగులదె యనుశ్రీ ? 165

6. పెట్టునది యొక రౌరుల, కెఱిఁగి, కను
కుట్టుఁదన మొందు నాతని చుట్టమున్
గట్టునది, తిమనదియు, లేక చెడు :—
వట్టదే చీడ పట్టిన కుజ శ్రీ. 166

7. సహియింపలేని దయి, యసూయా
వహుని, సిరి, తన యక్క పెద్దమ్మకున్,
రహటు నిడఁ, గనఁబఱచి, విడనాడు :—
రహియించు నీర్ష్యావిరహితునెడ శ్రీ. 167

8. ఓరువమి యను విషముఁ డగు పాపి,
చేరునెఱ, సిరిఁ జెఱచి, తరువాతనున్
ఘోరనరకమునందుఁ గొనివిడును :—
ఈరసం బుభయదారకాఘ శ్రీ. [విషము] 168

9. ఓర్వఁ జాలని వక్రమతి పెంపు,
నుర్వి, ఋజుమతి కీడుఁ, దార్మ్యముగా
నిర్వహిల హేతువు విచార్యంబు :—
పూర్వకృతమే కతముగాఁ దోఁచు శ్రీన్. [బుద్ధియందు]

10. కనుకుట్టుఁదనమునన్ బెద్దలై
మనినవారును లేరు, దాని లేమిన్
బెనుపు తీఱినవారునున్ లేరు :—
చెనఁటి యగు, నీసుఁ గొన, జీవన శ్రీ. 170

18 వ అధికారము

# పేరాస పడమి.

1. నడునిలుపు లే కొరుల నయమైన
యొడమిఁ గొనఁ బేరాస పడినఁ, గులమున్
జెడఁజేసి చేటులను నపుడె యిడు :—
కుడుపుఁ బేరాసలు దురాసదస్త్రీన్. [విషమును] 171

1. పడయఁగల ఫలములం బేరాస
పడి, దూష్యకృత్యములఁ జేయ రెపుడున్
నడియునికి లేమి వెఱచెడువారు :—
కడిఁది యగు కడిఁది విడు దురాశాస్త్రీ. [విషము] 172

3. చిఱుసుకము కొఱకుఁ బేరాస పడి
మొఱఁగి ధర్మము కానియవి చేయరే,
పరసుఖం బాసించు ధీవరులు :—
వరధర్మనియతి, యిహపరసుఖస్త్రీ. [సాధనము] 173

4. లేనివార మని పేరాస పడ,
రేను విషయంబులను గెలిచి, కలుచల్
లేనట్టి పరమార్థదర్శనులు :—
లేని వాసింపమియె కద దమస్త్రీ ? 174

5. అలకనై విరివైన యెఱుక యెం
దులకు, నెవ్వరియెడనుఁ, బేరాసతో
మలసి తొందరపనులఁ జేయునెడ ?—
తెలివి కల్యాళయొకొ లక్షణస్త్రీ ? 175

6. అరులుఁ గొఱలఁగ మఱగి, నెఱి విల్చి
నరుఁ, దొరుల యొడమిఁ గొఱలఁగ మఱగుచున్
దురితచరితముల యోచింపఁ, జెడు ;—
అరు లెడర, నిరు లడరు జీవనశ్రీన్. 176

7. కోరఁగా వలదు పేరాసచేఁ
జేరు సంపద ; ననుభవించెడు తఱిన్
దీరి మే లగు టరిది తత్ఫలము :—
కూరు నపహరణమున నపహృదుశ్శ్రీ. [విషము] 177

8. కొఱ రామి సంపదకు, నేది తగు
వెర వనినఁ, బేరాస పడమి వలయున్
పెఱవాని సొంత మగు కైసొత్తు :—
పరితృప్తి వలన స్థిర మగు స్థితశ్రీ. 178

9. ధర్మంబుఁ గని పరధనాపహృతి
కర్మ మెలయని జ్ఞానయుతులఁ జేరున్,
నర్మిలిన్ వెరవుఁ గని యన్లై, సిరి :—
ధర్మంబె మర్మంబుగాఁ గలది శ్రీ. 179

10. క్షయ మీను, రాఁగలది యెన్నరయె
నయ మెడపి, పరధనం బాసించినన్ ;
జయ మీను ననపేక్ష యను పెంపు :—
అయమొకొ ?—దురాశ—నాశకరదుశ్శ్రీ. [విషము]

19 వ అధికారము

# వెనుక దూఱమి.

1. పాడినిం గొనియాడనట్టి దై
కూడనిపి చేసినను, నొకఁడు, వెనుకన్
బీడు మా టాడఁ డనఁబడు టింపు :—
బాడీల నాడమియు యోగ్యతాశ్రీ. 181

2. పాడివిం దెగనాడి కూడనివి
మూతఁ జేయుటకంటెఁ గీడె, వెనుకన్
బీడాడి, యెదుట బొంకుచు నగుట :—
వేడబపు బ్రతుకు ఫల మత్యఘశ్రీ. [విషము] 182

3. వెను దూఱి, మును బొంకి, యసువులతో
మనుకంటెఁ, జచ్చుటయె ధర్మశాస్త్రం
బనుగుణంబుగఁ జెప్పు పెంపు విదు : —
తన కొలయుఁ గుడుప దంతటి యఘశ్రీన్. [విషము]

4. క న్నెదుట నిల్చి కన్నోటు లే
కెవ్వి యన్నను, నుడువరా దెన్నఁడున్
మున్ను లేనపుడు వెన్గనని నుడి :—
వెన్నంటు వెనుదూఱు దుష్కృతశ్రీ. [విషము] 184

5. పాడి నుడివెడు సహృదయుఁడు గామి,
చూడనపు డొరుని వెను దూఱు కతమౌ
కీడుపాటునను గానంబడును :—
పైడాఱు, లో డాఁచలేదు దుశ్శీన్. [బుద్ధివి] 185

6. పరుని తప్పెంచి వెనుదూఱు వాఁ,
దొరులచేఁ దనదు తప్పులయందునుం
బొరితప్పు లరయఁబడి, దూఱఁబడు :—
ఎఱిఁగి తన తప్పు, వగచుటయె సుశ్రీ. [బుద్ధి] 186

7. పగులు వగ నాడి నెయ్యులను నెడ
తెగఁ జేయుదురు, సొగియు వగ నాడుచున్
దగ నెయ్య మాడఁ దెలియవివారు :—
తెగడఁ, బగ నెగడి, నెగు లగు మనశ్శ్రీన్. 187

8. ఏలసి మెలసెడు వారి తప్పులును
వెలిఁ జాటు నైజ మగువా, రేమొకో
సలుపుదు, రెదియుఁ గానివారియెడ ?—
తలఁకక, దొం దే చెడుగునకును, దప్పి. [బుద్ధి] 188

9. పాడిఁ గని మోయుఁ గాఁబోలు ఘుపి,
జాడఁ గని, వెనుకపడ, బీడుమాటల్
గోడగించెడు దుర్ముఖుని బరువు ?
తూడనిపియును మోయుఁగద క్షమాశ్రీ. 189

10. పరుని దొసఁగును బోలెఁ, దన దొసఁగు
సరిమరిక లేక కనఁ గల్గునెడలన్
జెఱు వుండునో మనెడు నుసుఱునకు ?
పరమశుభ మాత్మపరిశీలనశ్రీ. 190

20 వ అధికారము

# వ్యర్థములు పలుకమి

1. పలు తెలివరులు వెగటుపడ, వ్యర్థ
ములు పల్కునాతఁ డెల్లరిచేతనున్
జులుకనగ వింధింపఁగాఁ బడును :—
ఫలయుతోక్తులఁ గదా గౌరవశ్రీ ? 191

2. ఫలవిహీనములఁ బలువుంద్ర మున్
పలుకు టెన్నఁగ, నయవిహీనంబులన్
జెలులయెడఁ జేయుకంటెనుఁ జెడుగు :—
పెలుచునుడు లెడపు విహాపరసుఖశ్రీల్. 192

3. నయహీనుఁ డితఁ డనెడునది తెలుపు,
బయలుపడ నొక్కండు ఫలహీనముల్
నియతి లేదు విరివి నొడిగెడు నుడులు :—
ప్రియనయానయము సార్థకవచశ్శ్రీ. 193

4. నయము చేయవివి యె ననుపునుం
డియును నీఁగును, ఫలము చేయువివియౌ
నయోగ్యోక్తములు పలుపురలోన :—
నయనియతవాక్కు లిడు సున్నతిశ్రీన్. 194

5. పేర్మి మేలిమితోడ నెడఁబాయు,
దుర్ముఖులుగా, ఫలవిహీనంబులన్
నిర్మలగుణాన్వితులె వాకొనిన :—
ధర్మఫలయుక్తోక్తు లిడు శుభశ్రీల్. 195

6. పీటఁబోయెడు సుతుల మాటికినిఁ
బాటించువాని నరుఁ డనఁగ పల దే
పాటియును, నరులఁ బొల్లనవలయు :—
లోటు ప్రేలరి తలను నృపేదశ్శ్రీ. 196

7. అనయంబు లవిన నందురుగాక,
గుణపూర్ణు, లెపుడైనఁ బొంపాటుచే,
ననర్థంబుల ననమియే నయము :—
వినింద్యము, వ్యర్థ మౌనెడ వచశ్శ్రీ. 197

8. అరిదివగు ఫలములను నరయఁగల
యెఱుకగలవారు వాకొన రెన్నఁడున్
వరఫలదములు గాని మాటలను :—
పరమఫలదాయకము వాక్తపశ్శ్రీ. 198

9. సురుచిరార్థములు తీఱిన సుడులు
పొరపడియునే నుచ్చరింప రెపుడున్
మరులు తీఱిన విమలదర్శనులు :—
పరమార్థ సాధనము వాక్తపశ్శ్రీ. 199

10. పలుకవలెఁ బలుకులందలి ఫలము
గలవె ; పలుకఁగరాదు పలుకులందున్
ఫలవిహీనంబు లగు పలుకులను :—
ఫలవంత మగు నియతవాక్తపశ్శ్రీ. 200

21 వ అధికారము

# పాప కర్మ భీతి.

1.　దురితచరితాత్ము లంజరు, సుకృత
చరితాత్ము లగు శ్రేష్ఠు లంజుదు రొగిన్
దురాకృత మనెడు వ్యామోహమును :—
పురాకృతవాసనలు విడ వసుశ్రీన్.　　　　201

2.　ఎగ్గు లుసు అంటి యె గ్గిడుట, నా
యెగ్గు, లొడలునె కాల్చు నగ్గికంటెన్,
వెగలంబులుగ బెగ్గిలఁ దగును :—
అగ్గలపు లగ్గు లిడు సుకర్మశ్రీ.　　　　202

3.　జ్ఞానములలో నెల్లఁ, దలయంత్రు,
హానికరకర్మములఁ, బగవారికే
యేని, నెన్నఁడునుఁ జేయక విడుట :—
హాని, చేసినవాని, కగు సఖశ్రీ [విషము]　　　　203

4.　మఱచియును బరుని చెఱ పెన్నరా
దొరువుఁ ; డెన్నిన, ధర్మదైవ మెన్నున్,
పెఱప కా యెన్నినాతని చెఱపు :—
చెఱ బొందువాఁడె చెఱ పెన్ను దుశ్శ్రీన్. [బుద్ధివలన]

5.　లేనివాఁ డని చెడుగులను జేయఁ
బూనరా దొక్కండు ; చేయునేనిన్
లేనివాఁ డగు మఱియు నన్నిటను :—
ప్రాణముం దొడరుఁగద దుష్కృతశ్రీ. [విషము] 205

6. దుడుకు పాలిటివి తాఁ బెఱవారి
యెడఁ జేయరా, దిడుమ పాలిటివి త
న్నడలఁ జేయుటకు గోరనివారు :—
కుడుపు నాగడము మఱిమెయి నఘశ్రీన్. [విషమును]

7. ఎంత వెలిపగ యున్న వారలును
వంతలం దప్పుదురు ; చెడుగుపగయో
సుంతయు విడక వెన్దవిలి వేఁచు :—
అంతర్గతారాతి దుష్కృతశ్రీ. [విషము] 207

8. కీడు లొనరిచినవారలు చెడుట,
తోడఁబడి యెందు నొక్కని నీడ తన్
వీడ కడుగునఁ బొందు నట్టిదియె :—
పీడ విడుఁ గుడిపి దుష్క్రియ లఘశ్రీన్. [విషమును]

9. తన్నుఁ దాఁ బ్రేమించు వాఁడేని,
నెన్నండు నొకఁ డొరుల కెట్టి యొండున్
బన్నరా దాగడము పాలిటిది :—
బన్నములఁ బన్నమి స్వరక్షకశ్రీ. 209

10. అరిది, కీ డొందు టొకఁ, డసునద్ది
యెఱుఁగవలెఁ, బెడదారి నడచి చెడుగుల్
పెఱవారలకుఁ జేయఁడే యేని :—
చెఱుపరియె చెడుఁ, గుడిచి యఘఫలశ్రీన్. [విషమును]

22 వ అధికారము

## లౌకిక మెఱిఁగి యుపకరించుట.

1. మఱుమేలుఁ గోరనివె యుపకృతులు ;
కురియు మబ్బుల కేమి చేయునొక్కో-
మఱుమేలునుం బ్రాణిలోకంబు ? :—
సరకు బేరముఁ బోల దుపకృతిశ్రీ. 211

2. కడఁగి గడియించిన యొదమి యెల్ల,
ముడియ గట్టుటకుఁ గా, దర్హుల కౌగిన్
గడలుకొని మేళ్ల చేయుటపొంటె :—
ఇదక యొక్కఁడె కుడుచునెడఁ జెడును శ్రీ. 212

3, సురలోకమందు నిహమందునున్
బెరయుచే యరిది, యుపకారము వలెన్
వఱలఁగల సత్కర్మములు వేఱె :—
పరమ మగు ధర్మ ముపకర్తృతా శ్రీ. 213

4. లోక మొప్పున దెఱుఁగువాఁ డుసుఱు
మేకొని బ్రతుకువాఁడు ; తదితరుండో
చీకు బ్రతుకున మృతుల నెన్నఁబడు :—
లౌకికోపకృతి జీవధర్మశ్రీ. 21

5. ఊరి దొరువున నూరి, నీరు, నిం
డారు నట్లొ, లౌకికాచారమున్
గోరు పేరెఱుక గలవాని సిరి :—
ఊరకే, యొదవమిని, జెడు జలశ్రీల్. 21

6. ఫలవృక్ష మూరి నడుమను జనం
బుల కొదవునటు ఫలించుట యట్టిదే,
కలిమి నయయుతునియెడఁ గలుగునెడ :—
పలువురకు నుపకరించుట నయశ్రీ. 216

7. మందై యెపుడుఁ దప్ప కందుబా
టందుండు ప్రూనట్టిదే, కలిమి తాఁ
బెందగవుకానియం దమరునెడ :—
కుందుపా టెన్న కొదవుట నయశ్రీ. 217

8. సిరిలేని కాలంబు నందునున్
బరుల కుపకృతిఁ జేయ సడల, రిలలో
నరజన్మవిధు లెఱుఁగు దర్శనులు :—
సిరిలేక నెఱయదొకొ స్వధర్మశ్రీ? 218

9. ఉపకారనయయుతుఁడు దీనుఁ డగు,
నెపుడునుం జేయఁ దగినవి చేయమిన్
దపియించు నమరని స్వభావంబు :—
ఉపకారి మమకారి కాఁ డెపుడు శ్రీన్. 219

10. ఉపకృతిని వచ్చుఁ గీ డనిన, న
య్యాపనయం, బొకఁడు, త న్నమ్ముకొనియే
నపేక్షం బూని, కొనఁ దగిన యది :—
ఉపకారి కగు నవల శుభఫలశ్రీ. 220

23 వ అధికారము

## ఈవి.

1. నిఱుపేదకున్ వలయు నొం డిచ్చి
మఱచు టే యీవి ; తక్కినవి యెల్లన్
గుఱి నెదురుచూచు నైజము కలవి :—
మఱుకోర్కి లేనిదే సుదానశ్రీ. 221

2. మేలి తెరు వనినసుం గైకోలు
చాల దోసంబు ; పైలోక మమరం
జాల దనినను ఈవియే నయము :—
మేలైన ధర్మంబు దాతృతాశ్రీ. 222

3. "లేనివాఁ" డను పేదనుడు లనమి
లేనివారల కిడుట యుచితరీతిన్
మానితకులీనునందే యుండు :—
మాని, దానియు సేనిఁ గులీనశ్రీ. 223

4. ముద మవదు యాచింపఁబడుటయును,
నెదుట దైన్యము నొందు యాచకునిదౌ
ముదితవదనముఁ గాంచు నందనుక :—
ముదిమారఁ దనుపునదె సుఫర్మశ్రీ. 224

5. ఓపు గల తాపసుల యోపు, —లో
వేఁపు నాఁకలి యోపు,—అయ్యాఁకలిన్
మాపు వారల యోపునకు వెనుక :—
ఓపు నా నమరు శక్తిశమాశ్రీల్. 225

6. లేనివారల కడిఁదియాఁకలివి
మానుచుట వలయు నదె యొకఁ డుఱిదిగాఁ
నార్జితార్థముల దాఁచెడు నెడము :—
దానధర్మము క్షేమవిధానశ్రీ. 226

7. దీనులకుఁ బంచి తిను టలవడిన
వాని, నాఁకలి యనెడు చెడ్డతెగు, తే
మై నైన వ్రేఁచ నంటుట యరిది :—
తానె తన వైద్యుఁ డన్నదానశ్రీన్. 227

8. ఇడి పేదలకుఁ, దుష్టి, సహృదయులు
కదలుకొను టెఱుఁగరొకో, తా మొదమినిన్
ముడియ నిడి కోల్పడెదు కట్టిఁడులు? :—
ఇడక, కుడువక, దాఁచుటే ముదమొ శ్రీన్? 228

9. బిచ్చ మెత్తుటకంటె నప్రియము,
నిచ్చయము, సొత్తు వెలితిని నెఱపుటే
యిచ్చఁగొని, తామె యొంటిగఁ దినుట :—
విచ్చపొచ్చెమె పిసిని, కుండియును శ్రీ. 220

10. చావుకంటెను నప్రియము లేదు ;
భావింపఁ, బ్రియమైన దగు నద్దియే,
సీవియే యలవి కాకున్నయెడ :—
జీవి కీవియె కదా స్వభావశ్రీ ? 230

24 వ అధికారము

## పొగడ్త.

1. ఈయవలెఁ బేదలకు ; ఘనవినుతి
మ్రోయఁగా బ్రతుకవలె ; నదికాక వే
ఱాయ మేమియును లే దుసుఱునకు :—
ఆయుష్కరాన్న దాతకు శుభశ్రీల్. [కీర్తులు]

2. వినుతించువారు పలుకున వెల్ల
ననుకంప నర్థి కొం డిడువారిపై
ననవతరమును నిల్చు సత్కీర్తి :—
ఎన లేనియది దానహైతుకశ్రీ. [కీర్తి] 232

3. అద్వితీయముగ లోకమునందు,
నుద్వేలనుతి కాక, పోకుండ యా
వద్వేళ నిల్చు నొండును లేదు :—
సద్వ్రతము నేఁటికివి శిబిశ్రీ. [కీర్తి] 223

4. ఇల వఱను విగుడు పొగడిత నొందఁ
గలఁడే నొకండు, జ్ఞానుల నెచ్చుగాఁ
దలఁచి మెచ్చదు స్వర్గలోకంబు :—
వెలయ దిల జ్ఞానికి యశస్తనుశ్రీ. 284

5. ఘనకీర్తితనువృద్ధి నగు భూత
తనుదైన్యమువు, నొం దనుర నొంటి చా
వును, విదగ్ధులకుఁగా కిల నరిది :—
తనుధనాస్థిరతఁ, గొనఁ దగు స్థిరశ్రీన్. [కీర్తిని] 235

6. తోఁచునెడఁ బొగడఁదగు గుణముతోఁ
దోఁచవలె నెటను ; అది లేనివారల్
తోఁచుకంటెనుఁ దోఁచమియె మేలు :—
తోఁచు నౌదార్యాదులనె యశశ్శ్రీ. 236

7. పొగడువడ మిడుకనట్టిఁడులు, తమ
తగని నెటి నొచ్చుకొనకుండి, తమ్ముం
దెగడు వారిని నొంచు టది యేమొ ? :—
పొగ డొంద నడ దిద్దుకొనుట సుశ్రీ. [బుద్ధి] 23

8. అగ డంద్రు జగతీజనులకెల్ల,
నెగడ నలుగడల నొగి, నగత్యంబౌ,
పొగ డనెడు మిగులు బెరయుర యేని :—
నిగుడదే యిరులు, లేమిని ద్యుతిశ్రీ ? 2[illegible]

9. పా డవని పైరుపంటయుఁ గుంది
బీ డగును, సద్యశము లేనట్టిదై
కీడుపడు మెయిని మోసిన నేల :—
పాడి నెఱపని పాపి కెట యశశ్శ్రీ ? 2

10. అగడెడయ మనువారె మనువారు ;
పొగ డెడయ మనువారు మననివారే
యగుదు, రిల మను పీనుఁగులె యగుట :—
మిగుల, గడియింపఁ దగినది యశశ్శ్రీ.

# కరుణాసంపద.

1. కవికరపుఁ గలిమి పలు కలుములం
దును బలుకలిమి ; ద్రవ్యముల కలుములో
మనుజాధములయందునుం గలవు :—
మను నుసుఱు లోమునది కద కృపాశ్రీ ? 241

2. మేలి నెఱి నరసి, కరుణాధర్మ
మేలవలె ; పలునెఱుల నేది యగునో
గాలించి యరసినను, నదె తోడు :—
తూలఁబాఱక యేలుఁ గృప యసుశ్రీన్. 242

3. అరులు చేరిన సహృదయులకు లే,
దిరులు చేరినదియై, దుఃఖకరమౌ,
నరకలోకమునందుఁ జొఱఁబడుట :—
మరులు మరలదె, యరు లలర, మనశ్శ్రీన్ ? 243

4. మను నుసుఱులను నోమి, దయ నేలు
కొను మనుష్యునకు లే, దందురు బుధుల్,
తన యుసుఱు వెఱపొందు దుష్కర్మ :—
కవికరంబునఁ గల్గ నహింసాశ్రీ. 244

5. అలజడియె కరుణాళులకు లేదు ;
చలదనిల మొలసి వర్ధిలు మహోర్వీ
వలయమున మను ప్రాణులే సాక్షి :—
కలుగు సుఖ, మిహమందునుం, గృపాశ్రీన్. 245

6. పాడివిన్ వీడుటనె మును, పిపుడు
కీ డయ్యె నని మఱచి, రందురు, దయన్
వీడి, కావివి చేసి, మను జనుల :—
కూడ( బడు గోడు, వీడిన దయాశ్రీన్. 246

7. కరుణావిహీనులకు లే దల్ల
సురలోకసుఖము, ధనహీనులకు నీ
నరలోకసుఖము లే దయినట్లె :—
అరులుననె సురలకును( బరసుఖశ్రీ. 247

8. ధనహీను లెచ్చెుదు రొక కాల
మునను విధిచే( ; గృపాహీను లేనా(
డును హీనులే ; వేఱె యగు టరిది :—
అనుకంప( గను నింపు, జీవనశ్రీ. 248

9. ఎఱుక లేనత(డు సత్యార్థంబు
నరు దొనర( గన్నట్టులే, యరసినన్,
గరుణ లేనత(డు చేసెడు పాడి :—
పెఱపాడు లురువడునె, యఱ( గృపాశ్రీ ? 249

10. బల్లిదుల ముం దదురు తన యువిక్క(
దొల్లి( దల(పవలె( దా(, దనకు లొచ్చొ
నెల్లిదుల పయి కదరి చెల్లునెడ :—
ఎల్ల( దన్వలెనె యెంచుట దయాశ్రీ. 250

# మాంస నిషేధము.

1. తన తనువుఁ బెంచుటకుఁ దా నన్య
తనువునుం జవులూరఁ దినునాతఁ, డే
యనువునను నేలునొకో కనికరము ? :—
తనవంటి దవదో యన్యభూతశ్రీ. 251

2. ధనికతాఘనత రక్షణము చే
యనివారలకు లేదు ; కారుణికతా
ఘనత లే, దట్లె, పొలదిండులకు :—
తినుట, పరతనువు, లేమినె కృపాశ్రీ. 252

3. కొలకత్తిఁ గైకొన్నవారి మది
వలెనె, దయఁ దలఁప దింకొక యొడలిదౌ
పొలసు చవులూరఁ దినువారి మది :—
పొలకుడుపు, కుడుపుఁ గొల నగు నఘశ్రీన్. [విషమును]

4. కనికరము కావియది యే దవిన,
సునియమాహింసనము హింసించు టౌ ;
అనర్థం బా మాంసమును దినుట :—
అననుకంపను జంపు టనర్ఘశ్రీ. 254

5. తినమి గుణమైన దుసుఋనికి ;— పొలఁ—
దివిన, నుసుఋను ద్రమింగి వాపుచ్చు, దా
వెనుక, నారకపంకకూపంబు :—
తివిన నంజుడు, నంజుఁ దిను నసుశ్రీ. 255

6. తినుపొం౯్తె నై వధించదు లోక
మవినయెడ, నెవ్వరును, వెలపొం౯్తె నై
మొనసి పొల సమ్మువా రుండ రిల :—
తినుట పొల, కొలకుఁ గత, మత్యఘశ్రీ. [విషము] 256

7. తినమి వలయును బొలను, హింస నొం
దిన మతొక యొడలి పుం డది, యశుద్ధం,
బని, తెలివి వాఁడినిన్ బెరయునెడ :—
వ్రణముఁ దిను నీచతయొ మనుజతాశ్రీ ? 257

8. దొసఁగు తలఁగిన తెలివి గలవారు
మెసవలే రెన్నఁడును నపవిత్రమౌ,
నుసుఱు తలఁగిన యొడలి మాంసమును :—
నసి చెడిన శవ మెట్లు సుభోజ్యశ్రీ ? 258

9. హవిస్సుం బోసి వే వేల్మలను
దివిరి వేల్చుటకంటె, నొక ప్రాణి, నా
యువు మూఁడఁ, దునిమి, తినమియె మేలు :—
భవిక మామిషనిషేధవ్రతశ్రీ. 259

10. హింసింపఁడై యొక్క ప్రాణినిని,
మాంసమునుఁ దిననతనిఁ, గైమోడ్చి, యా
శంసించి, యెల్ల జీవులుఁ గొలుచు :—
ధ్వంసితం బగు, నొండె, నసుగతిశ్రీ. 260

# తపము.

1. కలుగు నోవుల నోర్చుకొనుటయును,
మెలఁగు నసుఋల కెగ్గు చేయమియు ;—ఆ
కొలఁది గలదే తపోరూపంబు ;—
పలు నియతు లడకములు తద్వ్యపశ్రీన్. 261

2. తపోరూపముఁ, దపోవిధులఁ బ్రా
క్పుపరిచితులకె యగు ; వృథా, దాని, నా
యుపపత్తి లేనివా రూనునది :—
తపసివేడఁబ మాత్మవంచకశ్రీ. [విషము] 262

3. సన్యాసులకుఁ గుడుపు లిడెడు సే
వాన్యాయమును గోరి మఱచిరొక్కో—
అన్యు లగు గేస్తులు తపశ్చర్య ? ;—
ధన్యము, నసామాన్యమునుఁ, దపశ్శ్రీ. 263

4. ఎదిరించువారలను నొంచుటయు,
ఎద నించువారలను బెంచుటయునున్,
మది నెంచఁ దపముచే నేతెంచు :—
కుదిరించు నెదియు, మించెడు తపశ్శ్రీ. 264

5. వేఁడినవి వేఁడినట్టులుగ సమ
కూడుటను, జేయఁ దగు తప మిమ్మెయిన్,
వాడి యని, బుధులచేఁ గడఁగఁబడు :—
పీడు నైహికబంధ మొగిఁ దపశ్శ్రీన్. 265

6. తపముఁ జేసెడువారు తమ కర్మ
మెపుడుఁ జేసెడువారు ; తద్రహితులో,
అపకరించెద రాసలోనఁ బడి :—
తపఃకర్మఫల మాత్మము త్రిశ్రీ. 266

7. వేఁచవేఁచగ మెఱచు పొన్నువలె,
రోచిస్సు వెలివీచుఁ, గ్లేశం బొగిన్
వేఁచవేఁచఁగ, నోఁచు చతురులకు :—
పాచుఁ గలుచలఁ, రేఁచు జిగిఁ, దపశ్శ్రీ. 267

8. తన యుసుఱు, నేంద్రియముఁ, దా నగ్గ
మొనరించుకొ న్నతనిఁ, దక్కినవి యా
మను నుసుఱు లెల్ల, సంసేవించు :—
ముని యెనయు నిగ్రహానుగ్రహశ్రీన్. 268

9. యముని మీఱుటయునుం జేకుఱును,
శమదమాంచితతపోనియమంబులన్
సమర్థత తలకొవిన వారలకు :—
యముఁ డడఁగె మార్కండు తపస్యాశ్రీన్. 269

10. లేనివా రవనిలోనను బలువు
రైన కారణము : తపసులు కొందఱే ;
పూవి, పలువురు, తపింపనివారు :—
జ్ఞానార్థదైన్యహైన్యము తపశ్శ్రీన్. 270

# కూడని నడత.

1. వంచకాత్మునియొక్క, యోగ్యుఁ డని
పించుకొన నటియించు, దొంగనడతన్
బంచభూతములు లో నవ్వుకొను :—
పాంచభౌతికమె కద శరీరశ్రీ? 271

2. మి న్నెత్తు తపసివాలకము మే
కొన్న నేమిటిఁ జేయుఁ, దన మనసె తా
ము న్నెఱింగిన తప్పుననె పడిన ?—
సన్నాసివేస మెడపునె యఘశ్రీన్ ? [విషమును] 272

3. బలహీనతయె సహజ మగు వాని
బలవత్స్వరూపవహనము, గోవు, తాఁ
బులితోలుఁ గప్పి, పులు మేయు నటె :—
తలఁ పడఁచు బలము లే కెటు తపశ్శ్రీ ? 273

4. మునివేషమున మఱుఁగుపడి కాని
వానరుచుట, పొద మఱుఁగునన్ వేఁటకాఁ
డునికిఁ గొవి పిట్టలను బట్టు నటె :—
మునివృత్తి యధమకామాప్తికొకో శ్రీ ? [సాధనము]

5. "పట్టుడిగితిమి !" యను జటుల నటన,
"యె ట్టెట్టు !!" లనుచుఁ దమ వేదఁములన్
బిట్టు వగవఁగఁ, బెక్కు లిడుమ లిడు :—
వట్టి యాటయొ, నెఱపఁ, దపస్యాశ్రీ ? 275

6\. మతి నాన లుడుగకయె సంగవ
ర్జితులు వలె, దాతలను వంచించుచున్,
బ్రతుకువా రట్టి క్రూరులులేరు :—
కితవులకు దానమిడ, ఫల మఘశ్రీ. [విషము] 276

7\. పైని గురువెందవలెఁ దోఁచువా
రైననున్, మనసు గురువెందముక్కున్
బోని కటివారుఁ గల, దీ జగము :—
మైవిఁ గావియొ తపస్స్వరూపశ్రీ ? 277

8\. మనసులోనిది మాసి గాఁగ, మహి
మను గొన్నవా రట్లు, నీ రాడి, దం
బున మఱిఁగి, మను మునులు పలువుండ్రు :—
మునివేషి నెఱిఁగి నీఁగుటె నయశ్రీ. 278

9\. బాణంబు ఋజు వయ్యుఁ గ్రూర మగు,
వీణ వక్రం బయ్యు హృద్య మగు ; నా
పోణిఁ, జేష్టాగుణముఁ గొనవలయు :—
కానఁబడునది కాదు స్వభావశ్రీ. 279

10\. ముండనమొ, శీర్షంబునను, జటో
ద్దండనమొ, వలదు తాపసులకు, జగ
త్పండితవిషిద్ధగతిఁ దొఱఁగు నెడ :—
చెందు నెడ వలపుఁ, బందును దపశ్శ్రీ. 280

# దొంగిలింపమి.

1. దూఱు పడమివి గోరు నసువాఁడు,
మీఱి యే యొక్కటియు దొంగిలింపం
గోర నటు కావవలెఁ దన మదిని :—
కోరఁదగుఁ దపసి కేవలపరశ్రీన్. 281

2. ఉల్లమునఁ జెడు గెంచుటయుఁ గీడె ;
మెల్లఁగాఁ బెఱవాని దగు ద్రవ్యమున్
గల్లచేఁ గొంద మనుకొన వలదు :—
కల్లసన్యాసి కుడుచున దఘశ్రీ. [విషము] 282

3. వంచనం గలుగు నర్థంబు, మితి
మించి, పెంపొందు చున్నది వోలెఁ దోఁ
పించుచునె, మొదలంటఁగాఁ జెడును :—
వంచనను సంచితం, బనర్థశ్రీ. [విషము] 283

4. కల్లతన మందుఁ గవిసిన వేడ్క,
యల్లనన్ ఫల మిచ్చు సమయంబునన్,
గ్రుళ్ళవడి వీడ్కొనని యిడుమ లిడు :—
బెల్లించి కుడుచునది, దుష్ఫలశ్రీన్. [విషమును] 284

5. కరుణ గుఱికొని ప్రేమయుతు లగుట,
పరుల ద్రవ్యమును గుఱికొవి, వార లే
మఱెడు తఱి వేచు వారికి, లేదు :—
కరుణ చొఱఁబడగు చౌర్యావృతశ్రీన్. [బుద్ధియందు]

6. అలపియందున నిల్చి జీవనము
సలుపఁజాలరు, కల్లతనమునందున్
బలిసి కవిసిన వేడ్క గలవారు :—
కలుగునే కల్లరికి వివేకశ్రీ ? 286

7. వంచకత యనెడు కారెఱుక వహి
యించుట, ప్రమాణ మను పేరెఱుక నా
సించువారల యందునన్ లేదు :—
మించి నిల్చునె యిరులు భాసురశ్రీన్ ? [కాంతియందు]

8. ప్రమాణజ్ఞుల హృదయమందు ధ
ర్మము వోలె, నిల్చుఁ, జౌర్యజ్ఞుల హృదిన్
దమకమున గమకించు మర్మంబు :—
శ్రమావాప్తం బేదియుసు విడదు శ్రీన్. [బుద్ధివి] 288

9. పాడి కావివి తలపుచేయఁగనె
పాడువడుదురు, మోస కాక వేఱొ
పోఁడుముల నరసి, తేఱనివారు :—
వేడబమ్మనకొ పయి వేడబము శ్రీ ? [సాధనము] 289

10. దొంగిలెడు వారలకు నుసురువికి,
భంగ మగు, విల ; దొంగిలని వారికో
భంగ మవ దల దేవలోకమును :—
దొంగబ్రతు కెడపు నిహపరసుఖశ్రీల్. 290

# వాస్తవము.

1. వాస్తవం బనఁ బడున దే దనినఁ,
బ్రస్తవం బే యొకటియును, బాధలే
కస్తోకముగ మాట లాడుటయె :—
స్వస్తి చెడు నిజ, మవదు వాస్తవశ్రీ. 291

2. అనృతవాక్కులును సత్యస్థాన
మునఁ జెల్లుఁ, బెఱవారలకుఁ గీడు తీ
ఱిన నయము ఫలియించునే యేని :—
అనయ మిడు ఋత, మవదు సూనృతశ్రీ. 292

3. తన మన స్సెఱిఁగినది బొంకరా
దనన్యావగత మని ; బొంకినయెడన్
దన మనస్సే తన్ను వేఁగించు :—
అనవరతసాక్షి యంతరాత్మశ్రీ. 293

4. ఉల్లమారఁగ బొంక కొకఁడు వ
ర్తిల్లిన, జగజ్జనుల యుల్లంబులం
దెల్ల సంభావితుండయి యుండు :—
బొల్లమికి నిహఫలము స్థిరయశశ్శ్రీ. 294

5. మనసార నొకఁడు వాస్తవమె వా
కొనునాతఁ డయినఁ, దపమును, దానమున్,
బొనరించు వారికంటెను ఘనుఁడు :—
అనృత మాడమియె ధర్మోత్తమశ్రీ. 295

6. బొంకు లాదమివంటి పొగడుకత
మింకొకటి లే,— దొకని—, కెఱుఁగఁబడకే
పొంకపడ నెల్ల ధర్మములు విడు :—
కొంకవలె బొంకఁ జెడు నవి శుభశ్రీల్. 296

7. బొల్లమివి, బొల్లవమిగా నెఱప
వల్ల నగునేవి, ధర్మము లితరముల్
చెల్లఁజేయమిఁ, జేయమియు నయమె :—
ఎల్ల పాదులు విముడు సూనృతశ్రీన్. 297

8. బహిరంగశౌచంబు నీటిచే
రహియించు ; నాంతరంగికశౌచమో
మహితసత్యమువలనఁ గానఁబడు :—
ఇహపరసుఖప్రదము ద్విశౌచశ్రీ. 298

9. ఎల్ల వెలుగుఁలును వెలుఁగులు కావు
వెల్లడివి ; నియమపూర్ణులకు నెపుడున్,
బొల్లమివెలుంగే వెలుం గగును :—
ఉల్లంపు టిరులు తెరలును బుతశ్రీన్. [కాంతివలన]

10. మేము నిజముగఁ గన్నవాన, లే,
వేమైన నొక భావమునను సత్తున్
బైమించు మేలైన, యితరములు :—
సామాన్యధర్మమొకొ యథార్థశ్రీ ? 300

# కోపింపమి.

1. చెల్లు నెడ నణఁచువాఁడే, కినుక
త్రుళ్ల, నణఁచెడువాఁడు : చెల్లని యెడన్
ద్రుళ్లణఁచి యేమి, యణఁచక యేమి ? :—
ఎల్లిదులపైఁ గినియమియె నయశ్రీ. 301

2. చెల్లని యెడనుఁ గినుక కీడగును ;
చెల్లు నెడనో, లేవు దానికంటెన్
బెల్లలఁదు రగు కీడు లితరములు :—
ఎల్లెడలఁ గినుక నణఁచుటె నయశ్రీ. 302

3. మఱచిపోవలయుఁ గోపంబు నె
వ్వరిమీఁద నైనఁ ; గీడులు వొడము నె
వ్వరికైన, దానివలననె వచ్చు :—
చిరకోపి కుండ విహపరసుఖశ్రీల్. 303

4. నగవునున్ సుగమునున్ గొల చేసి
వగను గూర్చెడు కోపమునకంటెనున్,
బగలునున్ గలవాకో వేఱుగను ? :—
తెగడఁబడదే నలుక, వెగడుపడు శ్రీ. [బుద్ధి] 304

5. తన్నుఁ దానొకఁడు కాచిన, నలుక
తన్నంటనటు కావ వలెఁ ; గావఁడో,
తన్నె కొలనేయు, మొనకొవి, కినుక :—
చెన్నడిగి చెడుఁ గ్రోధమున మనశ్శ్రీ. 305

6. కినుక యనఁబడు నాశ్రయాశంబు,
తనకుఁ బ్రాపగువాని హితవర్గ మన్
నెనరుతెప్పనుఁ గూడ వేఁగించు :—
కనలె, యనలము మించు, ఘోరదుశ్శ్రీ. [విషము] 306

7. కినుక నొక సామర్థ్య మని కొనెదు
మనుజునకుఁ గీడు, నేలను బలిమి గ్రు
ద్దినవాని చేతి కటు, తప్పనిదె :—
తన కినుక తనకె ప్రతికూలదుశ్శ్రీ. [విషము] 307

8. నెగగుంపు పైఁ బడిన యంత దుం
డగము లొనరిచిన నొకఁ, డతని, శక్యం
బగునేనిఁ, గోపగింపమి నయము :—
నెగడవలె యతులయం దతిశమశ్రీ. 308

9. ఉల్ల మెంచిన దెల్లఁ దోడనే
చెల్లుఁ దపసికి, నాతఁ డుల్లంబుచే
నొల్లఁబోవున యేవిఁ, గోపమును :—
మళ్ళఁగ్రుధ, పెల్లయిన నెదఁ, గృపాశ్రీ. 309

10. మితిమించు కోపు, లజ్ఞానమున,
మృతు లైన యట్టిఁడులె; కోపరహితుల్
మృతిరహితు లట్టిఁడులు, జ్ఞానమున:—
స్థితిగతులు చెడును, మతి చెడి, క్రుధాశ్రీన్. [విషమున]

# అప్రియములఁ జేయమి.

1. ఉరుయోగ మీను నైశ్వర్యములు
బెరయునేనియుఁ, బరుల కప్రియంబుల్
జరపమియె నిర్మలుల నిర్ణయము :—
సరళమతులకుఁ దానె పొరయు సచ్ఛ్రీ. 311

2. అలుకఁ గొని యొరులు తమ కహితముల
సలిపినపుడునుఁ, దాము ప్రత్యహితముల్
సలుమియె నిర్మలుల నిర్ణయము :—
తలఁపరా దహితకృతులనె, మతిశ్రీన్. 312

3. చేయకయె మును దాను, దన్నుఁ బగ
చేయు వారికినేని, నప్రియంబుల్
చేయునెడ నుడివోని యిడుమ లిడు :—
చేయు చెడుగునఁ జేపడున దఘశ్రీ. [విషము] 313

4. అనిష్టంబులను జేసినవారి
నణఁచ దండించు, టొగి, వారు సిగ్గున్
గొన, మంచి మేల్చేసి విడుచుటయె :—
అనయమును, జయ మెనయ, నయమె సుశ్రీ. 314

5. ఎఱుకచే నగుఫలం బుండునో,
పెఱయునుఱు నోవు తమ నోవు వలెనే
పరిరక్షణము సేయ కున్నయెడ :—
సరితలఁపె యోగ ; మధె శుభకరశ్రీ. 315

అనిష్టంబు లని తా ననుమాన
మున నెఱిఁగినవి మేకొనమి వలయు, నెం
దునను, బెఱవారియెడఁ జేయుటను :—
తనకు నెన యొరు లనుకొనుట సుధీశ్రీ. 316

7. ఎంతైన, నెన్నఁడును, నెవరికిని,
స్వాంతపూర్వము లయిన దుర్నయములన్
బంతమునఁ జేయమియె యుత్తమము :—
అంతరాత్మవిరోధనం బఘశ్రీ. [విషము] 317

8. తన యుసుఱునకు హిత మవమిఁ దాను
గను నాతఁ, దేలొకో యితరంబు లో
మను నుసుఱుల కహితము లొనరుచుట ? :—
తనవంటి వవవొ భూతము లిలాశ్రీన్. ? 318

9. పెఱవారి కహితముల మునిపగలు
జరపునెడఁ. దమకు నహితము లయినవే
సొరిది వెనుపగలు తామే వచ్చు :—
చెఱచఁ బ్రతిఫలము, చెఱ పిడు నఘశ్రీ. [విషము] 319

10. నోవు వెల్లను, నోవు లొనరిచిన
జీవులకె యగు ; నోవు లొనరింపరే,
నోవు లేమిని గోరుకొనువారు :—
జీవభువిఁ గర్మబీజజఫలశ్రీ. 320

# కొల సేయమి.

బలు ధర్మకర్మ మెయ్యది యనినఁ,
గొల చేయకుంట ;— కొల, పరకుకర్మల్
కలిగించు కీడు లెల్లను నిడును :—
కలుచ సలుపమి, యెనయు సుకర్మశ్రీన్. 321

పంచి యిడి, కుడిచి, ప ల్లుసులను
నొంచ కోముట, శాస్త్రవిదు లెచ్చగా
నెంచిన సుధర్మముల నెల్లఁ దల :—
అంచితము కాదె మహి నహింసాశ్రీ ? 322

కేవలము నుత్తమ మహింసనము ;
భావింప, మఱి, దాని వెనుకఁజేరన్
వావిరిగ, బొంక కుండుటె నయము :—
భావుకద్వయ మహింసాయుతశ్రీల్. 323

మంచి గతి యనఁబడున దే దనిన,
నించుకయు నేయొక్క ప్రాణినేవిన్
నొంచమినె యెంచి కాపాడు నెఱి :—
ముంచివేయును హింస దుస్తరశ్రీన్. [విషమున] 324

మనికి నంజికను గొని సన్యసిం
చినవారిలో నెల్లఁ, గొల నంజికన్
గొని యహింసను దలఁచువాఁడు తల :—
అనుకంప తోఁబుట్టు వహింసాశ్రీ. 325

6\. కొల యొనర్పమిని మేకొని నడవఁ
గలవాని సుఖాయుష్కాలంబుపైఁ
జెలరేగఁ దుసులు మ్రింగెదు యముఁడు :—
బలవత్క్రియకు నిమ్మెయినె ఫలశ్రీ. 326

7\. తన యుసుఱుఁ దను వెడయు చేరుపడి
ననుఁ, జేయరాదు తా, వే ఱొడలిదౌ
ననుఁగు టును తెడఁబాపు కృత్యంబు :—
తన కైన హింస నఱుఁ దన యఘశ్రీ. [విషము] 327

8\. నయమైన యుచ్చగతి పెద్ద దని
నియత మైనను, జ్ఞానులకు, వేల్మిలో
నయిన కొల, నుచ్చగతి నీచంబె :—
పయిది కద, స్వర్గతికి సద్గతిశ్రీ ? 328

9\. కొల వృత్తి యగు మానిసులు, మాంసి
కులు, —కర్మచండాలురుగఁ దోఁతుఁ,— రం
దలి నైచ్య మరయువారల మదుల :—
కొలబ్రతుకుచే నిహమునను నఘశ్రీ. [విషము] 329

10\. తొల్లిఁ బె క్కుసుఱు లొడళులనుండి
చెల్లఁ గొని, రనియెదరు, తెగులొడళులన్
జెల్లని నికృష్టజీవనుల, నిల :—
ఎల్లరకు సంసేవ్య మహింసాశ్రీ. 330

# నిలుపమి.

నిలువఁజాలని గోచరార్థముల
నిలుచునవి యని యెంచు నల్పజ్ఞతన్
దలకొనుట బ్రతుకునం గడఁబాటు :—
అల పరమె కేవలం బగు స్థిరశ్రీ. 331

నాటకపు సాలఁ బ్రేక్షణీకసభ
కూటు వగు నట్లె పెనుసిరి ; పోకు, నా
కూటు వాగిఁ జెల్లచెద రగు నట్లె :—
నాటుకొన దెచ్చటనుఁ జంచలశ్రీ. 332

విలువని ప్రకృతి గలది సిరి ; యద్ది
కలుగునెడ, మెచ్చించి, సుస్థిరఫలో
త్కాలధర్మముల నపుడె చేయవలె :—
తొలగింపవలె మమత నస్థిరశ్రీన్. 333

"నాఁడు, త నొ్నక కొలతవలెఁ జూపి,
జాడఁ బ్రాణులఁ దఱుగు వాల మది" నాఁ
జూడఁబడుఁ దెలివి వాఁడిని గొనిన :—
మూఁడు మెయి, కాలహృత మయి యసుశ్రీ. 334

నాలుకను నడఁగించి, వెక్కిళ్లు
బైలుదేఱక మున్నె, సత్కర్మసుల్
వైళంబ, తెలివితోఁ, జేయఁ దగు :—
కాలధర్మం బెపుడొ తోఁచునే శ్రీన్ ? [బుద్ధియందు]

6. నిన్న నుండిన యొకఁడు, నేఁడు లేఁ,
డన్న వగ, నిలువరింపమి పేరిమిన్
గొన్న దీ భూతప్రపంచంబు :—
వెన్నంటు మృత్యుదేవత తనుశ్రీన్. 336

7. ఒక ప్రొద్దునున్ జీవతత్వ మిం
చుకయు నఱయరు ; కాని, యెన్నునవియో,
ఒక కోటియునుఁ గావు, పెక్కు లగు :—
ప్రకటముగ క్షణభంగురము తనుశ్రీ. 337

8. అండంబు విచ్చిపోవఁగ, నందు
నుండిన పులుం గెగిరి పోవు ; నట్లే
యుండు, దేహాత్మసంబంధంబు :—
పిండమున విడియు, విధిగతి, నసుశ్రీ. 338

9. విదురఁ జెందుటను బోలును జావు ;
విదురించి మేలు కాంచుటను బోలున్
బిదపఁ బుట్టుట, యసద్దేహమున :—
కుదు రెడయు, విధివశత, సదాత్మశ్రీ. 339

10. స్థిరగేహ మమరి యుండమి నొకో,
ముఱుగు నస్థిరదేహములలోననే
యిఱుములం దిఱుకు గతి, యుసుఱునకు ? :—
స్థిరనిలయ మమరుఁ, గర్మవిలయశ్రీన్. 340

* * *

## తొఱవు.

1. దేనినుండియు, దేనినుండియునుఁ,
దాను మరలునొ యొకఁడు, నోవుపాటున్
దాన దానను లేనివాఁ డగును :—
మాను టొగి విషయముల, విరక్తిశ్రీ. [సాధనము] 341

2. వలయునెడ నొగుళు లుండమి, యర్థ
ములు కలుగఁగనె తొఱఁగవలెఁ; దొఱఁగుచో,
నిలఁ గలుగు సుగము పాలివి పెక్కు :—
వలపు తొలఁగఁగఁ, జెలఁగుఁ బరసుఖశ్రీ. 342

3. అడఁచవలెఁ బంచేంద్రియార్థముల ;
విడువవలె ననుభావ్య కామ్యార్థముల్
గడియించినవి యెల్ల నొక్కొటను :—
కడుకొను విరక్తిచేఁ బరమతిశ్రీ. 343

4. తగ వగును దపసి కొండును సొంత
ముగ లేమి ; కలిమి మోహమునకుఁ గతం
బగును మఱియునుఁ, దపముఁ బోఁగొట్టి :—
విగతమమతాప్రధానము తపశ్శ్రీ. 344

5. మఱి వేఱె తొడరుఁబా టేలొకో,
మఱుపుట్టు వఱిగింపఁ బూనిన తపో
నిరతులకు, నొడలె మిక్కిలి గాఁగ ? :—
నిరహంకృతిప్రధానము తపశ్శ్రీ. 345

6. కఱచి, యిహమునవె సత్యార్థంబు
నరసి కాంచినవారు, పొందుదు రొగిన్
మఱల విహమునకు రానట్టి నెఱి :—
గురుసేవఁ బడయవలె శ్రవణసుశ్రీన్. 356

7. ఒరసి యుల్లంబు, సత్యార్థంబు
నరమరికలే, కెఱుఁగునెడ నుఱిదిగా,
మఱి యెన్నవల, దొదవు నని భవము :—
పరమార్థ మెఱుఁగవలె మననసుశ్రీన్. 357

8. మఱుపుట్టు వను పేదఱిమి నీఁగఁ,
బరమంబు నాఁబడెడు తత్వార్థమున్
దరిసించు నదియె విజ్ఞానంబు ;—
పరసుఖముఁ బొరయవలె ధ్యానసుశ్రీన్. 358

9. ప్రా పెఱిఁగి సకలమున, కిరుపట్టు
ప్రాపుఁ జెడ నడచునెడ, మఱి యద్దమై
ప్రాపు నొందివు ప్రాప్యదుఃఖములు :—
ప్రాపణీయములు జ్ఞానయోగశ్రీల్. 359

10. కామంబుఁ, గ్రోధంబు, మోహంబు,
నీ మూటి నామములుఁ జెడఁగఁ, జెడు నా
గాములును, సంచితపు బాములును :—
పై మిగులు ప్రారబ్ధ మఱఁ, బరశ్రీ. 360

# ఆస విడుచుట.

1. ఆస, యవియెద రెల్ల యుగములకు
నే సమయమందునుం దప్పనిది యై
వాసిగాఁ, బుట్టు వీనెడు విత్తు :—
వాసనాపశ మాస యఱఁ, బరశ్రీ. 361

2. వేఁడునెడ, భవదుఃఖవిజ్ఞాని,
వేఁడుఁ బుట్టమినె ; అయ్యది విషయముల్
వేఁడమిని వేఁడునెడ నొడఁగూడు :—
వేఁడకయె, ఆసవీడినఁ, బరశ్రీ. 362

3. కోరకుండుట వంటి గొప్ప సిరి,
వేఱె యీ భువినిలే, దల్ల దివినే
నారయఁగ దాని వంటిది లేదు :—
కోరమియె, వైరాగ్య ; మదె శుభశ్రీ. 363

4. పారిశుద్ధ్య మను కైవల్యంబు
కోరికలు లేమి ; యది, సుపరోక్షసత్
సారమూఁసి కోరిక జేకూరు :—
తీఱ గోచరమలము, పరిశుచిశ్రీ. 364

5. పట్టుడిగి రనఁబడెడు వా, రాస
నెట్టి యుడిగిన యట్టిఁడులె ; యితరులో,
యట్టులుగ నుడుగలే నట్టిఁడులు :—
పుట్టుడుగుఁ, బట్టుడుగ నైహికశ్రీన్. 365

6. పొంచుండు నవి, యెపుడు నంజూటయె
మంచిధర్మము ; లేనియెడ, నొక్కనిన్
వంచించు నెపుడేనిఁ, గామంబు :—
మించి, లోపగ కలఁచు నిశ్చలశ్రీన్. [బుద్ధిని] 366

7. కామకర్మము పూర్తిగా విడిన,
నేమమున నొకఁ, డనఘకర్మంబు తాఁ
గామించు మార్గమ్మునను వచ్చు :—
కామ మఱు నెఁడ ధర్మసత్ఫలశ్రీ. 367

8. కామంబు లేనివారికి లేవు,—
బాము— అది యుండునే నమితంబుగా
నాముకొని, మీఁదమీఁదను వచ్చు :—
కామంబు క్రోధాదిజనకదుశ్శ్రీ. [విషము] 368

9. సౌఖ్య మెడతెగ దిహంబుననుఁ, గా
మాఖ్యాత మైనట్టి, దుఃఖములలో
ముఖ్య మైనట్టి దుఃఖము చెడిన :—
సఖ్య మూనదు కామితోఁ బరశ్రీ. 369

10. ఆరని స్వభావంబు గల యాసఁ
బాఱ విడిచిన, నా నిలుపు మఱెపుడున్
మాఱని పరస్వభావము నిచ్చు :—
కూరు జీవన్ముక్తి విరాళశ్రీన్. 370

ఓం



38 వ అధికారము

# విధి.

1. కలిగించు విధిఁ దోఁచు, బ్రతుకునం,
దలసభావము లేమి ; —కైసౌ త్తొగిన్—
దొలఁగించు విధిఁ దోఁచు మాంద్యంబు :—
మలయుఁ, గర్మానుసారిణి యగుచు, శ్రీ. [బుద్ధి] 371

2. పేదవడఁ జేయు దురదృష్టంబు
మీఁదుకొనఁ —దెలివినిన్— విరివి చేయున్,
మీఁదుకొని నపుడు సదదృష్టంబు :—
పొదుకొనుఁ బూర్వకర్మము మతిశ్రీన్. 372

3. బహు సూక్ష్మ విషయములఁ గఱచినను
రహి నొకడు, మఱియు, స్వపురాకృతముచే
సహజ మగు తెలివియే మిక్కిలును :—
విహిత మగునది కదా విధివలన శ్రీ ? [బుద్ధి] 373

4. ఇరు వేఱు పగుదు లయి, విధివశత,
నెఱవేఱు లోకస్వభావం; బొగిన్,
సిరివేఱుఁ, దెలివరు లగుట, వేఱు:—
పొరి, వేఱిఁడికిఁ గూడ సమకూడు శ్రీల్. 374

5. మంచి వెల్లనుఁ జెడ్డవిగ మాఱి
వంచించుఁ, జెడ్డవియు బలుమంచివౌ,—
నెంచి సంపదను గడియించుటకు :—
సంచిత ప్రారబ్ధఫలమె కద శ్రీ ? 375

6. శ్రమ మొంది కాచినను నిలఁబడవు
తమ పాలు కావియవి ; కొనిపోయి దూ
రమున వైచిననుఁ బోవవు తమవి :—
మమతయె వృథా, విధివశం బైన శ్రీన్. 376

7. విధి విధించిన విధమునం గాక,
అధికు లయి కోటి చేర్చినవారికే,
నధిగతము లనుభవించుట యరిది :—
విధి కుడుపుఁ ; గుడుపఁజాలదు నిధి శ్రీ. 377

8. సన్న్యసింపరె భోగవిరహితులు
దైన్యమున, ననుభావ్య దుఃఖంబులన్
హైన్యపడఁ గుడుప కున్నె వి విధి ? :—
సన్న్యసన మగు విధిప్రేరితశ్రీన్. [బుద్ధివలన] 378

9. సుకృతంబు పండ మంచివిగఁ గని
సుక మొందువారు, దుష్కృతము పండన్
దికమకంబడి కుందు టది యేమి ? :—
స్వకృతఫలములఁ గుడువవలె సమశ్రీన్. [బుద్ధితో] 379

10. దైవంబు వోలెఁ బెనుబలువు గల
వేవి యున్నవి ? మాఱు వెఱవు నొందున్
భావించినను, దానె ముందుఱుకు :—
దైవఘటనను మీఱఁ జాలునొకొ శ్రీ ? [బుద్ధి] 380

(ధర్మవర్గము సమాప్తము)

#  పదములు

(పంచాశిక మాలికలు)

# అర్థవర్గము

సత్ప్రపిహాంస

కొంతి శ్రీపతి శాస్త్రి,

ఆంధ్ర కావ్యకర్త.

## శ్రీపదులు

### అర్థ వర్గము

# విషయసూచిక

### రాజ ప్రకరణము



### అంగ ప్రకరణము

### (అమాత్య భాగము)

(రాష్ట్ర భాగము)

అధికారము, విషయము. అధికారము, విషయము.



(దుర్గ భాగము)



(కోశ భాగము)



(బల భాగము)



(సుహృద్భాగము)



పరిశిష్ట ప్రకరణము

39 వ అధికారము

# రాజ మహిమ.

1. బలము, రాష్ట్రము, కోశ, మమాత్యత,
చెలిమి, దుర్గం, బనెడు నాఱంగముల్
గల యొడయఁ, డరసులన్ సింగంబు :—
వెలయ దివిలేక నృపలక్షణశ్రీ. 381

2. అంజమియు, నీవియును, దెలివియును,
మంజు వగు నూఁకువయు, నీ నాలుగున్
గొంజి కొఱవడమి రాజప్రకృతి :—
రంజించు నట్టి నృపు పాలనశ్రీ. 382

3. తూఁగమియుఁ, జదువునున్, దీమసం
బీఁగనటు లూనుటయు, నీ మూఁడునున్
నీఁగరావివి నేలయేలికకు :—
సాగ దివి లేక పరిపాలనశ్రీ. 383

4. రాచపాడిని విడక, దుర్న్యయము
లాఁచి, వీర్యము కొఱవడని మానమున్
మోచునదియే రాజలక్షణము :—
రాచటిక, మురక కుడుచుట గాదు శ్రీల్. 384

5. కడఁకయును, నొత్తు గడనయుఁ, గాపు
గడయుఁ, గాచినవి తగ వెచ్చింపఁ బా
ల్లిడుటయును, వల్ల నగునది ప్రభుత :—
కడమపడ నివ్వి, కడఁబడును రాట్ఛ్రీ. 385

6. చూడఁబడ సులభుఁడై, కడిఁదినుడి
వాఁడు కాఁదేని, మీసరముగాఁ గొం
డాడు జగ మా తేని, రాజ్యమును :—
గోడగించుటయొ రాజభూయశ్రీ ? 386

7. లలితవచనముతోడ విడి, కావఁ
గల తేవి, కొగిఁ దన యశముతోడఁ, దాఁ
దలఁచు మితి నమరు నీలోకంబు :—
ఇల యగ్గ మగును దయదారతాశ్రీన్. 387

8. న్యాయంబు తగ నెఱపి, కాపుగడ
సేయు మన్నియ, 'మనుజులకు దేవుఁ' డన్
పైయుక్కి మన్నికన్ వేయఁబడు :—
ధ్యేయుఁ డగు నట్టి మనుజేశ్వంశ్రీ. 388

9. చెవికిఁ జేఁ దగు హితవిమర్శన
ప్రవచనము లోర్చు, సుగుణోపేతభూ
ధవు గొడుగు క్రింద, నుండును జగము :—
అవివేకులకుఁ దగదు ప్రభుత్వశ్రీ. 389

10. దాతృత్వ, మనుకంప, ఋజుదండ
నీతి, దీనావనము ; నాల్గుఁ గలవాఁ
డాతతనృపాలకుల దీప మగు :—
ఈతిఁ బాపుట రాజమహత్వశ్రీ. 390

40 వ అధికారము

# చదువు.

1. కఱవ వలయును, మతిని గస టఱఁగఁ,
గఱవఁ దగు చదువులను ; గఱచి పిదపన్
నెఱి విలువవలె దాని కనువుపడ :—
పురుషార్థగతి నమరు సదర్థశ్రీ. 391

2. "గణిత" మనునవి, మఱియు "నక్షరం"
బనునవియుఁ, జదువు తెగ, లీ రెండుసున్
"గనుదోయి" యండ్రు మను సుసుఱులకు :—
మొనయు ని క్కనులచే జ్ఞానదృక్ఛ్రీ. 392

3. కను లున్నవా, రనంబడుట, చది
వినవారె ; మొగమందు రెండు పుండుల్
మొనసినట్టిఁడులె చదువనివారు :—
కనుగ్రుడ్లు కనలేవు యథార్థశ్రీన్. 393

4. ఉల్లాస మిడఁ గూడిమాడి, మఱి
యుల్లము స్మరింప పీడుట ;—యట్టిదే,
పుల్లవిద్వత్తల్లజుల వృత్తి :—
ఎల్లెడలఁ బూజ్యుండు కోవిదశ్రీ. 394

5. ఒడయండ్ర మును లేనివారు వలె,
నడఁగి, యేఁకటఁ, గఱచువా రుత్తముల్ ;
కడవారె యట్లు కఱవనివారు :—
అడరు గురుశిక్షితుల కున్నతిశ్రీ. 395

6. తోఁడి నంతయె యూరు నీ, రిసుక
బాడువను ; మనుజులకుఁ జదివినంతే
వోఁడిమెయి నూరును వివేకంబు :—
వీడఁ గూడదు సువిద్యాకృషిశ్రీన్. 396

7. ఏ దైనఁ దన నాడె, తన యూరె
వేది పగుఁ గద ? యేల నొకఁడు మృతుఁడౌ
నా దనుకనుం జదువుకొన కుంట ? :—
ఆదృతము సర్వత్ర వైదుషిశ్రీ. 397

8. ఒక మేనఁ దాను గఱచిన విద్య,
యొకవి, కవ్వలి యేడు మేనులందున్
సుకరముగ నుపయోగసిద్ధ మగు :—
స్వకృతమ్మ లటు, తొడరుఁ జదు వసుశ్రీన్. 398

9. తాము ముదమొందు చదువున జగము
నామోదమొందఁ గని, మఱియు నదియే
కామింత్రు కఱచి యెఱిఁగినవారు :—
ప్రేమజనకంబు కద సువిద్యాశ్రీ ? 399

10. చే టొంద, కుపయోగమునఁ బెరుఁగు
మేటిసిరి, విద్యయే యగు నొకనికిన్ ;
బాటింప సిరులుగా వన్యములు :—
మీటి దొంగిలఁ గాదు సువిద్యాశ్రీన్. 400

41 వ అధికారము

# చ దు వ మి.

1. రంగ మమరుచుకొనక గుండ్లాడు
భంగియే, నెఱచదువు లేనతఁడు తా
భంగపడ గోష్ఠిలో వాకొనుట :—
చెంగలించుట సభల, వైదుషీశ్రీన్. 401

2. కఱవ నతఁ, డుఱఁ బలుకఁ గోరునది,
యిరు చన్నులును లేని యువిద, తన మై
నెఱయాఁడుతనముఁ గోరుట య్రైల :—
ఉరువాగ్మి యగుట, విద్యాకృషిశ్రీన్. 402

3. నేరువనివారలునుఁ గడు మంచి
వారె యగుదురు, నేరిచినవారి మున్
నోరెత్త, కుండఁ గల్గుదురేని :—
నేరువఁగఁ దగు ధీరవాక్ఫ్రీతిశ్రీన్. 403

4. చదువనాతవి తెలివి, యొకపు డతి
హృదయంగమం బైననున్, దెలివిగా,
మదిఁ గొనరు జ్ఞానంబు గలవారు :—
చదు వగునె, పీతనడల్రావాలు, భూశ్రీన్? 404

5. కఱచి యెఱుఁగవివాఁడు, తగిన తెలి
వరి ననుకొనెదు నాత్మగౌరవము, ధీ
వరుల కడ మాటాడఁ గొఱవడును :—
మెఱయునే చేవెలుఁగు వేవెలుఁగు శ్రీన్? [కాంతియందు]

6. భువిని, గల రన్న మాత్రపువార
లవుటయే తప్పు, గృషిఫలహీనమౌ
చవు దట్టివారు చదువనివారు :—
వివిధఫలదము కృష్టిజీవనశ్రీ. 406

7. అలకనయి, గొప్పదయి, చౌరవగల
తెలివి, లేనతవి యెగు సొగసు, మట్టిన్
వెలయఁ గూర్చిన బొమ్మ దట్టిదియె :—
లలియుఁ గాంతియుఁ గళాభిజ్ఞతాశ్రీన్. 407

8. ఉఱు చదువరులయందుఁ బట్టు పే
దఱిమికంటెను నహితమే, చదువునుం
గఱవనట్టిఁడులందుఁ బట్టు సిరి :—
చెఱప వఖిజాతులను దీనతాశ్రీల్. 408

9. మీఁబుట్టు లయ్యుఁ జదువనివారు,—
క్రిఁబుట్టు లయ్యుఁ జదివినవా రటుల్—
పైఁ బట్టు పెరిమె లేనట్టిఁడులె :—
మైఁ బట్టుఁ గుల ; ముసుఱుఁ బట్టు ధీశ్రీ. 409

10. మృగజాతితోడ నరజాతి, కం
తగ వాసి గల, దొగివి, బామరులతో
నెగడు చదు వలవడిన విబుధులకు :—
జిగిఁ దేఱునే, చదువ కున్న, ధీశ్రీ ? 410

42 వ అధికారము

# వినికి.

1. సంపదలయందు సంపద, శ్రవణ
సంపదయె ; యా సంపదయె మేలిమిన్
వింపు సంపదలయం దెల్లఁ దల :—
ఇంపుపెంపులు శ్రవణగతార్థశ్రీన్. 411

2. చెవి కోగిరము లేని యప్పు, డా
భవికేంద్రియము నూను మెయివి సాఁకన్
లవము కడుపునకు నీయం దగును :—
శ్రవణపోష్టకు ద్వితీయము తనుశ్రీ. 412

3. చెవికుడుపు, మేల్వివికి, గలవారు,
హవికుడుపు గల జ్ఞానపరిపూర్ణులౌ
దివిషదులతోడ నీ డగుదు రిల :—
భువినె సచ్ఛ్రివణమున దివిసుఖశ్రీ. 413

4. చదువు లేనట్టివాఁ డైననుం
జదువరుల విననలయు ; నది యొకవికిన్
మది చెదరు తఱి, నూఁత యగు తోడు :—
చదువు వలె, వివికి యిడు మతిధృతిశ్రీన్. 414

5. జాఱుదల గల తావునన్, నడకఁ
దీరిచెడు నూఁతకో లట్టిదె, సదా
చారంబు గలవారి వాపలుకు :—
తీరు నడవడి సదర్థశ్రుతిశ్రీన్. 415

6. ఎంత కొలఁదివి యైననున్ సువృ
త్తాంతములు వినవలయుఁ; దదనుగుణ మౌ
నంతైన విండు, పేరిమి నిడును :—
నుంత లగు చినుకులే ప్రవాహశ్రీ. 416

7. పొరపడి గ్రహించినను నొకటి, పే
దఱికంపు నుడు లనరు, యోచించి తా
మెఱిఁగి, వినిడిన శ్రవణధీయుతులు :—
దురితతమ మడఁగు శ్రుతివివిక్తశ్రీన్. [బుద్ధివలన] 417

8. వినఁగల్గినను ధ్వనుల, వినలేని
తనము గలయవియె, శాస్త్రార్థముల మేల్
వివికిచేఁ దొలువంబడవి, చెవులు :—
చొనుపవలె శ్రుతిగతిని జ్ఞానమును శ్రీన్.[బుద్ధియందు]

9. జ్ఞానార్థసూక్ష్మశ్రవణపరులు
గావివారలు, వినయపూర్వకం బౌ
మా నైన వాకువా రగు టరిది :—
పూన రాత్మస్తుతికి శ్రుతిశుచిశ్రీల్. [బుద్ధులు] 419

10. చెవిచవులఁ గనకుండి, వాతిండి
చవు లారిటినె కనెడు మనుజు లిలలో
నవిసినను బ్రతికినను నేమియొకొ ? :—
నవరసాదిజ్ఞానదము శ్రుతిశ్రీ. 420

43 వ అధికారము

# వివేక సంపద.

1. ఎఱుక, చెఱుపుననుండి కాచు నుప
కరణంబు; పగవారికినిఁ జొచ్చి లోఁ
జెఱుపఁగాఁ దర మవని దుర్గంబు :—
అరివర్గమును గెలుచు వివేకశ్రీ. 421

2. చెల్లు విషయమునఁ జెల్లఁగ విడక,
మళ్లించి యఱనుండి, మతి, నయమునన్
జెల్లించు నదియె విజ్ఞానంబు :—
ఉల్లంబు పయి రౌతు వివేకశ్రీ. 422

3. ఏయర్థ మెవ రెవ్వ రన వినిన,
నాయర్థమందు సత్యార్థమును వా
లాయముగఁ గాంచునదియే యెఱుక :—
ప్రాయికమె సదసద్వివేచనశ్రీ ? 423

4. సులభార్థవంతములుగాఁ జెల్లఁ
బలికి, తాఁ, బరు లనెడు సూక్ష్మార్థముల్
సులభముగఁ గాంచఁ గలయది యెఱుక :—
పలుకుతలఁపుల నొలయు వివేకశ్రీ. 424

5. లోకమును నేసించు టొప్పిదము ;
వ్యాకోచభావమును సంకోచమున్
లేక, యొక నెఱి నిరుకు గల దెఱుక :—
సాఁకు సమరసతనే, వివేకశ్రీ. 425

6. ఎవ్విధమునను నడచునో లోక,
ముప్వకొని తానునున్ లోకంబుతో
నవ్విధముననె నడచునది యెఱుక :—
నొవ్వి కెడ మీయులొకా వివేకశ్రీ ? 426

7. ఎఱుక గలవారు కాఁగలది మున్
దెఱుఁగువారలె ; యెఱుక లేనివారో,
జరుగఁగల దెఱుఁగఁ గలుగనివారు :—
అరయు మేల్పెబ్బరల వివేకశ్రీ. 427

8. అంజఁదగు దాని కంజమి దైన్య ;
మంజఁదగు దుండగము పాల్పడుటకై
యంజుట వివేకవంతుల వృత్తి :—
అంజ దుష్కృతిఁ, గొంజునే సుధీశ్రీ ? 428

9. ఎదుర రాఁగలదిగా ము న్నెఱిఁగి
యదనునం గావఁగల జ్ఞానులకు, లే
దదిరిపడ వచ్చునది యొక నోవు :—
చెదర దెద, కుదు రొదవి, వివేకశ్రీన్. 429

10. తెలివి గలవా రెల్లఁ గలవారు ;
తెలివిమాలినవార, లే యర్థముల్
కలిగియున్నను, లేనివారలే :—
కలిమి పంటకు విత్తు వివేకశ్రీ. 430

44 వ అధికారము

# దోసము లడఁచుట.

1. మదముఁ, గ్రోధము, నధమకామంబుఁ,
గదుర కుండెడువారి కలిమి, పైపైఁ
బొదలుకొను మేల్మి గలయది యగును :—
ముదురు నెడ నామూడుఁ, జెదరి చెడు త్రీ. 431

2. ఇడక దాఁచెడు లోభమును, నయము
చెడినట్టి మాత్సర్యమును, మోహమున్,
బడయఁగూడవి యెగ్గు లరుసునకు :—
అడఁచవలె లోపగల మతిధృతిత్రీన్. 432

3. జొన్నంత చిఱుదోసమే వచ్చి
యున్ననుం, దాటియంతటి పెద్దగా
నెన్నుదురు, వింద సిగ్గిలువారు :—
చిన్న దొసఁగునుఁ బన్న ర న్నయత్రీన్. 433

4. దోసమే కలుగనటు కావవలె,
వాసి యగు నర్థముగ, దావిలేమిన్ ;
దోసమే చేటుఁ గలిగించు పగ :—
దోస మరిషడ్వర్గజృంభణమె త్రీన్. [బుద్ధియందు]

5. దొసఁగు వచ్చుటకు మున్నుగనె యా
రసి కావ కున్నతవి బ్రతు, కగ్గిమున్
గసవుప్రో గట్టులుగనే, చెడును :—
నుసినెరసు గూడఁ జెఱచును ఘనత్రీన్. 435

6. తన తప్పులను మున్ను గని నీఁగి,
వెనుక నితరుల తప్పులను గాంచఁ గ
ల్గిన, నేది త ప్పగును రాజునకు ? :—
తనకు నొరులకు నొకటె కద నయశ్రీ ? 436

2. చేయఁదగు పాలిటిది యగు వ్యయము
చేయని పిసినిగొట్టు సంపద, యొగిన్
స్థాయి యగు పాలిటిది కాక చెడు :—
శ్రేయము త్రివర్గార్థముల కొదవు శ్రీన్. 437

3. ప ట్టుల్ల మను పిసినిగొట్టు తన,
మెట్టి తప్పిదపుఁ దెగలోను లెక్కం
బెట్టఁబడు, నొక తప్పిదము కాదు :—
మట్టుమీఱెడు తప్పు లోభంబె శ్రీన్. [బుద్ధియందు] 438

9. మదియించుకొనఁ గూడ దెపుడుఁ ద
న్నదనముగఁ ; గోరఁ గూడదు సత్ఫల
ప్రదము కానట్టి యే కార్యమును :—
మదమత్సరముల కెడ మిడరాదు శ్రీన్. [బుద్ధియందు]

10. నలయు నర్థము లొకఁడు, తన వలపు
వెలిపుచ్చ, కనుభవించం గల్గినన్,
ఫలియించ వరుల యాలోచనలు :—
అలఁతివలపలుకమరుట లుటు రాట్ఛ్రీన్. 440

45 వ అధికారము

# పెద్దల తోడు గొనుట.

1. ధర్మజ్ఞు లయి, ముత్త లయి, యెఱుక
పేర్మి గల సౌశీల్యయుతుల కూర్మిన్,
నేర్మి వగఁ గని యరసి, కొనవలయు :—
ధర్మలౌకికము లఱు, వృద్ధధీశ్రీ. 441

2. కల నోవులను నీఁగి, మఱి యవ్వి
కలుగనటు మున్గాచఁగల సత్స్వభా
వుల, మెచ్చి, తోడుగాఁ గొనవలయు :—
కలితనము గలది కద వృద్ధధీశ్రీ ? 442

3. అరిది వగు భాగ్యములలో నెల్ల
నరిదియే, పెద్దలను, మన్నించి యా
దరముతోఁ, దమవారుగాఁ గొనుట :—
పొరయు సిరి, వృద్ధధీసహాయశ్రీన్. 443

4. తమకంటె జ్ఞానాదివృద్ధు, లొగిఁ
దమ మేలి తోడువారుగ నడచుటే
ప్రముఖబలములయందు నెల్లఁ దల :—
అమితధృతి, వృద్ధధీసహాయశ్రీన్. 444

5. యోచించువారు లోచనములుగ
నాచార మగుట, మన్నియఁడు, పర్యా
లోచనాఢ్యుల నరసి, కొనవలయు :—
రాచఱిక మడరు సదమాత్యదృక్ప్రీన్. 445

6. తగువారి కొలువు గల యాతఁ డయి,
యొగిఁ దాను నడవ వలనైన తేవిన్
బగవారు చేయఁ గలదియె లేదు :—
తగు ప్రెగడతెగవలన నెగడు రాట్ఛ్రీ. 446

7. నొక్కి వాకొను ధీసహాయులను
అక్కఱగ నేలు రాజుల నెవరొకో
విక్కి చెఱచెడు పెరిమె గలవారు :—
చక్కి దిద్దును రాజు నమాత్యశ్రీ. 447

8. తెగనాడు బుధులఁ దోడుగఁ గొనమిఁ,
దగు రక్ష లేవి మన్నీఁడు, చెఱపన్
బగఱు లేకున్ననుం, దానె చెడు :—
మిగులు మావటిలేవి మదగజశ్రీ. 448

9. మొదలు లేనట్టివారికి లాభ
మొదవ నటు, లూఁత యగు తోడు తమకున్
గదురనట్టిఁడుల కొదవదు కుదురు :—
చెదరుఁ, జేదోడు చెడఁ, బ్రాభవశ్రీ. 449

10. పలువుంద్రతోడఁ బగఁగొనుకంటె,
విలను, బదిరెట్లు కీడే, మేలి పె
ద్దలతోడి తొడరికం గైవిడుట :—
బలితంబు ధీవృద్ధసహాయశ్రీ. 450

46 వ అధికారము

## చిఱు చెలిమిఁ జేఱమి.

1. చిఱు చెలిమి నంజి యొదుఁగును వెరిమె ;
చిఱుతనమొ, దానిఁ దన చుట్టంబుగా
మఱిమఱియు నెంచి ముందంజ యిడు :—
పరిరెక్కపక్క లిఱియవె ధరాశ్రీన్? 451

2. మహినైజమున, నటనట, నీరు,
రహి మాఱి, యట్టి దగు ; మానవునకున్
సహవాససహజపుదె యగు నెఱుక :—
సహృదయ సహాయతయె మతిహితశ్రీ. 452

3. మనసుచే నగు, సహజ మగు తెలివి,—
మనుజునకుఁ— జెలిమిచే నగు, విట్టివాఁ
డనఁబడెడు మాట, లోకులవలన :—
గుణవిజ్ఞతాకలన, సంగతశ్రీన్. 453

4. మనములోనిది వోలెఁ గనఁబఱచి
నను, నొక్కనికి సంగడములోని దౌఁ,
గవి పట్ట, విశేషజ్ఞానంబు :—
అనుభవోద్భవము విజ్ఞానంబు శ్రీన్.[ బుద్ధియందు ] 454

5. మానసికశుద్ధి, వాక్కాయకృత
మైన కర్మల శుద్ధి, రెండునున్, సం
గానూనశుద్ధి ప్రాపుగ వచ్చు :—
హీనసంగతి చెఱచుఁ ద్రికరణశ్రీన్. 455

ఘతిశుద్ధులకు సంతు మే లగును ;
హితసంగశుద్ధులకు లే దేదియున్
జతనపడ మే లవని కార్యంబు :—
మతిసంగమాలిన్యఫల మఘశ్రీ. [విషము] 456

మదిమేల్మి మను నుసుఱునకుఁ బెంపు ;
కదియు చెలికారంపు మేల్మి మిగులన్
గదుకొనెడు నెల్ల పొగడుల విడును :—
మదినెయ్యముల కీడు లిడు నఘశ్రీన్. [విషమును] 457

తలఁపుమేలిమి మేలు గల యట్టిఁ
డులె యైననున్, ధీప్రపూర్ణుల కిలన్,
జెలిమిమేలిమి, బలము గల కాపు :—
తళు కెచ్చుఁ బసిఁడిఁ బొదిగిన మణిశ్రీన్. 458

మనసు మంచిని గలుగు మఱుమేన
ఘనసుఖము ; మఱి, యదియుఁ జెల్మిమంచిన్
ఘనతరం బగు మేల్మి కలది యగు :—
అనయసంగతి చెఱచు సన్మతిశ్రీన్. 459

మంచి చెలిమిని మించు తోడు లే,
దెంచ నొక్కనికి, విలఁ, జెడ్డచెలిమిన్
మించి బాధించు కీడును లేదు :—
మంచి యగుఁ, జెడ్డ తెగు, సుసంగశ్రీన్. 460

47 వ అధికారము

# ఆరసి చేయు వగ.

1. వ్యయపడెడు నద్దియును, నగునదియు,
నయి వెనుక విడు నయముఁ, బరికించి, యే
దయిన సార్థకమేవిఁ, జేయవలె :—
రయముచే, నారయమిఁ, జెడుఁ గ్రియాశ్రీల్. 461

2. ఎఱుఁగు వర్గముతోఁడ యోచించి,
పరికించి, చేయు వారలకు, విలలో,
నరిది యే యొక యర్థమును లేదు :—
తర మరసి చేసినఁ గృతార్థతాశ్రీ. 462

3. పిదప లాభము గల్గు నవి, యున్న
మొదలునుం బోఁగొట్టు నే చెయిదమున్
బదటువడి మేకొనరు తెలివరులు :—
మొదలుతుద లొదలునదె ప్రక్రియాశ్రీ. 463

4. నిరుకు చేయంబడని పనిఁ దొడం
గరు మానభంగ మను కీడుపాటున్
బొరయుటకు వెఱచఱచు తెలివరులు :—
నెఱప, కఱగొఱ జరుపఁ, జెఱపుఁ గద శ్రీన్ ? [కీర్తిని]

5. వగ లెల్ల నార నారయకయే
యెగసిలుట, పగతురను సుకరంబుగా
మొగిఁ బాదుపడఁ జేయు, నొక నెరవు :—
పగఱ కగుఁ దన వెలితి, నతిబలశ్రీ. 465

6. చేయఁ దగినవి కావి పను లొకఁడు
చేయుటం జెడు ; జేయఁ దగినవానిన్
జేయ కుండుట నైనను జెడును :—
జేయ నొక యగవు, తగ వరయవలె శ్రీన్. [బుద్ధియందు]

7. ఎన్ని, వెరవుల నెల్లఁ, దొడఁగవలెఁ
బన్నఁ దగు కర్మమునుఁ ; దొడఁగి యాపై
నెన్నఁగల మనుకొను నదే తప్పు :—
మున్నిట మునుఁగ, నగపడ దెగయు శ్రీ. [సాధనము]

8. వెరవు లన్నియు నరసి, యొక పవిని
నెఱపఁ గడఁగవి కడఁక, పలువుండ్రు ద
గ్గఱ విచ్చి కాచిననుఁ బొరపడును :—
కరణీయమున వలదె సాధనశ్రీ ? 468

9. అనువుగా నయము నొనరుచుట యం
దునుఁ దప్పు గలుగు, వారివి వారి వౌ
గుణముల నెఱింగి చేయవియెడల :—
ఫణికిఁ బాలిడఁ జెడునె తదాశ్రీ ? [విషము] 469

10. అవింద్యంబుల నెంచి చేయవలె
ననువుల నెఱింగి ; తమ మవికితోడన్
గొనవి యవి మేకొనదు లోకంబు :—
అమ వొనర, మొనరుఁ గృతకృత్యతాశ్రీ. 470

48 వ అధికారము

# బల మెఱుఁగుట.

1. పవి బలమునుం, దన బలంబునుం,
దన మాఱుతువి బలంబునుఁ, దోడుగా
నొనరు బలమునుఁ, దూఁచి చేయవలె :—
తనవంక ప్రొగ్గతిలినవె జయశ్రీ. 471

2. చెల్లు పవియును, నెఱుఁగఁ దగినదియుఁ,
దెల్లముగ నెఱిఁగి, యందే నిల్చి, పైఁ
జెల్లువారికిఁ జెల్లనిది లేదు :—
ఎల్ల ననుకూల మయినవె జయశ్రీ. 472

3. ఉన్న తమ బల మెంతో కనక, మును
కొన్న యూఁకువ నూఁకి, యెదయందునన్
బన్నపడి చెడినారు పలువుంద్రు :—
పన్నవలెఁ, దగినపుడె స్వకబలశ్రీ. 473

4. అమరి నటు లొరులతో మనక, తన
కమరు బల మెఱుఁగకయుఁ, ద న్నధికుఁ డన్
భ్రమఁ గదురువాఁడు వైశమ చెడును :—
తమ యలవు నలవి నిలువమియొ సుశ్రీ ? [బుద్ధి] 474

5. పీలపురు లిడఁ బడిన శకటమునుఁ
గూలు విరునులు మురిసి, యా బండమే
చాల మిక్కుటముగా విడఁబడిన :—
బూలిగుమి యడఁచు నొక్కవి బలశ్రీన్. 475

6. కొనకొమ్మ నెక్కినట్టిఁడులు, దా
వివి మీఱి, మఱియునుం బై కెక్క నూఁ
కిన, నాయువునకే ముగిం పగును :—
మొనపునం, దలవు మీఱమియె సుశ్రీ. [బుద్ధి] 476

7. తగిన నెరవున, నలవి యెఱిఁగి, యీ
యఁగవలయు ; నట్టు లిడుటయె, యర్థమున్
మొగిసి కాపాడుచును మనెడు నెఱి :—
మొగి సాఁకవలయు నార్థికబలశ్రీన్. 477

8. రాబడి తెరువు నలవి సన్నమే
కాఁబడినను గీడు లే, దౌదమికిన్,
బోఁబడి తెరువు వెడఁద కానియెడ :—
లోఁబడునె, పైఁబడిన, ధనబలశ్రీ ? 478

9. కొలఁదిఁ గవి మననియాతని మనికి,
కలది వోలెనె తోఁచి, లేని యది యై,
కల దనియునుం దోఁపకయె చెడుమ :—
అలఁదు రగు, వల దఱఁగ ధనబలశ్రీన్. 479

10. ఉన్న వఱ నారయక, యుపకృతులఁ
బన్ను పూనికవలన, నొక్కరుని దౌ
పె న్నొదమి వఱయు వైశమ చెడుమ :—
తిన్ననగు, మీఱమియె ధనబలశ్రీన్. 480

49 వ అధికారము

## కాల మెఱుంగుట.

1. పగలె గెలుచును ఘూకమునుఁ గాకి ;—
పగఱ గెలువఁగఁ దలంచెడు ఱేనికిన్
దగిన యది కావలయుఁ గాలంబు :—
తగవి తఱి గెలువ, రున్నను బలశ్రీల్. 481

2. తఱి నెఱిఁగి, దానితోఁ బొందుపడఁ
దఱిగొనెడు నడవడిక, తిరపడని దౌ
సిరిఁ దీఱకుండఁ గట్టెడు త్రాడు :—
తఱిఁ బెఱుగమిని, దరలు, దరిఁ బెరుఁగు శ్రీ. 482

3. అరిదిపను లమ నవియుఁ గలవాకో,
యుఱిది వగు తగు సాధనములతోడన్,
గఱుదుమెయి నద నెఱిఁగి చేయునెడ ? :—
అరు దసత్సమయక్రియాజయశ్రీ. 483

4. నేల నెల్లను గుఱించినను నవ
లీలఁ జేకూడుఁ, గాలము గుఱింపం
జాలి, యెడ మనువుపడఁ, జేయునెడ :—
కాల మనుకూల మయిననె జయశ్రీ. 484

5. కాలము గుఱించి వేచుచునుందు,
రాలోచనలవలనఁ గలఁగకుండన్,
నేల గెలువఁగ గుఱించెడివారు :—
వేళ పొసఁగక, యెసఁగునే బలశ్రీల్ ? 485

6. ఊఁకువ గలాఁతఁ, దద నౌనరు నం
దాఁక నడఁగుట, బోరు పొట్టే లరిన్
దాఁక వెనుకంజ యిడు టట్టిదే :—
చేకుఱుచు సుసమయోద్యతి జయశ్రీన్. 486

7. పెళ్ళనను నపుడె పై కలుగ రరి
త్రుళ్ళఁ గని,— తగు వేళకయి వేచ్చి, తా
ముల్లమునఁ గనలుదురు,- తెలివరులు :
చెల్ల దసమయకోపమున జయశ్రీ. 487

8. పగఱఁ గాంచిన వంగవలె, వారి
వెగువ తలలుగఁ ; జేటు కాలంబుఁ గాం
చఁగ, వారివే దిగువ వగుఁ దలలు :—
పగఁ బగట, కదను వేచఁగ జయశ్రీ. 488

9. ఎలయ నరిదగు నదను పొసఁగ, ఆ
విలుకనే, కడఁగి, చేయుట కరిది పౌ
తలపోయఁబడిన యవి, చేయవలె :—
విలువరించదు గదా సుసమయశ్రీ ? 489

10. కొక్కెరం బోలవలె, ముడుఁగు తఱి ;
ముక్కుతో మీను నది పొడుచునట్టుల్,
గ్రక్కునం జేయవలెఁ, దీరు తఱి :—
చక్కటికి వలసినది సుసమయశ్రీ. 490

50 వ అధికారము

# ఎడ మెఱుఁగుట.

1. తొడఁగవల దే పనియుఁ, దెగడుటకుఁ
గడఁగనున్ వల దరుల,— ముట్టుటకు నౌ
నెడముఁ గాంచిన పిమ్మటనె కావి :—
ఎడము సరిపడమి, నెడపడు జయశ్రీ. 491

2. శాత్రవము చేరు బలయుతులకును,
సుత్రాతమైన యెడమును జేరి యా
పాత్రోద్యమము బహుఫలప్రదము :—
ఏ త్రాణకును నసుఁగు స్థితిబలశ్రీ. 492

3. బలవిహీనులును బలవంతులై,
గెలువఁగల, రెడ మెఱిఁగి, పగతురయెడన్
దలపాటు, కాచుకొని, చేయునెడ : —
నెల వెఱిఁగి కడఁగ నెగడును బలశ్రీ. 493

4. ఎవ్వి నట్టిఁడులు, గెలుతు మను తమ
యెన్నికను వదలుకొం, డ్రెడ మెఱిఁగి మా
ర్కొన్నవా, రొనరుకొని యొనరిచిన :—
మిన్న యగు రక్షితస్థితిబలశ్రీ. 494

5. లోఁతు గల నీటఁ గెలుచును మొసలి
లాఁతులను ; అది నీటి నుడుగునేనిన్
లాఁతు లవలీల గెలుచును దాని :—
హేతు వగు గెలుపునకు స్థితిబలశ్రీ. 495

6. కడలిపై నోడ వతి చక్రబల
మడరు విడుతేరులును ; గడలిపై నో
డెడు నోడలును వోడ విల పైని :—
ఎడమునకుఁ దగ వలయు సాధనశ్రీ. 496

7. వెఱపు నొందమి తప్పు, సాయ మ
క్కఱలేదు, కొఱవడని వగ నెన్ని, మేల్
వెరవు, లెడమునకుఁ దగఁ జేయునెడ :—
పిఱికి కెడబలుపు కొలుపునె జయశ్రీన్ ? 497

8. చిఱుపటాలమువావి చెల్లు నెడ
మిఱియునెడఁ, బెనుపటాలమువాఁడు, బల్
పెరిమె లొచ్చయి, వినాశము నొందు :—
పరిబలుపునున్ మించు స్థితిబలశ్రీ. 498

9. అరిగాపు మేలిమినిఁ, బేరిమినిఁ,
గొఱవార లేనియును మగలు, వారల్
వఱలు నెలవందు మార్కొను టరిది :—
పెఱుఁగు బీరంబు స్వవిలయ బలశ్రీన్. 499

10. కాలు దిగఁబడు నడుసులో, నక్క
మాలుచును, భయపడక యీఁటెకాండ్రన్
గూలిచెడు కొమ్ము చేనుంగులను :—
పీ లవవి కడ డీలుపడు బలశ్రీ. 500

61 వ అధికారము

# పరికించి నమ్ముట.

1. ధర్మార్థకామాసుభయ చతు
ర్మరోర్మిపథల చేతఁ దర మరసి, రా
ట్కార్మార్థుఁడుగ నొకని నమ్మఁదగు :—
కర్మకరునకు వలయు యోగ్యతాశ్రీ. 501

2. కులీనుండై, దోసములనుండి
తొలఁగి, యగడును బెగడు లజ్జాళు వై,
వెలయు ఘనునందె తగు నమ్మకము :—
తులువ, స్వామిద్రోహి యగు, నఘశ్రీన్. [బుద్ధివలన]

3. అరిదివిద్దెలఁ గఱచి, దోసంబు
లటిన ఘనులందునున్, సూక్ష్మంబుగా
నరయు తఱి, లేమి యరిదే, వెఱ్ఱి :—
స్థిరమతినె నమ్మఁగాఁ దగును రాట్ఛ్రీ. 503

4. గుణము లారసి, యొక్కనివి, దొసఁగు
లును నరసి, యందు మించిన వరసి, మిం
చినవాన, నతవిఁ గనుఁగొనవలయు :—
గుణదోషమిశ్రితము జీవనశ్రీ. 504

5. గుణవిగుణములవలని వగు, పెరిమె
కునుఁ, జిఱుతనమునకును, నొగిఁ, దాము తా
మొనరించు కర్మమే యొరగల్లు :—
వినికిఁ, గనుకలివిఁ, దెలియవు నిజశ్రీల్. 505

6. చుట్టములు లేనివారిని నమ్మ
నట్టి పని మానవలె ; వార లిలలోఁ
బ ట్టుటఁ, నానఁ గొనఁ రగదునకు :—
పట్టు లే కేర్పడదు లౌకికశ్రీ. [బుద్ధి] 506

7. గాదిలియె యాదరువుగా, జ్ఞేయ
వేదు లవనట్టిఁడుల నమ్మ, తెలుకన్
బేదఱిమి యెల్లనుం గలిగించు :—
ధీదరిద్రతఁ జెడవె ప్రక్రియాశ్రీల్ ? 507

8. తేఱ నరయక, పరాయిని నమ్మి
చేరిచిన యాతని పరంపరకునున్,
దీఱ నంతటిని యొ విడుమ లిడు :—
తేరకాఁ, డఱఁ జేయుఁ బ్రక్రియాశ్రీల్. 508

9. నమ్మరా దెవ్వరిని నారయక ;
నమ్మిన యనంతరము, తేర్చవలయున్
నెమ్మదిని, దన్నిశ్చితార్థముల :—
నమ్మి, మఱి, యరమరుట కాదు సుశ్రీ. [బుద్ధి] 509

10. తేఱ నారయ, కొకని నమ్మటయు,
తీర నమ్మిన వానిపై సందియం,
బీ రెండుఁ, దీఱని యిడుమ లిడును :—
ఆరయుటె నమ్మికకు సదవధిశ్రీ. 510

52 వ అధికారము

# తెలిసి పనిఁ బనుచుట.

1. మంచియును, జెడ్డయును, బరికించి,
మంచియే వాంఛించు నైజంబువాఁ
డెంచఁబడి, పనివంచఁ బడఁ, దగును :—
కించునెడ లోపించు నయమెంచు శ్రీ. [బుద్ధి] 511

2. వచ్చుబడి మొగలఁ బెరిఁగించి, సిరు
లెచ్చించి, యెదరులను ము న్నరసి పోఁ
బుచ్చు నేర్పరి చేయవలెఁ బనిని :—
మెచ్చఁబడు నతఁడె రాజతంత్రశ్రీన్. 512

3. నెన, రెఱుక, నిరు, కాస లేకుంట,
యను నాల్గు నిరవుకొ న్నతనియందే
యునుపఁ దగుఁ బనిఁబనుప నమ్మికను :—
ఒనరు సద్గుణికిఁ గృతకృత్యతాశ్రీ. 513

4. ఏరీతి నరసినను, నమ్మఁదగు
వారలే యయ్యుఁ, గార్యప్రకృతిచే
వే ఱగు మనుష్య లిలఁ బలువుండ్రు :—
వారలకు, నడుతరపుఁ బని పనుపె శ్రీ. [సాధనము] 514

5. అను వెఱిఁగి, నెగు లోర్చి చేయఁగల
మనుజునకె కాని, పని, తా నొరునకున్,
ఘనుఁ డంచుఁ, బనుపఁదగినది కాదు :—
పెనుపునసుపులు నెఱపునే క్రియాశ్రీవ్ ? 515

6. ఒనరించువాని లక్షణ మరసి,
పని యెట్టిదో యరసి, కాలంబుతో
ననువుపడఁ గాంచి, పనివంచవలె :—
పని చెడదె, చెడఁ దదనుకూలతాశ్రీ ? 516

7. "దీని, నీ సాధనముచే, నితఁడు
పూని ముగియించు" నని యరసి, పిదపన్
దాని నాతనియెడన్ విడువవలె :—
లేనియెడ లేదు కార్యసిద్ధిశ్రీ. 517

8. పని, కొకని యోగ్యతను నారసిన
వెనుక, నతనిని దాని కర్తుండుగా,
మునుకొను స్వతంత్రుఁడుగఁ, జేయవలె :—
చనవె యనుఁగగుఁ, గార్యధుర్యతాశ్రీన్. 518

9. పనియందె పనివడుట కలవాని
యనుకూలసౌహార్ద్యమును, వేఱుగా
ననికొనెడువాని విడనాడు సిరి :—
అనుమాన సంకటము నలఁచదే శ్రీన్ ? 519

10. నానాఁడు నరయవలె మన్నియఁడు ;
పూని కార్యస్థుండు వికటింపఁ దేఁ,
దానునున్ వికటింప దొగి జగము :—
అను రాజ్యక్రియలపై జనశ్రీ. 520

53 వ అధికారము

# చుట్టములఁ జేర్చుట.

1. పట్టఱిన లేమియందునుఁ, బ్రాఁత
పట్టెంచి కొనియాడు నైజము లిలన్
జుట్టములవారియందే యుండు :—
పట్టుడుగుదురు పరులు, పట్టుడుగ శ్రీ.　　521

2. నను పఱని మేలి చుట్టఱిక, మొ
క్కనికిఁ, బొసఁగున యేని, నది యతనికిన్
బెను పఱని పలు సంపదల నిడును :—
అనుర క్తబాంధవము దుర్లభశ్రీ.

3. తఁలపుఁ గలపుట, చుట్టములతోడ,
నలుపనాతని బ్రతుకు, చెఱువు పఱ, పొ
డ్డులులేక, నీరు నిండినయట్లె :—
నిలుచునే బంధురక్షణ లేని శ్రీ ?　　523

4. చుట్టములచేఁ జుట్టఁబడ, నెనరు
తొట్టు నట్టులు మనుట, సంపత్తు, తాఁ,
బెట్టి నందునను, బెట్టిన ఫలము :—
ముట్ట రరు లాత్మీయవృతనృపశ్రీన్.　　524

5. ఇచ్చుటయు, మితి యెఱిఁగి, పలుకుటయు
నిచ్చకము, లలవియగునెడ, నడుకుగా
నెచ్చు చుట్టములచేఁ జుట్టఁబడు :—
మెచ్చుఁ గొలుపును దానసామనుశ్రీల్. [సాధనములు]

పే రీవికాఁడు, నమితక్రోధ
మూరవి యతండు వలె, బంధుజనముల్
కూరువారలు, మహాభువి లేరు :—
చేరి, తో డవవలదె బంధుతాశ్రీ ? 526

కాకి. దాఁచక, పిలిచి తనదు తెగ
నేకమయి తిను, నెరను ; సంపదయు నా
పీఁక నగు ప్రకృతివారికె యుండు :—
ఏకాకియై కుడువఁ, జీకొట్టు శ్రీ. 527

సరిసరణిఁ గన, కరుసు, తమతమదు
వరుసఁ దగఁ కనిన, నది కని, బందుగుల్,
సరసనే మనువారు పలువుండ్రు :—
తరతమత, ధర నమితవిశేషశ్రీ. 528

తనవార లై, తన్ విడిన వారు,
వెనుకఁ జుట్టము లగుట, ము న్నమర కుం
డిన కారణము నీఁగు నెడ, వచ్చు :—
మనసు లొమ్మె యిమ్మ బాంధవశ్రీన్. 529

తన తావు విడిచి, యొక కారణం
బున మరలి వచ్చి నతనివి నృపుం, డా
పవి నెఱపి, తగ వరసి, కొన వలయు :—
గుణహీను లుండరే బంధుతాశ్రీన్ ? 530

54 వ అధికారము

# పొరపడమి.

1\. మితిమీఱు కినుకకంటెనుఁ జెడుగె,
అతిమోహజనిత మదహైతుకం బౌ
మతివిభ్రమమువలని పొరపాటు :—
వెత లిడును దనకె తన ప్రమాదశ్రీ. [విషము] 531

2\. పొరపాటు కొల నేయుఁ బొగడితను,
ఎఱుకువను, నిచ్చనిప్పచ్చరము తన్
నెఱపికొనఁ, గొల నేయు నట్టులుగ :—
చెఱు పొదవు మెలఁకువకు, మఱు పొదవ శ్రీన్.[బుద్ధిలో]

3\. పొరపడెడు నట్టివారికి లేదు
పరఁగు పొగడిత ; యదియె, లోకమున నె
త్తెఱఁగు శాస్త్రిలకునున్, నిర్ణయము :—
మఱపునం జెడును బురుషార్థశ్రీల్. 533

4\. పిఱికితన మున్నవారికి రక్ష
కొఱ లేవి దగు నల్లె, కొఱ లేవి దా
మఱ పున్నవారలకు సంపత్తు :—
చెఱు పొందు నొగి, వారి రక్షణశ్రీల్. 534

5\. మునుపె కని, వచ్చు చెఱుపులఁ గాచు
కొనక, విస్మృతుఁడు, తన తప్పెంచుచున్
వెనుక నవి వచ్చి నప్పుడు వగచు :—
మనుట కావశ్యకము సుజాగ్రచ్ఛ్రీ. 535

6. పొరపడమి, యెవరియెడ నైన, నే
తఱినైనఁ, దప్పమియె నెఱపదునెడన్,
మఱి దాని కెన యగు నయము లేదు :—
మఱపుచేఁ జెడును సంచితశుభశ్రీల్. 536

7. అరిది వనఁబడెడు దుష్కరము లగు
కరణములె లేవు, పొరపడని ఁ
కరణంబుచే, నరసి చేయునెడ
మఱపు, తా విడదు తగు యోః ్రైలో] 537

8. వినుతస్వధర్మముల నోమి చే
యనె వలయుఁ ; జేయ కేమఱువారికిన్,
వెనుక నయ, మేదు మెయులను లేదు :—
వెనుచఱచు, మఱపునం జెఱ, పసుశ్రీన్. 538

9. పొరపాటునం జెడినవారలను
స్మరియించవలె మదివి, దాము తమ సం
బరమునన్ బలు పొంది యున్నపుడు :—
దురహంకృతిప్రమత్తతఁ జెడును శ్రీల్. 539

10. ఉల్లంబునం దలఁచునది యెయిదు
చెల్లిదము కద, మఱియుఁ దానుల్లమం
ద ల్లదియె స్మరియింప బెరయునెడ :—
కొల్లకొను స్మృతివి, బొర, పొరలఁ బడి శ్రీన్.[బుద్ధిలో]

55 వ అధికారము

# ఋజు దండత్వము.

1. ఒరసి, మొగమోడ, కొగి, నడియువికి
విరవొంది, యెవ్వారి యెడను, నెరసున్
బరికించి. తగఁ జేయు నదె, నీతి :—
నెఱి చెడమి, ఋజుదండలక్షణశ్రీ.

2. వానఁ గని మనును లోకం బెల్ల ;
మానవేశుని దండమును గవి మనున్
మా నొప్ప మానవానీకంబు :—
వాన ప్రోచును ; గాచు సుదండశ్రీ.

3. ద్విజుల మినుకులకునున్, బాడికివి,
ఋజు వైన యాదియై, విల్చునదియే,
ప్రజేశప్రక్రియాదండంబు :—
విజయంబునకు నాది, సుదండశ్రీ.

4. జనుల వాదృతి నేలి, దండ మొ
య్యన నడపు మహాభూవిభువి పదమున్
నెనరునం జేరి విల్చును జగము :—
జనరంజకతయె సత్ప్రిభవశ్రీ.

5. నయమునన్ దండంబు నడపు మ
విన్నియ నాడుననె వాన కురియుటయునుం,
బయిరు పండుటయునుం, బొందుపడి :—
నయ మిగురు రాష్ట్రమున, బయ లగును శ్రీ.

బల్లెంబు కాదు, గెలు పిచ్చునది.
వల్లభుని దండ ; మదియును, నట్టి దై
చెల్లు టొగి, వికటింప కున్నేని :—
ఎల్లెడల నయవియతికే జయశ్రీ. 546

నేత కాచును భూతలము నెల్ల ;
నాతనిని స్వీయదండంబు కాచున్
నీతిని నిరంకుశముగా నడప :—
నీతియే సర్వతోరక్షకశ్రీ. 547

సులభపదదృశ్యుఁడై, యరయికన్
సలిపి, న్యాయ్యంబు చేయని మన్నియం,
డిల నీచపదమునం దానె చెడు :—
కలుచయే నలఁచు, మలఁచిన నయశ్రీన్. 548

నరులఁ, బరపీడ లఱఁ గాచి, దయ
నెఱపి, తద్దోషములఁ దీర్చు విధి, తా
దురిత మవ, దరుసునకు ; అదె పాడి :—
పరిరక్ష కురు శిక్ష సుధర్మశ్రీ. 549

కొల శిక్ష, నాతతాయులను, నృపుఁ
డలిగి, దండించునది, కాఁపు, పసిపై
రుల సాఁకఁ, గలుపుఁ గెలకుటఁ టోలు :—
ఖల శిక్ష నగు నఖిలరక్షణశ్రీ. 550

56 వ అధి కారము

# వక్ర దండత్వము.

1. కొలను మేకొన్నవారలకన్న,
బలు కఠినుఁడే, యలఁచ మేకొని, సదా,
పలు కూడనివి చేసి మను ఱేఁడు :—
నలఁచుటయు, నొలుచుటయు, నొకా నయశ్రీ ? 551

2. ఈఁటెతో దొంగ "సొత్తిడు" మనుట
టోఁటిదే, దండాధికారమిషతో
లూటి చేయుట ప్రజావళి నరుసు :—
తూఁటతనమునకొ నృపదండంబు శ్రీ ? [సాధనము]552

3. నాఁడు నాఁడును నడచునవి యరసి
పాడి నెఱపక మిడుకు మన్నీఁడు, నా
నాఁడునున్ నాడు పాడయి, చెడును :—
ఱేఁ డగునె, పీడ దండనీతిశ్రీన్ ? 553

4. కోశమును రాష్ట్రమును నొక్కటనె
నాశిలగ విడుచు, నయవక్ర క్రియల్,
లేశమే నరయ, కొనరుచు నరుసు :—
కొశలమొ చెఱచునది స్వరాజ్యశ్రీన్ ? 554

5. అలఁత పడి, యనయ మోరువలేక,
విలపించు జనుల కన్నీరు కాదే,
మలసి రాసిరిఁ దఱుగు నాయుధము ? :—
కలఁత పెట్టిన కలుచ, నఱుగవే శ్రీల్ ? 555

6. మన్నుతేనికి నుతులు నెలకొనుట,
తిన్ననగు దండనీతినె ; అద్దియే
సు న్నయిన, మన వరుసునకు నుతులు :—
మన్ననకుఁ దగు దండఋజుత్వశ్రీ. 556

7. చినుకు లేవడి జగతి కెటొ, అటే,
మవికితముఁ గలిగించు, మనుతేని దొ
కవికరము లేమి, మను జీవులకు :—
మవికి కనయములు నీరనీతిశ్రీల్. 557

8. లేమి కన్ననుఁ బ్రియ మవదు కలిమి,
నేమమున న్యాయ్యంబు చేయవి ప్రజా
స్వామి దండముక్రిందఁ బడి మనిన :—
ఏముండుఁ బేదకడ దోఁచుటకు శ్రీల్ ? 558

9. న్యాయంబు వికటింప మన్నియఁడు
చేయునేవిన్, వాన వికటింపఁగాఁ
జేయు, నొల్లమి, మబ్బు, క్రమవృష్టి :—
నేయమున మను నీతివీరదశ్రీల్. 559

10. ఆవుల ఫలము క్రుంగు, షట్కర్మ
లోవమిని శాస్త్రముల మఱతు, ఠరితిన్
గావలీఁ, దరుసు, కావఁడయేవి :—
దేవతలఁ దనుప కెటు సువృష్టిశ్రీ ? 560

57 వ అధికారము

# వెఱపించునవి చేయుమి.

1. తగ నొకవి నెర సరసి, యాతండు
వగచి మఱి తలకొనని వగ, నీతి కొ
ప్పగు రీతి శిక్షించునది, ప్రభుత :—
తగవు మిగిలిన, బెగడువడుఁ బ్రజాశ్రీ. 561

2. కడిఁదిగా నెత్తి దండించు నటు
తొడఁగి, మెల్లఁగ వేయవలె, సంపదల్
విడిచి పోవమిఁ గోరుకొనువారు :—
అడలు నతిదండ మగు నెడఁ బ్రజాశ్రీ. 562

3. వెఱపించు నాగడములం జేసి
పఱఁగుచుండెడి వక్రదండి యగునే
నరుసు, విరుకుగ దురుసుగాఁ జెడును :—
మొఱకుకఱకరి కుఱదు ప్రాభవశ్రీ. 563

4. "అరుసు దురుసరి" యంచు జను లాడు
విఁసవా క్కొలయు ఔఁ, డాయువు కొఱన్
బొరసి, దురుసుగ బెడఁద పడి చెడును :—
సఁసవాక్క్రియల నగుఁ బ్రవృద్ధిశ్రీ. 564

5. అరిది యదనును,- నరుల మొఱల విన,-
విరసముఖమునుఁ, గల్గు నధికృతుని పెన్
సిరి, పిశాచము సోఁకినట్టి దగు :—
కొఱగామి నఱును, గరకరియరును శ్రీల్. 565

6. మన్నుతేనికి నుతులు నెలకొనుట,
తిన్ననగు దండనీతినె ; అద్దియే
సు న్నయిన, మన వరుసునకు నుతులు :—
మన్ననకుఁ దగు దండబుజుత్వశ్రీ. 556

7. చినుకు లేవడి జగతి కెటొ, అచే.
మవికితముఁ గలిగించు, మనుతేవి దొ
కవికరము లేమి, మను జీవులకు :—
మనికి కనయములు నీరనీతిశ్రీల్. 557

8. లేమి కన్ననుఁ బ్రియ మవదు కలిమి,
నేమమున న్యాయ్యంబు చేయవి ప్రజా
స్వామి దండముక్రిందఁ బడి మనిన :—
ఏముండుఁ బేదకడ దోఁచుటకు శ్రీల్ ; 558

9. న్యాయంబు వికటింప మన్నియఁడు
చేయునేవిన్, వాన వికటింపఁగాఁ
జేయు, నొల్లమి, మబ్బు, క్రమవృష్టి :—
నేయమున మను నీతివీరదశ్రీల్. 559

10. ఆవుల ఫలము క్రుంగు, షట్కర్మ
లోవమివి శాస్త్రముల మఱతు, రరితిన్
గావలీఁ, దరుసు, కావఁడయేవి :—
దేవతలఁ దనుప కెటు సువృష్టిశ్రీ ; 560

57 వ అధికారము

# వెఱపించునవి చేయమి.

1. తగ నొకవి నెర సరసి, యాతండు
వగచి మఱి తలకొనని వగ, నీతి కొ
ప్పగు రీతి శిక్షించునది, ప్రభుత :—
తగవు మిగిలిన, బెగడువడుఁ బ్రజాశ్రీ. 561

2. కడిఁదిగా నెత్తి దండించు నటు
తొడఁగి, మెల్లఁగ వేయవలె, సంపదల్
విడిచి పోవమిఁ గోరుకొనువారు :—
అడలు నతిదండ మగు నెడఁ బ్రజాశ్రీ. 562

3. వెఱపించు నాగడములం జేసి
పఱఁగుచుండెడి వక్రదండి యగునే
నరుసు, నిరుకుగ దురుసుగాఁ జెడును :—
మొఱకుకఱకరి కుఱదు ప్రాభవశ్రీ. 563

4. "అరుసు దురుసరి" యంచు జను లాడు
విఁసవా క్కొ—లయు జేఁ, డాయువు కొఱన్
బొరసి, దురుసుగ బెడఁద పడి చెడును :—
సరసవాక్క్రియల నగుఁ బ్రవృద్ధిశ్రీ. 564

5. అరిది యదనును,- నరుల మొఱల విన,-
విరసముఖమునుఁ, గల్గు నధికృతుని పెన్
సిరి, పిశాచము సోఁకినట్టి దగు :—
కొఱగామి నఱును, గరకరియరుసు శ్రీల్.

6. కడిఁదినుడివాఁడునున్, మోమోట
పడని విర్దయుఁడు నగునెడ, నిడుసిరుల్
విడివిగా విలువఁబడ కపుడె చెడు :—
అడరు మృదువచన దాక్షిణ్యముల శ్రీల్. 566

7. పరుషవాక్కును, నమితదండమును,
నరనాథు నరిజైత్రబల మఱుగఁగా
నొరయు కొఱము, ట్లాకుఱా, క్లగును :—
పరఁగరా దా రెండు వ్యసనములు రాట్ప్రీన్. 567

8. పరివర్గమును బనిచి యారయని
యరును, పనిచెడినఁ, గోపం బూనుచున్
జిఱచిఱం బడఁ, జిఱుత దగును సిరి :—
వెఱచి, కఱకరి నుడుగుఁ బరిజనశ్రీ. 568

9. యుద్ధంబు వచ్చినప్పుడు, ముందె
సిద్ధరక్షణము చేయవి రాజు, భీ
విద్ధుఁడై వేగంబుగాఁ జెడును :—
ఉద్ధూత మగు నరక్షితబలశ్రీ. 569

10. దండనీతిని నేరువని మొండి
దండుఁ జేర్చును గఠినదండి ; యది కా
కొండు లే దిలకు మెం డగు బరువు :—
దుండగము వెఱవ కుండునె జనశ్రీ ? 570

58 వ అధి కారము

# మొగమోటము.

1. మొగమోట మనఁబడెడు కడు గొప్ప
దగు మనోజ్ఞత్వ ముండుటచేతనే
తగ నిల్చి యున్న దీ లోకంబు :—
నెగడవలెఁ బ్రభువు దాక్షిణ్యసుశ్రీన్. 571

2. మొగమోటముననె సాగుచునుండు
జగతీప్రవృత్తి ; యది లేనివారల్
నిగుడు చుండునది నేలకు బరువు : —
మొగమోట మొందొరుల కొాదవు సుశ్రీ. 572

3. సంగీత మేటి కౌనొకొ, పాట
కంగు పొందద యేని ?—క న్నెటి కొ,
రంగుగా మోమోట లేని యెడ ? :—
పొంగవలె దాక్షిణ్య మీక్షణశ్రీన్. 573

4. ఉన్నటులు మొగమునం దగపడుట
కన్న, నేమిటిఁ జేయుఁ, దగిన యలవిన్
గొన్న మొగమోట ముండని కనులు ? :—
క న్నెలరు, మోమోట మలర హృచ్ఛ్రీన్. 574

5. కండ్ల కాభరణంబు, మొగమోట
గొండ్లి నేయుట : యద్ది లేద యేనిన్
బుం డ్లనియె యవ్వి భావింపఁబడు :—
పుండ్లె, మలవిషయములఁ గలఁగు, దృక్ఛ్రీల్.

6. కను లెనసి, కనక, మన్నన సునికి
గొను మ్రాను లట్టివారలె, కనులతో
నొనరియును, మోమోడ నట్టిఁడులు :—
కనుల దక్షిణత, సుమనఃఫలశ్రీ. 576

7. కనుల మోమోట లేనట్టిఁడులు
కనులు లేనట్టిఁడులె ; కను లున్నవా
రనిన, మొగమోట లేమియె లేదు :—
మొనరు పరిచయఫలం బదియె దృక్ఛ్రీన్. 577

8. స్వీయాధికారకర్మము చిదియ
నీయ కొఁగి, మొగమోడఁ గల వారికిన్
స్వాయత్త మగున దీ లోకంబు :—
న్యాయమలు మోమోట నలు స్థితిశ్రీ. 578

9. కారించి, తమ్ము, మను గుణము గల
వారి పట్టునను, మొగ మోడి దయతో
సైరించి, తాము, మను గుణమె తల :—
ధీరశాంతునిదె యీ స్వభావశ్రీ. 579

10. చనవరులె తమ కిడం గని నంజుఁ,
దివి, యమరుదురు, కామ్యనాగరికమై
యొనరు మొగమోటఁ గోరెడు వారు :—
చన దీ నయంబు జనపాలనశ్రీన్. 580

59 వ అధికారము

# చారుల నేలుట.

1. చారతయు, వినుతార్థశాస్త్రంబు,
నీరెండునుం దెలిసికొనఁగ వలయున్
ధారణీశుండు తన కన్నులుగ :—
దూరగత మెఱిఁగి, యరయుట కవియె శ్రీల్ [సాధనములు]

2. ఎల్లరకు, నెల్లెడల, జరుగునవి
యెల్ల, నానాఁడు వేగమ వేగుచే
మెల్ల నెఱుఁగుట వల్లభుని వృత్తి :—
చెల్లుబడి కది ప్రధానాశ్రయశ్రీ. 582

3. మెలఁగు చారులవలన వృత్తాంత
ముల నెఱిఁగి, కార్య మరయని రాజిలన్
గెలుపు గొనఁ గూడినది లే దొండు :—
అలఁతిగా గెలుతు రరు లట్టి రాట్ప్రిన్. 583

4. పనివారు, తన రాజునకు బంధు,
లనిష్టుల్, నాఁడెదు నందఱనుసున్
గని, తేఱ నారయు సతఁడె వేగు :—
కని యెల్ల, వినుచునదె చారతాశ్రీ. 584

5. అరమరకు నొటిరాని యరరుపునం,
బెఱ కంటి వంజ, బెదురు గుట్టు బైల్
పఱచమిన్ వలను గలతఁడె వేగు :—
నెఱయు నెఱవాదకే చారతాశ్రీ. 585

6. బైరాగి వేసకాఁడై చొచ్చి
యారయుచుఁ, దన్నేమి చేసినను, నా
బారి నేమఱనివాఁడే వేగు :—
నేరుపోరుపుల మెలి చారితాశ్రీ. 586

7. మఱుఁగైన సుద్దు, లేమఱిచి విన
నెఱవాది యై, యెఱింగిన వానియం
దఱమరిక లేని యాతఁడె వేగు :—
ఎఱుకవిరు కుఱు కఱుదు, చారితాశ్రీ. 587

8. ఒక చారుఁ డరసి తెలిపిన విషయ,
మిఁకొక చారునివలన నరయించి, రెం
టికి నొరిమ సరిపడినఁ, గొనవలయు :—
ఒకనినే నమ్మఁ గూడదు నృపశ్రీ. 588

9. వేగు వేగును దెలిసికొన లేని
లా గొప్ప నేలవలె ; నొకట వేగుల్
మూగురు నుడుల్ పొసఁగ, నమ్మఁదగు :—
బాగోగు లరయ, నివి సుతంత్రశ్రీల్. 589

10. బహుమతిని వేగరికి నొరు లెఱుఁగు
రహిఁ జేయరా దరసు ; చేయునేనిన్
బహిరంగపఱచువాఁ డగు, గుట్టు :—
రహస్యంబులు, చారప్రవృత్తి శ్రీల్. 590

60 వ అధికారము

# ఉత్సాహ సంపద.

1. ఒడయఁ దనఁబడు కతం బొకఁ, డతవి
యెడ నడరు నూఁకువయె ; అది లేక, వే
ఱొడమి గలవారు నొడయం బ్రొకో ? :—
ఒడమి విడివడమి, యుత్సాహసుశ్రీన్. 591

2. ఉల్లంపు టూఁకువ కలిమి, యొడమి ;
పల్లటిలు సొత్తొడయతన మన్ననో,
శ్రేళ్ళటికి నిలఁబడక విడనాడు :—
ఒళ్ళనన్ నిల్చు నుత్సాహసుశ్రీ. 592

3. " పైకంబుఁ గోల్పడితి " మని మనో
వ్యాకులత నల్లాడ, రుటిది గలదౌ
నూఁకు వను సంపత్తు గలవారు :—
లోఁకు వగు నూఁకువకు ననేఁశ్రీల్. 593

4. సిరి తానె తెన్నడుగుకొని చేరుఁ,
బొంపడని యుత్సాహ మున్నవా రై
వఱలుచుండెడు ధీవరుల యెడకు :—
మరులుకొను విశ్చలోత్సాహమును శ్రీ. 594

5. జలము లోఁ తంతె నీంలరు కాఁ
డల విడివి ; తమ యూఁకు వంతటిదె యై
వెలయు మానవుల యౌన్నత్యంబు :—
బలియు నొం, దెలయు నొం, డున్నతిశ్రీన్. 595

6. తలఁచునది యెల్ల, సున్నతిఁ గూర్చి
తలఁపవలె : మఱి యద్ది తప్పినను, ఆ
తలఁపు తప్పఁగ రాని నైజంబు :—
వెలఁగుటం గలుగుఁ దొలఁగని సుత్రీ. 596

7. చిదియునెడనున్ స్వోచ్ఛలక్ష్యంబు,
బెదరి యీఁడెడు ఘనులు ; పొది యంబులన్
జదియఁబడినను బెరిమె నూనుఁ గరి :—
వదలరా, వదలి, యుత్సాహసుశ్రీన్. 597

8 ఊఁకువయె లేనివా రెయిద రొగి,
"లోకమున నౌదార్యవంతుల" మటం
చాకూతిఁ గొనుట నగు వాదంబు :—
చేకుఱునె యూఁకింప, కార్ధికశ్రీల్. 598

9. పెనుమేను, వాఁడి గల కొమ్ములును,
నొనరు నది యయ్యు, నేనుంగు, వెఱచున్
దనకుఁ బులి యెదురుపడినదె యేని :—
మొనపునకు లొచ్చు కద తనుబలశ్రీ ? 599

10. ఉరువివేకం బొకని కుత్సాహ
గురుతయే ; అది లేని వారు తరువుల్ ;
నరరూపు లగుటయే వేర్పాటు :—
విరుపయోగముఁ గాదు భూరుహశ్రీ. 600

61 వ అధికారము

## సోమరితనము లేమి.

1. కుల మనెడు క్రుంగి పోవని దీప,
మలసత యనంబడు తమంబు డాయన్,
గలఁగి, నామముతోడ మాసి, చెడు :—
కలఁచఁ గలదే దృశ్యతమి ప్యతిశ్రీన్ ? 601

2. అలసతను నలసతగనే సొలసి,
చెలఁగుచున్ మెలఁగవలెఁ, దమ కొలము మేల్
కొలముగా నెలమిఁ గోరెడువారు :—
వెలయు సో మఱును, సోమరి కులశ్రీన్ 602

3. జడిమంబు నెడఁదలో నిడికొనుచు
మిడుకు మడియందు పొడమిన కులము, వే,
చెడి మడియు నతనికంటెను ముందె :—
గడనకాపుగడ లఱఁ జెడుఁ గులశ్రీ. 603

4. కులము చెడి కలుషంబులుం బెరుఁగు,
నలసతన్ నెలకొన్న నతన, మానై
వెలయు నుద్యతి లేనివారలకు :—
పలుచెఱపులకు మొదలు మాంద్యంబు శ్రీన్. [ బుద్ధిలో ]

5. పనిజాగు, మఱ, పలుచుఁదనము, కును,
కను నాల్గు తెఱఁగుల తమోగుణముఁ, గీ
డెనయునట్టిఁడుల వేడుక తెప్ప :—
మునుచు నా ప్లవము భవసముద్రశ్రీన్. [ విషమున ] 605

6. **పుడమియొడయం(డ పట్టమరినను,**
**మడియ లగు జడుఁదన మున్నవారల్,**
**కడుకొనెడు ఫలముఁ బడయుటె యరిది :—**
**జడిమ పడఁ, గుడు పెడయుఁ, గడమపడి శ్రీల్.** 606

7. నొక్కి వాక్రుచ్చి, యొరు, లెల్లి చపు
వాక్కు లన విం, (డలసతాలాలసన్
జిక్కి, మహితోద్యోగ విహితులు :—
ధిక్కృతాలసత, మతి, నుద్యతిశ్రీ. 607

8. అలసభావము కులీనునియందు
**నిలుచునే, నది, యతఁడు తన పగఱకున్**
గొలువుకాఁ డగునట్లు చొప్పించు :—
అలసతయె చొరఁబడినఁ, జొరవచెడు, శ్రీన్. [బుద్ధిలో]

9. కులపౌరుషములలో వచ్చినవి,
కలుచ, లొక్కటిఁ డుద్యమించి, మదిలో
నలుచుఁదన మేలుటను మార్చుఁ, జెడు :—
కలుగు మాలుగు తమోఁ గుణ మొలయ శ్రీన్. [బుద్ధిలో]

10. **జడిమంబు లేని మన్నియఁ డెయిదు,**
నడుగులన్ గొలిచిన త్రివిక్రముఁడు తా
నడరిన యెడం బెల్ల నొక్కటను :—
జడ నడఁచి, గడనఁ గడఁగిన, నడరు శ్రీల్. 610

62 వ అధికారము

## పురుషప్రయత్న సంపన్నత.

1. అరిది యని యొక్క పని, యొకఁడు తన
చిఱుతనము నెంచి, ముడుఁగమి కావలెన్ ;
బెరిమెను బ్రయత్నమె ప్రసాదించు :—
ఉఱిదిజతనమున జతపడు జయశ్రీ. 611

2. పనియందు జతనంబు నొనరింప
మివి మానవలెఁ ; గార్య మగు కొఱను మా
వినవారి, నెన్న మానును జగము :—
పనిఁ బ్రయత్నమె పురుషలక్షణశ్రీ. 612

3. విడువని కడంక యను మేల్మియం
దెడము కొన్నట్టిదే, మేల్సేఁత నాఁ
బడునట్టి మేలైన భావంబు :—
కడఁక, నెడపడక మిడికిన, నడరు శ్రీల్. 613

4. పురుషకారము లేని యాతండు
పరుల కుపకార మూనుట, పేడి తాఁ
గరవాలుఁ గైకొనుట వలెఁ, జెడును :—
పురుషలక్షణహీనుఁ డొకో, కృతిశ్రీ ? 614

5. సుకముఁ గోరక తనకుఁ, బని నెఱపు
టకె కోరువాఁడు, తన చుట్టముల దొ
నక మెడపి, యూనుఁగంబం బగును !—
సుకర్మకు కూర్మిఁ గోరును సుఖశ్రీల్. 615

6. **జతనంపుఁ గలిమి కలిమిని బెంచు ;**
జతనంపు లేమియో, అనవరతమున్
వెతఁ గుడుపు లేమినే చొప్పించు :—
**జతనపడ జతనుపడు** స్థితిధృతిశ్రీల్. 616

7. తామసములో మసలు పెద్దమ్మ
తా మసలు ;— నిస్తామసుని కడఁకలోఁ
దా మసలుఁ దామరసభవ ; —యంద్రు :—
దీమసముతో మసఁగు కృతి, కెసఁగు శ్రీ. 617

8. పూర్వపుణ్యము లేమి యెవరికిని
నిర్వాద మవను ; జ్ఞేయముఁ గని, క్రియా
ధూర్వహతఁ గడఁక లేమినె నింద :—
సర్వదా యత్నమిదు యోగ్యతాశ్రీన్. 618

9. దైవ మనుకూలింప, కగ వవక
పోవు నైననుఁ, గడఁక యొక్కనికిఁ, దన్
మై వలని యల వలపిఁ, గూలి నిడు :—
దైవమిష, నురువు టుః దుద్యమశ్రీన్. 619

10. అదృష్టంబునుఁ ద్రిప్పి వెను గాంతు,
ఇది పొసఁగ సపు, డులివు లే, వెప్పుడున్
గుదియ, వెదియును సుదియఁ గొనువారు :—
కొదవపడక తొడర, నడరును ఫలశ్రీ. 620

63 వ అధికారము

# కడగండ్ల కడలమి.

1. కడగండ్లు వచ్చు తఱిఁ, గలగుండు
వడక, నగవలయుఁ; గష్టము నడఁచి, పైఁ
బడఁగలది, ముదము వంటిది లేదు :—
కడఁక చెడ, దడరునెడఁ బ్రమోదశ్రీ. 621

2. వెల్లువలు వలె మిక్కుటెడు నిడుమ
లెల్ల, జ్ఞానంబు గలవాఁ డుల్లమం
దుల్లాసభావమున నెంచఁ, జెడు :—
ఎల్ల సుగవగల మొగ గద, మతిశ్రీ ? 622

3. ఇడుమకే యిడుమపఱచెదరు, తమ
కడఁకయందుం దమకు నడంకియౌ
నిడుమ, కెడ నిడుమ పడనట్టిఁడులు :—
ఇడుమ కెడ మిడరు, తొడరువుఁ దొడరు శ్రీన్. [బుద్ధిలో]

4. తడకట్టు పట్టులం దెల్లఁ జె
ల్లెడు ధూర్వహం బట్టివాని, కెదురౌ
కడగం డ్లెదరుపాటు గల దగును :—
ఒడలి బడ లెడలుఁ, గడుకొనఁ గడఁక శ్రీన్. [బుద్ధిలో]

5. అడుకుగా నెడతెగక వచ్చిననుఁ,
దడబాటు లే కుండు వాని కెదురౌ,
కడగండ్లె కడగండ్లఁ బడి చెడును :—
పొడువ విడుమలు, సుడియునెడఁ గడఁక శ్రీన్. [బుదిని]

6. ''లేనివారల మైతి'' మని యలఁత
నూనుదురొ, ''కలవార మైతి'' మని కా
వూను లోభంబు నెఱుఁగనివారు ? :—
దీనభావము దూఱ దుదారశ్రీన్. [ బుద్ధియందు ] 626

7. గుఱి యగుచునుండు నొద లిడుమ, కని
యెఱిఁగి, కలఁకువఁ గొనుట, సౌశీల్యపున్
నెఱిగఁ గొన రెద మేలి తెలివరులు :—
తఱియు నెడఁ గలఁత, విరియదె శమశ్రీ ? 627

8. సుకముఁ గోరకయుండి, దేహంబు
నకు, నిడుమ సహజ మని తెలియువాఁ, డూ
నిక మెలఁగి, నొగులు నొందుట లేదు :—
స్వకృతఫలభుక్తి, మెయి కుదుగవలె, శ్రీ. [ బుద్ధి ] 628

9. సుగము కలుగఁగ మెయికి, మదిని సుగ
తగులఁ గొననతఁడె, నొగులొంద మెయి, యా
నొగులునన్ మదిని బొగులనివాఁడు :—
సుగవగలయెడ సమత సుయోగశ్రీ. 629

10. ఇమ్మ గానిది యేని వింపుగనె
నెమ్మదిం గొనిన, నగుఁ, దన వైరులున్
సమ్మతించెదు పేర్మి యొక్కనికి :—
ఉమ్మలిక చెడు, సదాప్రముదితశ్రీన్. [ బుద్ధియందు ]

# అమాత్యుఁడు.

1. ధన,బలసుసాధనములనుఁ, గాల
మును, నెఱవునుం, జేయు నరిదిపనియున్,
బొనరింఁ గనఁ గలవాఁ డమాత్యుండు :—
పని కనుం గి యంగపంచశ్రీ. 631

2. ధృతి, కులీనత, రక్షకత, రుఅచి
మతిఁగనుట, కడఁకతో, నైదింటితో
డుత మహితుఁ డగువాఁ డమాత్యుండు :—
హితగుణము లివి కార్యదక్షతాశ్రీన్. 632

3. వేఱు చేయుట, యేలికొనుటయును,
వే అయినవారి పొం దమరుచుటయున్,
నేరువం గలవాఁ డమాత్యుండు :—
ధీరునకె కలుగు సమయోచితశ్రీ. [బుద్ధి] 633

4. తెలియుటయుఁ, దగిన కార్యము నరసి
సలుపుటయు, సుటిదిగా వాకొనుటయున్,
వలను గలయాతం డమాత్యుండు :—
సలుపు వగఁ దెలుపుటకె యమాత్యశ్రీ. 634

5. పాడిఁ గని, తెలి వారి యమరు నుడి
వాఁ డగుచు, నే నాఁడు నను వెఱుఁగు మేల్
ప్రోడయే తగు మంతనపుఁ దోడు :—
పై డంబ మొకో ధీసహాయతాశ్రీ ? 635

6. మతిసౌక్ష్మ్య, మురుశాస్త్రవిజ్ఞాన
యుతముగాఁ, గలవారి కతిసూక్ష్మముల్,
మతిఁ దోఁచ, కేవి మున్నిల్చునవి ? :—
అతికౌశలాస్పదము పశాగ్రశ్రీ. [బుద్ధి] 636

7. తివిరి, శాస్త్రోక్తముగఁ గార్యముల
నవరించు విధ మెఱింగినను, లోక
వ్యవహార మెఱిఁగియునుఁ, జేయవలె :—
నవణించ దుద్యమ మలౌకికశ్రీన్. [బుద్ధివలన] 637

8. తెలివడుల తెలివి లెక్కడ, కరుసు
తెలివిమాలినను, నుఱిదిగను విషయం
బుల నమాత్యుండు తెలుపుటయె విధి :—
తెలుపమిం బెగడ కగ దగు జగచ్ఛ్రీన్. 638

9. శ్రీ దెన్ను మంత్రికంటెనుఁ, బ్రుక్కు,
నీడాడఁగా నిలిచి యుండు పగవా
రేడు పదికోటు లైనను మేలె :—
లో దాంభికత విడంబించు దుశ్శ్రీ. [విషము] 639

10. క్రమముగా మున్నుగా నారసియు,
సమాప్తిమె లేనియవి చేయుదురుగా,
సమకూర్చు నెరవు తెఱుఁగనివారు: :—
అమాత్యాగత్యము లుపాయధీశ్రీర్. 640

# మాట నేర్పు.

1. నాలుకనయం బనంబడు నయమె
మే లొడమి ; అనయ, మిఁ కే నయమునన్
లోలో నడంగినదియునుఁ గాదు :—
లోల నయాగారమున లోల యగు శ్రీ. 641

2. మేలుఁ గీడునుఁ బలుకుచే వచ్చి
క్రాలుట, విదానమున నోమవలయున్
నాలుకను, నుడియందుఁ బొరనుండి :—
ప్రేలు రసనను విరస మగు, రసాశ్రీన్. 642

3. వినినవారల నొడిసి వశపఱచు
కొనఁగఁ దగి, విననివారును వేడుకన్
గొనఁ, బల్కునది యగును వాక్పటిమ :—
అనుట సొంపిల, వినుట కిం పెలయు శ్రీన్. [బుద్ధిలో]

. భావంబు నెఱిఁగి భాషింపవలె
నే వచనమును ; ధర్మమును నర్థమున్
లేవు దానిని మించినవి యెవియు :—
భావుకప్రదము వాక్చతురతాశ్రీ. 644

పలుకవలెఁ బలుకునున్, వేఱొక్క
పలు కెదియు, నప్పలుకుసున్ గెలుచు మేల్
పలుకు గామిని దలఁపునం దెఱిఁగి :—
కలికిపలుకుల మెలఁకువన్ గులుకు శ్రీ. 645

6. వేడుకం గొలుపఁ దా మాడి, పరు
లాడు మాటల ఫలముఁ గొనుట, మహిమన్
వీడుమసి లేవి వారల నిరుకు :—
కీడునుడు, లనమి, కొనమియు, నయశ్రీ.

7. మాటనేర్పరి, యేమఱనివాఁడు,
నోట మొందనివాఁడు, నగువాని, మా
ర్పాటునన్ గెలుచు చేరికి నరిది :—
దీటు, మీటును, వచనపాటవశ్రీ.

8. మునుకొనుచుఁ గార్యముల మేకొనును
జనవితతి, క్రమ మేర్చి, ప్రియకరముగా
నన వల్లనగువారు పొరయునెడ :—
కను లక్ష కొకఁడు వాఙ్నిపుణతాశ్రీన్.

9. పలుమాట లాడఁ గామింత్రు గద,
మలినములు గాని వగు కొన్ని మాటల్
పలుకు నేరిమివి దేఱనివారు :—
లలిని గొలుపును మితసుభాషణశ్రీ.

10. దళము విచ్చియును వాసన లేని
యల రట్టిఁడులు, నేర్చినది తెలియనా
లలి విప్పి చెప్పఁ జాలనివారు :—
తెలివితెలివిడి, వచోనైపుణిశ్రీన్.

# కర్మశుద్ధి.

1. సహాయశ్రేష్ఠత్వ మొక్కఁడికి
బహువృద్ధి నిడుఁ ; గ్రియాశ్రేష్ఠత్వమో,
అహీనాభీప్సితము లెల్ల నిడు :—
ఇహపరాభీష్టదము సుకర్మశ్రీ. 651

2. ఏనాఁడునున్ మానఁగావలయు,
మానితంబగు యశముతోడఁ బుణ్యం
బానయించని, దుష్టకర్మంబు :—
కానిపని, నగ డిల, నవల, నఘశ్రీ. [విషము] 652

3. విడనాడఁగా వలయు, గౌరవముఁ
జెడఁగొట్టు పనిసేఁత, నభివృద్ధినిన్
బడయుదు మటంచు నెంచెడువారు :—
కడలుకొనుఁ గర్మశుద్ధిని యశశ్శ్రీల్. 653

4. కడగండ్లు పడిననున్, దూషింపఁ
బడెడు చెడుగులఁ జేయఁ దొడఁగ రెపుడున్
నడుకు లేనట్టి ఘనదర్శనులు :—
ఇడుమ లుడుగును ; నిగుడు నగ డిలాశ్రీన్. 654

5. "ఎట్లు" లని, తా వగచు పనుల సమ
కట్టరా దొక్కఁడు ; చేసినాఁడే,
నట్టియవి మఱలఁ జేయమి మేలు :—
తొట్టుటకు మున్ గార్య మరయవలె శ్రీన్. [బుద్ధియంచు]

తన కన్న తల్లి యాఁకలిఁ గాంచి
వనరువాఁ డైనసుం, జేయంగరా,
దనయ మని ధీవరులు దూఱు పని :—
మనువచనమును జెగడు నీ నయ శ్రీ. 656

కడు నగడు మేకొనుచుఁ దుంటరులు
పడయు సంపదకంటె, నెఱతెలివరుల్
కుడుచు నిఱుపేదఱిమియే మేలు :—
విడుదగా నిలఁబడదు, నిందపలె, శ్రీ. 657

కడమవిగఁ ద్రోపడిన దుడుకులను
గడవ విడువక చేయువారి, కవి, తా
మెడఁకరు ముగిసిననుఁ, బీడ నిడు :—
చెడు గొనర్చియుఁ జేర్చు సిరి, యఘశ్రీ. [విషము] 658

పరు లడల, నొకఁడు, కొనినవి యెల్ల,
మఱి, తానె యడలఁ, జెడుఁ ; గోల్పడిననున్,
మఱి, ఫలించును, నయము పాలిటివి :—
ఇరు మెయుల మేలు శుద్ధక్రియాశ్రీన్, 659

అపగడముచే ధనముఁ జేర్చి ధ్రువ
మవఁగఁ గాచుట, పచ్చి మట్టి కుండన్
మిపుల నీర్వోసి యుంచుట యట్లె :—
తవులుఁ బరిశుద్ధ చేష్టితులందె శ్రీ. 660

67 వ అధికారము　　　　　[అమాత్య భాగము

# పని దిటవు.

1. పనిదిటం బనఁబడెడు నది, యొకవి
మనసుదిట ; మితరంబు లైనట్టి వె
ల్లను దావికంటె వే తైనవే :—
పని నెఱయు రతము, మతిదృఢత్వశ్రీ.　　661

2. ఎడ లుడుపుటయును, వచ్చిన వెనుక
సడలమియు ; నీ రెంటి దారి యం, ద్రే
రపడ నారసిన వారి నిశ్చయము :—
ఎడ రెడపి, నడపు నగవుల, దృఢశ్రీ. [ బుద్ధి ]　　662

3. కడను వెల్లడి చేయు యోగ్యతయె
కడు దిట్టతనము ; కార్యము నడుమ వె
ల్లడి యైన నుడివోని యిడుమ లిడు :—
నడివెల్లడిని, జెంచు నరి, క్రియాశ్రీన్.　　663

4. చెప్పుటలు వేరికిని నెల్లి దము ;
లెప్పుడును, నరిది వగుఁ, జెప్పునవి యో
చొప్పులం గడముట్టఁ జేయుటలు :—
గొప్ప లాడుటొ, కార్యధుర్యతాశ్రీ ?　　664

5. పేరిమిని జెంది, మహితుల కార్య
ధీరత్వ, మధిపు కడ, ఫలవంతమై,
గౌరవముతో మదింపంబడును :—
కూరు టరు, దుఱిది, యరి దిగు క్రియాశ్రీన్.　　665

6. ఎన్నినవి యెన్నిన గ్లైయిదఁగల,
రెన్నినట్టిఁడు, లర్థద ప్రక్రియల్
పన్ను దిట్టంబ్రడు కాఁగలరేని :—
అన్ని సిద్ధులకు మూలము దృఢశ్రీ. [బుద్ధి] 666

7. ఉరువుఁ గని యెల్లిదము సేయవల ;
దుంటలు పెను తేరి కిరుసాణి వలెఁ, బే
రుటిది గలవారు గల, దీ జగము :—
మొఱిమేననే నమరు దృఢమతిశ్రీ. 667

8. కలఁగ, కాంచి కన్న పనియందుఁ,
దొలఁగ, కాలస్యమును గడపి, నింతిన్
మెలఁకువం బూని చేయఁగవలయు :—
చెలఁగి మెలఁగక నిలుగఁ, జెడుఁ గ్రియాశ్రీల్. 668

9. కష్టంబు మిక్కిలిగఁ గలిగినను,
జేష్టింపవలయు, స్థైర్యంబూని, సం
తుష్టి ఫలియించు సత్కార్యమును :—
భ్రష్టఫల మగుఁ గార్య, మస్థిరశ్రీన్. [బుద్ధివలన] 669

10. ఎట్టెట్టి దిట్టతన మెయిదినను,
బెట్టు నిడు పనిదిట్టతనముఁ గొనకు
న్నట్టిఁడులఁ గోరి కొన దీ జగము :—
ఎట్టి పనికినిఁ బ్రధానము దృఢశ్రీ. [బుద్ధి] 670

68 వ అధికారము ౹ [అమాత్య భాగము

# పనిచేయు వగ.

1. ఆలోచనకు మేర, నిశ్చయము
తేలుటయె ; తొడఁగఁబడ కా నిశ్చితం
బాలస్యమున నిలఁబడుట, కీడు :—
ఆలస్యమున నమృత మగును దుశ్శ్రీ. [విషము] 671

2. తడయవలెఁ దడసి చేసెడు పాలఁ
బడు పనులఁ ; దడయఁ గూడదు, తడయకే
వడివడిం జేయ వలసిన పనుల :—
తడఁబడిన, నీ క్రమము, చెడు ఫల శ్రీ. 672

3. పొసఁగు నెడలం దెల్లఁ గార్యంబు
వెసఁగఁ జేయుట నయమె ; పొసఁగని యెడన్
వస మైన వెర వంసి చేయవలె :—
అసమయోచితగతిన్ జెడుఁ గ్రియాశ్రీ. 673

4. పనిపగ లనెడు రెంటి పగు మిగులు
లును, సమాలోచింపఁగా, నెప్పుడే,
ననలశేషంబువలె, వేగించు :—
ఋణరుజాశేషములు నటె జగచ్ఛ్రీన్ : 674

5. ధనము, సాధనముఁ, గాలముఁ, గార్య
మును, స్థానమును, నైదు, మరులు తీఱన్
గణియించి, పొసఁగఁ, జేయఁగ వలయు :—
మునువెనుక లరయమిని జెడుఁ గ్రియాశ్రీల్. 675

6. ముగియుకకుఁ దగు వగయు, నెడ్డములు,
ముగిసినపు డెయిదు పెనుకూడుదలయున్,
మొగిఁ జూచి, యోచించి చేయవలె :—
తిగ, దెలుకకొఱకుఁ, ద్రవ్వాట నగశ్రీన్. 676

7. చేయఁ దగు పనిఁ దొడఁగువాఁడు, మును
జేయ నగు క్రమము, తత్కార్యమందున్
లోయెఱుకవాని భావముఁ గొనుట :—
శ్రేయ మనుగతి సదసుభవి గతిశ్రీన్. 677

8. జరుపు పనిచేత మఱియొక పనియు
నెఱపుకొనవలె ; మత్తగంధకరిచే
మఱియొక్క కరిని బట్టెడు నట్లు :—
గరిమ మేరక్రియను ద్వయార్థశ్రీ. 678

9. మిత్రులకు మేళ్లు చేయుటకంటె,
నాత్రంబుతోఁ జేయవలసినదియే
శత్రువుల నొడిసి మైత్రినిఁ గొనుట :—
పాత్రములు సంధివిగ్రహగుణశ్రీల్. 679

10. నసుపుకొదవారు, తమవారి నడుఁ
కున కంజి, కొఱ బెరయునేనిఁ, బొందున్
గొనియొడదు, పెరిమెకాంద్రకు నడఁగి :—
జనత కంటెను ననుఁగొ స్వమానశ్రీ ? 680

69 వ అధికారము



# దూత్యము.

1. అనురాగకలన, సత్కులభవము,
మనుజేశకామ్యగుణకలన, మూడున్
ఘనదౌత్యభాషి లక్షణములగు :—
పనుపఁ దగ దొరుల వార్తికత్వశ్రీన్. 681

2. నెన, రెఱుక, ఆరసిన సుదినేర్పు,
ఘనదూత్య సంభాషణుల కనుఁగులౌ
గుణము, లావశ్యకంబులు, మూడు :—
ఎనయుఁ గద దౌత్యం, బమాత్యతాశ్రీన్. 682

3. శాస్త్రులందున శాస్త్రకృతి యగుటె,
సాస్త్రినృపు కడ, స్వనృపజయకృత్క్రియన్
నిస్త్రాసముసఁ బల్కు వాని నెఱి :—
శస్త్రి మడఁగఁగ పలయు దూతవాక్ఛ్రీన్. 683

4. ఎఱుక, మే లురు, వారసిన చదువు,
వెరసి యీ మూటి పొందిక గలతఁడే
యరుగవలె దూతకర్మంబునకు :—
అరు దొకనియం దమరు టీ త్రయిశ్రీ. 684

5. ఎంచి కూరిచి పల్కు, పెఱు చుడిగి,
యించు నటు పల్కు, తన జేని కొనరన్
మంచి నెఱపెడు నతడు తగు దూత :—
ఇంచుమించులఁ జెడును సులక్ష్యశ్రీల్. 685

6. కలఁచి యర్థముల, కన్నోటు పడ.
తెలుఁగఁబడఁ బల్కి, సమయోచితం బౌ
వెరవు వెలుఁగు నాతఁడే తగు దూత :—
అరిది యైనది దౌత్యచాతురి శ్రీ. 686

7. క్రమ మెఱింగి, యనుకూల మైన కా
లముఁ జూచి, యెద మెఱింగి, యెన్ని పలుకన్
సమర్థుఁడు వివిధమాతలనుఁ దల :—
సమాధానానేత సుమాత శ్రీ. 687

8. అమలినత్వము, సహాయత్వంబు,
సమయధైర్యాప్తి, యామాటి సద్భా
వమును దౌత్యాధారి లక్షణము !—
అమరు దది లేక దౌత్యలక్ష్మి శ్రీ. 688

9. చెప్పి పంపిన మాట, పెఱ దేని
కొప్పఁ జెప్పెడు వాఁడు, పెదమాట వా
తప్పి జాఱని యట్టి దిట్టంచె :—
ముప్పు నంజమి మాత లక్షణ శ్రీ. 689

10. తెగుదల ఘటించినను బుద్ధి తన,
కగ పుడుగ, కొగిని దస దేని కితవా
నెగుప నెఱపెడువాఁడు తగు మాత :—
నిగుడించు రాయబారి పద్ధి శ్రీ. 690

# మన్నియునిఁజేరి మనుట.

1. తొలఁగకయుఁ, దటియకయు, నిప్పు కడఁ
జలిఁ గాచుకొనువారిఁ బోలవలయున్
బెళుచుఁ గొను నృపుఁ జేరి మనువారు :—
మెలఁకువ యవశ్య మధిపాశ్రయశ్రీన్. 691

2. మన్నియుఁడు వలచునవి వలవమియె,
సన్నిధానులకు, మన్నియనిచేతన్
మన్నింపఁబడి నిల్పు పెంపునిడు :—
ఎన్నునెడ రాట్సమత, చెడు స్థితిశ్రీ. 692

కాచునెడ సేవి దొసఁగులనుండి
కాచుకొనవలె ; సందియము తేవికిన్
దోఁచ, నమ్మించు టేరికి నరిది :—
నీచము ప్రభుద్రోహచింత హృచ్ఛ్రీన్. 693

చెవిని గుసగుసలాటయును, జేరి
నవులాటయును, మాని మనఁగవలయున్
సువిశేష మమరు పెద్దల యొద్ద :—
అవి సంశయముఁ గొల్పుఁ గనువారి శ్రీన్. [బుద్ధిలో]

ఏ విషయమో వినక, తొడరి యే
మో వేఁడకయు, దాని నుడిగి నొడుగం
బోవు తఱి, వినవలె, రహస్యమును :—
పోవదే, యన్యథా, గౌరవశ్రీ ? 695

6. గుఱి యెఱిఁగి, యగవు లెఱిగింపఁ దఱి
నరసి, పెఱ చవనిపియు, వలచు నవియున్
గలుదుమెయి, వేడ్క యిడఁ జెప్పవలె :—
నెఱి చెడినఁ, జెడును రాజాశ్రయశ్రీ. 696

7. వేడుకం గొల్పునవె చెప్పి, యే
నాఁడునుం, బనిలేని విషయంబులన్
తేఁ దడిగిననుఁ జెప్ప టుడుగవలె :—
కూడనివి యాడఁ జెడు నాశ్రయశ్రీ. 697

8. " ఎలవయసు వాఁ, డిట్టి పట్టు ", మం
చలఁతిఁ దెగడక రాజు, నతనియందున్
గల ప్రభుతతోఁ బొసఁగ మనవలయు :—
ఇల నీశ్వరుఁడు కద నృపాలకశ్రీ ? 698

9. " క్రొనఁబడితి మధికులుగ నధిపుచే "
నని యెన్ని, కొనఁ దగని వానరుపరుగా,
తొసఁకు లేనట్టి ఘనదక్షులు :—
కొనసాగ దొండె, రాజాశ్రయశ్రీ. 699

10. "పలునాళ్ల జేనితోఁ బరిచయము
గలవాఁ " డని యెంచి, తగని పలులన్
సలుపు స్వాతంత్ర్యంబు కీడు నిడు : —
తలమీఱఁ జెడు నృపానుగ్రహశ్రీ. 700

## గుఱి యెఱుంగుట.

పలుకకయె యొకఁ, డతనిఁ గాంచి, గుఱి
తెలియువాఁ, డెపుడు నింకని జలధిచే
వలయితం బగు భువికి, భూషణము :—
తెలియు టింగిత, మింగ లక్షణశ్రీ. 701

అనుమానపడక, యాంతర్యమును
గనుఁగొనం గలవాని దైవంబుతో
నెనగా మదించి చేకొనవలయు :—
ఎనయు టరిదగు నింగితజ్ఞతాశ్రీన్. 702

ఒరుల మొగగుఱుతులం బట్టి, లో
గుఱి యెఱుఁగువారి, నురువిడుల నేదే
నరితి విడి, తోడుగాఁ గొనవలయు :—
నిరతిశయ మితరాశయజ్ఞతాశ్రీ. 703

గుఱియించినది యొకఁడు, తా ననకె,
యరసి కొను వారితో, నొరు, లురువునన్
సరిపోలినను జ్ఞానమున వేఱు :—
పరము గూఢోద్దేశ సంగ్రహశ్రీ. 704

ఒరుల మొగగుఱులచే, లో వఱలు
గుఱు లెఱుఁగవే, నింద్రియంబులందున్,
మఱి యే ఫలముఁ గూర్చునవి కనులు ? :—
గుఱి గుఱించుటకె దృక్ప్రముఖతాశ్రీ. 705

6. తన చెంతఁ గలదాని రూపమును
గనఁ బఱచు నద్దంబు వలె, మనసునన్
మును మించు దానిఁ జూపును ముఖము :—
మనోగతవిషయసూచిక ముఖశ్రీ. 706

7. మొగము వలె నొండు, పేరెఱుక గల
దిగ నుండునో ? మనసు ముద మొందినన్,
వగచినను, నది తానె ముం దగును :—
మొగ, మెడఁదగుటి యెఱుఁగఁ, దగు సాధనశ్రీ. 707

8. మొగముఁ గవి, యొకఁడు నిల్చినఁ జాలు,
నగపడెడు గుఱులచే లోనఁ గవి, తన్
వగ నెఱుఁగఁగలవారి బెరయునెడ :—
మొగము భావముఁ దెల్పు మౌనవాక్ఛ్రీన్. 708

9. పగయు నెయ్యము నొక్కనివి, కనులె
విగదించుఁ, గనుచూపు వేర్పాటులన్
వగ లెఱుఁగఁ గలవారి బెరయునెడ :—
నెగడు, మది నగు వికల్పములు, దృక్ఛ్రీన్. 709

10. " అలకతెలివరుల " మనువార, లిత
రుల భావములఁ గొలుచు కోల, యరయన్,
వెలయు కనుకలి కాక, లేదు పెఱ :—
తలఁపుచూపుల యొరిమ స్వభావశ్రీ. 710

72 వ అధికారము

# సభ నెఱుఁగుట.

1. కొలు వెట్టిదో యెఱిఁగి, యోచించి
పలుకఁగా వలయుఁ, బలుకుల పొందికన్
దెలియఁగాఁ గలుగు శుద్ధాశయులు :—
చిలిపిపలుకులఁ దలఁగు సభ్యతాశ్రీ. 711

2. సమయ మారసి తెలిసి, వాచ్యవిష
యము బాగుగా నెఱిఁగి, పలుకవలె, వా
గ్గమన మెఱిఁగిన మేలి తెలివరులు :—
క్రమ ముడిగి వదరఁ గూడదు సభాశ్రీన్. 712

3. సభ నెఱుంగక యుపన్యాస మా
రభటి మేకొనువార, లెఱుఁగరు వచో
విభజనము ; వల నైనదియు లేదు :—
సభామోదదమె సత్ప్రసంగశ్రీ. 713

4. తెలివరుల ముస్నుఁ దెలివరులుగా
వెలయవలె ; వెలరువాఱెడువారిమున్
వెలిసున్నపున్ వన్నెఁ గొనవలయు :—
కొలువు కొలఁదికి వెలుచవలె వచశ్శ్రీన్. 714

5. మే లనంబడు వారిలోననున్
మేలె, మించినవారిలోన ముందై
గేలి పడ వాకొనవి, యడకంబు :—
ఆలింపవలె మును సభాసదశ్రీన్. 715

6. ఉఱు నెఱిన్ విలుపు సడలిన యట్లె,
విరివియౌ నెఱుకఁగొని, సదసున సుధీ
వరుల ముందఱ మాట పొరపడుట :—
పొరసి ఫలమేమి సదభిజ్ఞతాశ్రీన్ ? 716

7. కఱచి పెక్కెఱుఁగువారల విద్య
పొరి వెలుఁగుఁ, గస టఱఁగ వాగ్వివరణం
బరయఁ గల్గెడి నేర్పరుల నడుమ :—
మెఱయునే ముఱికిలోనను మణిశ్రీ ? 717

8. తెలిసికొనఁ గలవారి ముసు, బుధులు
పలుకునది, పెరుఁగు పై రున్న పాదిన్
పొలుపార నీరు వోయుటఁ బోలు :—
తెలి వెదుగుఁ, బలుక, విన, సత్సభాశ్రీన్, 718

9. కించుల సభన్ మఱచియునుఁ బ్రసం
గించఁగూడదు, మంచివారల సభన్
మంచి వాగిఁ జెల్లఁ బల్కెడివారు :—
మించి నిందితు లగుట కాదు సుశ్రీ. [బుద్ధి] 719

10. ఘుంగిలిం బడి చిందు నమృతంబు
భంగి నగు, బుధులు స్వగణేతరుల దౌ
ముంగలన్ వాకొనిన విషయంబు :—
మంగునన్ వ్యర్థ మగు సదర్థశ్రీ. 720

# సభ నంజమి.

కూటంపు వగ యెఱిఁగి, నేర్పరుల
కూటమున వాకు పొందపడ నిడలునన్,
మాటపొం దెఱుఁగు శుద్ధాశయులు :—
మాట తడఁబడుట కూడదు సభాశ్రీన్. 721

నేరిచినవారిలో నేరిచిన
వా రనంబడియెదరు, నేర్పరుల మున్
నేరిచిన వొప్పఁ జెప్పెడు వారు :—
ధీరునకె చెల్లు సద్వక్తృతాశ్రీ. 722

పగఱ నడుమకు జొచ్చి చచ్చుటకుఁ
దెగువఁ గొనువారు పలువురు ; కొందఱే
తగు సభన్ బలుక నంజనివారు :—
విగదింప దిగు లగును గద సదశ్శ్రీన్. 723

చదువరుల మును, జదివినవి పల్కి
మదిఁజెల్లఁ, తాము చదివినకంటె, మేల్
చదువరులలోని, మేల్ గొనవలయు :—
పొదలు, వినుచుచు వినుచు నున్న ధీశ్రీ. 724

ఉఱు నెఱిఁ బ్రమాణంబు నెఱుకమెయిఁ
గఱవవలె, సభ నంజ, కే ప్రశ్నకే,
నుఱ వైన మార్మాట విడు పొందె :—
కఱుదు విడు న్యాయశాస్త్రజ్ఞతాశ్రీ. 725

6. శస్త్రమున నేమి, నిర్వీర్యులకు ?
శాస్త్రమున నేమి, సూక్ష్మజ్ఞుల సభన్
నిస్త్రస్నువులు గానివారలకు ? :—
శస్త్ర, శాస్త్రయుఁ గొనవలయు ధృతిశ్రీన్.

7. పగఱ నడుమను బేడి గైకొన్న
దగు నిశిత శస్త్రంబు, సభ నడుమ బీ
తగువాఁడు నేరిచిన శాస్త్రంబు :—
నెగడ వాగి వారి శస్త్రశాస్త్రశ్రీల్ ?

8. పలు విద్దెలను నేర్చి యుండినను
ఫలహీనులే, సుకోవిదుల సభలో
లలితార్థ మొప్పఁ జెప్పనివారు :—
తెలివిడియె కాదె విద్యాఫలశ్రీ ?

9. అధికరించని పామరులకన్న
నధము లందురు, చదివి తెలిసికొనియున్
బుధజనుల సభ నంజువారలను :—
అధిగమశ్రమమాత్ర మొకో ఫలశ్రీ ?

10. మను చుండినను లేవి వారితో
నెన యగుదు, రోలగము నంజి తమ నే
ర్చినవి యొప్పారఁ జెప్పనివారు :—
గణనీయు లవ రట్టిఁడులు జగచ్ఛ్రీన్.

## నాడు.

కొఱవడని పంటయును, యోగ్యులునుఁ,
జెఱపు నొందని సిరులు గలవారలున్,
మఱిమఱియుఁ జేర మనునది నాడు :—
వఱలు నా రాష్ట్రమునఁ బ్రాభవశ్రీ. 731

అమితార్థవంత మయి, వాంఛనీ
యమును నయి, యీతిబాధల లేమినిన్
సమధికంబుగఁ బండునది, నాడు :—
అమరు నివి రాడ్ధర్మపాలనశ్రీన్. 732

పరదేశిభర మొకటఁ బైవచ్చ
తఱిని భరియించి, తేనికిఁ గప్పముల్
సరిగఁ జెల్లించఁ గలయది నాడు :—
నెఱయు నివి సస్యాదిసమృద్ధిశ్రీన్. 733

పౌరియాఁకలియు, విడని పీడయును,
జెఱపుఁ జేసెడు పగయుఁ, దన యెల్లనున్
దఱియ కొప్పుగ నడచునది నాడు :—
వఱల నవి రాష్ట్రపరిరక్షణశ్రీన్. 734

పలు కూటువలుఁ, బాడు చేయు లో
పలి పగయుఁ, బ్రభు నలఁచు కొల వృత్తిగాఁ
గల దుర్జనతయు, లేనిది నాడు :—
తొలఁచవలె నవి కలుగ, నరనృపశ్రీల్. 735

6. క్రీ దెఱుంగనిది యై, యరుదుగాఁ
గి దొందినను, బంట కుందనిది యా
నాదె యందురు నాడులందుఁ దల :—
నాడునకు మేల్మి, ధర్మావనశ్రీన్.

7. ఇరునీటి యాదరువులున్, దగిన
యిరవులం గొండలును, వచ్చు నీరం,
బులు కావలియు, నాటి కంగములు :—
తఱుఁగ దవి వఱలు రాష్ట్రమున శ్రీ.

8. నొగుళు లుండమి, నెగడు సంపదలు,
మిగులఁ బండుట, యిమ్ము, కాపుగడ : మేల్
సొగ సంద్రు వాడునకు నీ యైదు :—
పొగడుదురు పరు లట్టి సురాష్ట్రశ్రీన్.

9. నాడు లందురు, దేవకయె దొరకు
పోఁడుములు గలవి ; నా డవదు దేవు
ళ్లాడిననె పోఁడిమిని నిడు నాడు :—
పాడిపెంపుల యిరవె సురాష్ట్రశ్రీ.

10. ఆ నుడివి నట్లమరికను నెయిది
యేవియునుఁ, దత్ప్రయోజనహీనమే,
తేని యమరిక లేని దగు నాడు :—

75 వ అధికారము

# కోట.

1. పోటుమానిసులకును శ్రేష్ఠంబు—
కోట— ఓటమివలనఁ దన శరణమున్
బాటించువారికిని శ్రేష్ఠంబు :—
కోట నాటికి ముఖ్యరక్షకశ్రీ.

2. మణివంటి నీరు, మరుభూమియునుఁ,
బెను గొండలును, దట్టనీడ గల కా
ననమునున్, జుట్టుఁ గలయది కోట :—
ఘనరక్ష లీదుర్గచతుష్కశ్రీల్.

3. ఎత్తు, వెడలుపు, దిట, వరిదితనము :
మొత్త మీ నాల్గింటి యమరికయు నౌ
భిత్తి, దుర్గం బంద్రుడు చదువరులు :—
చొత్తెంచ నీయనిదె సుదుర్గశ్రీ.

4. చిఱుకాపుగడలు గల పేరెడము
వఱలునది యై, మిటు పగ యూఁకువన్
జెఱచునదియే మే లయిన కోట : —
అరివర్గదుర్గమము సుదుర్గశ్రీ.

5. కొనుట కరి కరిదియయి, లోఁ గొన్న
తినుపినును లున్నదై, లో వారు నె
క్కొనుట కెల్లిద మైనయది కోట :—

ఎల్ల సామగ్రులునుఁ గలది యై,
యెల్లపుడు నెడ రెడప నొదవుటకు నై
పెల్లుకొను వీరు లున్నది కోట :—
త్రుళ్ల రరు లెదిరింప సుదుర్గశ్రీన్. 746

ముట్టినను, ముట్టకయె పోరు సమ
కట్టినను, వంచించినను, శత్రువుల్
పట్టుటకు నరిది యయినది కోట :—
ఎట్టు లొదవును గొదవ, సుకోట్టశ్రీన్ ? 747

ముట్టు చాలిక గలిగి, ముట్టు వెలి
జెట్టులనుఁ, బట్టుదలఁ బూని, తన లో
పట్టునను గెలువఁ, దగినది కోట :—
పట్టు బల మెచ్చుఁ గద సుకోట్టశ్రీన్ ? 748

మొనమొగమునన్ మాఱు తుంత్రు నెదఁ,
దనలోని మొన సేయు ననిమొగమునన్
బెనువుఁ గొని, మహిత మైనది కోట :—
రణోవీరగణఘనము సుకోట్టశ్రీ. 749

ఏ మహిమ లున్న దైననుఁ గార్య
సామర్థ్యమహిమఁహితుల ఘటనయం
దేమియును లేనిదే యగుఁ గోట :—
స్వామి కృతియే, నోము సుకోట్టశ్రీ. 750

# అర్థ మార్జించు వగ.

1. అర్థముగ నెన్నఁబడ నట్టిఁడుల,
నర్థముగ మన్నింపఁబడఁ జేయుఁ, దా
నర్థంబు కాక లే దర్థంబు :—
అర్థమూలమె జగత్పదార్థశ్రీ. 7

2. అర్థహీనుల నెల్లరును నంద్రు
వ్యర్థులని ; అర్థవంతుల నెల్లరున్
ప్రార్థించి చేయుదురు గౌరవము :—
అర్థం బనర్థంబె సదర్థశ్రీన్. 7

3. ద్రవ్య మనఁబడు నాఱిపోనట్టి
దివ్య, తాఁ గలవారి యిరులు నడఁచున్,
సవ్యముగ నెన్ను నాడునఁ జెల్లి :—
సువ్యాప్త మౌర ధనదీపికాశ్రీ ! 7

4. పాడి నీనును, సౌఖ్యమును నీనుఁ,
బోఁడిమి మెఱింగి యొనరించు గడనన్
గీడు లేకుండ వచ్చిన ధనము :—
పీడ నీనదె యక్రమార్జితశ్రీ ? 7

5. అరులుతోడను, నరితితోడనున్,
సరికట్టి రాని ద్రవ్యార్జనంబున్
బొరయ, కుంవడిఁ బొంల విడువవలె :—
చెరికి యయి చేరి నతనిని జెఱచు శ్రీ

ఒదయ లుండని యొదమి, సుంకంపు
టొదమియునుఁ, దన పగఱ దండింపఁ జే
పడు నొదమియును, తేని దిగు నొదమి :—
పదయు పన్నులుఁ గూడ రాఢ్ధనశ్రీ. 756

అనుకంప యనెడి యనురాగ మీ
నిన యనుఁగుబిడ్డ, ధన మనఁబడునదౌ
పెనువు దాదిలివలన మనుచుండు : –
కనికరముఁ గని, కరము నిడఁ, బెరుఁగు శ్రీ. 757

కొం దెక్కి, దిగువ నేస్తులు పోరు
చుండఁ, గను టట్టిదే, తనదు క్రైసా
త్తుండఁ, నొం డొనరించువాని పని : —
మెం డగును గార్యఫై స్యము ధనశ్రీన్. 758

గడియించపలె ధనము ; పగఱ ని
క్కడఁగించు నుక్కు టడిదము దానిమీ
ఱడు వాడి గల దిం కొకటి లేదు :—
ఒదమిచే నొదఁగూడు బలసుహృచ్ఛ్రీల్. 759

లలితార్థ మధికముగఁ బదయువా
రల కెలయు, సులభపురుషార్థంబు లౌ
విలఁ, దక్కినవి రెండు నొక్కటను :—
వెలయు నర్థమున ధర్మకామశ్రీల్. 760

# సేనా మహిమ.

1. చతురంగయుతమైన, క్షతిభీరు
కత లేని, జేతృసైన్యము, రాజ భా
వితసంపదలయందు నెల్లఁ దల :—
ఇతరాంగరక్ష సేనాబలశ్రీన్. 76

2. ఇడుమయపు, డని, గాయపడ బెగడు
పడని పడికలిమి. బల మడఁగియు న్న
ష్పుడునుఁ, దొలి దండునరుఁ గా కరిది :—
నడపవలె నృపుఁ డమూల్యమౌల్యశ్రీన్. 76

3. ఉలియునెడ నెలుఁ గెత్తి ఁడలి వలె,
నెలుఁపగ, లేమి యగు ? ఎగసి నాగం
బులికెంచు బుసకొట్ట, వెసఁ జెడును :—
తలఁకని మగం డ్రుండవలె బలశ్రీన్. 76

4. అడఁగనిది యయి, పగఱ మోస లోఁ
బడని దై, సొరిదిగా వచ్చినది యౌ
పిడి యడరునదె మే లయిన దండు :—
జడిసి పిడివడు సేన నెటు జయశ్రీ ? 7.

5. యముఁ డలుకమెయి మీఁద వచ్చినను,
సమవేత మై యెదిరి నిల్చు సామ
ర్థ్యము గలది యే మాన్యసైన్యంబు :—
అమితరాడ్శక్తి మనవలె బలశ్రీ. 7

6. అతిపరాక్రమము, మానము, మహిత
గతవీరపథగమము, విశ్వాసపా
త్రత, యనెడు నాల్గె రక్షలు మొనకు :—
ప్రతిపక్ష మదలు, రక్షితబలశ్రీన్. 766

7. పడవలము నాఁగి, మీఁదికిఁ జెల్లి
యడఁచునదె సేన, తలపడిన పోరున్
దడకట్టి, గెల్పు పన్నిక లెఱిఁగి :—
అదరవలె మొనను వ్యూహభేదశ్రీల్. 767

8. అవి సేయు తగవుఁ, బగ నాఁగు నే
ర్పును, లేని దైనమున్ సైన్యము, కనన్
మొన బెడంగునఁ జేరిమిని బెఱయు :—
కనుకనిం గొలుప వలె సైన్యశ్రీ. [శోభ] 768

9. చిఱుత దగుటయుఁ, జెల్లి పోనంత
విరసతయుఁ, బేదఱికమియునుఁ, దనకున్
గొఱలనిది యయిన గెల్చును సేన :—
కొఱపఱచరా దరుసు స్వసేనాశ్రీన్. 769

10. నిలుపు గల మగల మొగి చాలఁగాఁ
గల దైనసున్ సేన, యొగి నడపు మేల్
తలమగఁడు లేనియెడ, లేని దగు :—
దళవాయి ముడల మొద లగు దళశ్రీన్. 770

# సైన్య వీర్యాధిక్యము.

1.　"నా నేత మును విల్వకుఁడి పగలు :
నా నేత నెదిరి నిల్చిన వడి, శిలా
స్థానులై నిల్చి రిలఁ బలువుండ్రు" :—
సైనికుని విడి తోఁచు నీ వచశ్శ్రీన్.　　771

2.　కానఁ గుందేలు పడ నేయు నం
బూనుకం బెను, దంతి పయి నూటి త
ప్పైన శూలమ్ము నూనుట యిమ్ము :—
మా నగును వీరు నెదురుబె రణశ్రీన్.　　772

3.　పేరుమగఁటిమి యండ్రు, పగ నెదురు
టీరంబు ; పగ కెడరు రా నుపకృతిన్
గూరుచు గుణంబు దానికి వాఁడి :—
వైరి పయి దయ వీరలక్షణశ్రీ.　　773

4.　కైబల్లె మెదిరి వచ్చిన దంతి
తోఁ బుచ్చి, వేఱొం డరయువాఁడు, తన్
మై బల్లెముంటఁ గని పెఱికి, నగు :—
స్వాబాధఁ గనఁ డనిని సువీరశ్రీ.　　774

5.　వెరియు పోరిచూపు,- బల్లెమును గొని
యరి యేయ,- నదిమి ఱెప్పలు మూసినన్,
మఱి, యోటు కాదొకో వీరునకు ? :—
కొఱకొఱం గొఱవడమి సువీర్యశ్రీ.　　775

6. కడుఁ బుంతు పడని నా శైల్లఁ గొని,
యడినాళ్లుగా వైచుఁ, దన నాళ్లలోఁ
గడచినవి యెత్తి, యేర్పడ జెట్టి :—
వడికాండ్ర తొడవులు రణప్రవణశ్రీల్. 776

7. ధారణిన్ సుడియు యశమును గోరి,
కోరంబడని యసులు గల మగలు, పెం
దేరములఁ దొడుగు టందంబగును :—
వీరమృతి నగు సుతిస్వర్గతిశ్రీల్. 777

8. రణ మేర్పడిన సుసుఖదలుఁ గొనని
మొనకాండ్రు, రా జలిగి వల దనిననున్,
ఘనత క్రుంగుట లేని దిట్టండ్రు :—
అని రంజు వెనుకంజ యొకో ధృతిశ్రీ ? 778

9. ఆడినది తప్పమియె సరిగఁ, దో
రాడు తఱిఁ జచ్చు వీరుల నే రాజో
యాడి తప్పి రని దూరెడు వారు ? :—
ఓడు టవ దీర్ఘనెడ సంగర శ్రీన్. 779

10. ప్రోచు పెద్ద పనుల నీ రొక్క, నని
నేచఁ జా వమరు నెడ, నట్టి చావే
యాచించి యయినఁ గొనఁ దగిన యది :—
వేచవలె వీరుఁ, డని, జయమృతిశ్రీల్. 780

# స్నేహము.

చేయుటకు నరిది వేయవి కలవు
నేయ మటు? దాని వలెఁ, బని కరిదివై,
యేయవ్వి కలవు కాపాడునవి ? :—
శ్రేయ మొనగూర్చు సాయము, సుహృచ్ఛ్రీ. 781

నెలవంక వలె నెఱయునవి బుధుల
చెలుము ; -లొగి- నెఱచందు వోలె వెనుకన్
మలఁగు నవి పామరుల నెయ్యములు :—
తలఁగ కొగిఁ జెలఁగవలె సుహృత్త్వశ్రీ. 782

అలవడిన కొలఁదియును విద్యవలె,
బలు నయం బిడు, వాడు ఁగు కొలఁదియున్
లలితగుణ కలితజన సహచరత : —
అలవాటు లేమిఁ జెడు సుహృత్త్వశ్రీ. 783

నగు పొంటెఁ గాదు, స్నేహించునది,
మిగిలి చెడుగునఁ గడఁగు చెలిని, ముందై
విగదించి గద్దించు పని పొంటె :—
తగు, హితపరుల తోడి సుహృత్త్వశ్రీ. 784

సాహచర్యాభ్యాసములు వలదు,
వ్యాహృతానోన్యాశయైక్యంబె తా
సౌహృదము గలుగు యోగ్యత నిచ్చు :—
స్నేహమున కనుఁ గేకమతిత్వశ్రీ. 785

6. మొగ మొకటె యలర స్నేహించునది
తగు చెలిమి గాదు ; హృదయాంతరమునున్
మొగి నలర స్నేహించునదె చెలిమి :—
తగవలదె సార్థముగ సౌహృదశ్రీ ? 786

7. దుష్టంబు లైన విషయము లెడపి,
శిష్టగతి నడపి, కీ డొదవఁ దోడై
కష్టపడునదియె యగు నెయ్యంబు :—
ఇష్టభాషణమె యొకొ ప్రియఫలశ్రీ ? 787

8. ఉడుపు సడలినవాని కై వోలెఁ,
దడయ కపుడే, చెలికి మూఁడినది యో,
నెడ రెడపి యడరునదె యగుఁ జెల్మి :—
అడల సఖి, యలరు టొకొ సుసఖ్యశ్రీ ? 788

9. చెలిమికిన్ మే లునికి యే దనిన,
మలఁగు టెపుడును లేక, పొందుపడు ప
ట్టుల నెల్ల నొదవి, యూనెడు నిలుపు :—
మెలపవలె ధర్మార్థముల సుహృచ్ఛ్రీ. 789

10. "ఇట్టి వారలు వీరు మాకు, మే
మిట్టి వార" మని పొనరుగ ననినను
మట్ట మయి తోఁచుఁ జెలికారంబు :—
వట్టి మాటలనొ స్థిర సౌహృదశ్రీ ? 790

# స్నేహ పరిశీలనము.

1 తడవకయె స్నేహించుటను బోలు
చెడు గొండు లేదు, స్నేహించిన పయిన్
విడుపు లే దగుట, స్నేహస్థులకు :—
విడివడదు సహృదయుల సౌహృదశ్రీ. 791

2. అరసి యారసి కొననతని చెల్మి,
విరసపరిణామమునఁ, గడసారి తా
మరణించు కతమైన కష్ట మిడు :—
సరససహృదయమైత్రి యిడు శుభశ్రీన్. 792

3. గొనమునుం, గొలమునుం, గొఱగామి
యునుఁ, గొఱవడని బాంధవమునుం, గనుం
గొనియె చేయంగ వలయును జెలిమి :—
ననుపు వడి, మఱి, వనపు వడుటొ సుశ్రీ ? [బుద్ధి] 793

4. కులకుఁడై, యెపుడైనఁ దన కగడు
గలుగుటకు నానఁ గొను సుజను నేమే
నలవి నిడియును గొనవలయుఁ జెలిగ :—
అలవడుట యరుదు తాదృశసుహృచ్ఛ్రీ. 794

5. అడల వాకొని, కాని వదలించి
నొడివి, వ్యవహార మెఱుఁగఁగ వల్లనొ
గడుసరుల నెళ వంసి కొనవలయు :—
నడచి, యుఱు నెఱి, నడపు సుమిత్రశ్రీ. 795

6. పాటునందును నుండు నొక నయము ;
పాటిలిన చెలుల ప్రకృతులఁ జూఁచి, యే
పాటివో కొలుచు నొక కోల యది : —
చేటురా నొదవనిదొ సౌహృదశ్రీ ? 796

7. మేలు నాఁబడున దొకనిఁ, దెల్వి
మాలినట్టిఁడుల చెలికాఁంబు వే
చాలించికొన, నీఁగి విడుచుటయె :
కూళు కూరిమి కూరి, మేలు ధీశ్రీ. 797

8. తలఁపపల దుత్సాహమును సన్న
గిలఁ జేయునవి ; కొనఁగ వల, పంజడిన్
నలఁగఁ, జెయి విడుచువాఁల చెల్మి : —
అలఁత తఱి నొదవునదె సౌహృదశ్రీ. 798

6· చెడు కాలమందుఁ గై విడుచు స
ట్టిఁడుల నెయ్యము, మదియు కాలంబునం
దెడఁదఁ దలఁచినచు గుండియ మండు : —
బెడఁద తఱినిన్ విడచు సుమైత్రీశ్రీ. 799

10. అలవఱచికొన వలయు నిర్మలా
త్ముల చెలిమి ; నొండిచ్చి యయిన విడువన్
వలె నొప్పు లేనివాఁల చెలిమి :—
చెలిమి నరయుట యనుఁగు జీవనశ్రీన్. 800

81 వ అధికారము

# పరిచయ చిరంతనత.

1. చిరపరిచయం బనున దే దనినఁ,
గొఱలు స్వాతంత్ర్యమునఁ గావించు నె
క్కఱతయునుఁ గ్రిందుపఱచని చెల్మి :—
చిర మెఱుఁగుటయె యొకొ సుపరిచయశ్రీ ? 801

2. చెలిమి కంగంబు స్వాతంత్ర్యంబు ;
కలఁగ కద్దాని కిమ్ముగ నొప్పుచే
లలితగుణపరిపూరితుల నీతి :—
అలఁతి కా దలవడుట యీనయశ్రీ. 802

3. అలవడిన చెల్మి యేమిటిఁ జేయు,
చెలి స్వతంత్రించి సలిపినది తానే
సలిపి నట్లుగ నమః కున్నయెడ ? :—
కలుపుఁగోలున నిలుపు, పరిచితిశ్రీ. 803

4. ఇచ్ఛగించెడు ప్రకృతిచే ధీరు
లిచ్ఛపడుదురు, స్వేచ్ఛచే నడుగకే
నెచ్చెలులు తమ కార్య మొనరిచిన :—
నచ్చి యొడఁబడు, టొరిమ కవశ్యశ్రీ. 804

5. తెలివిపేదఱికమో, యొండేని,
బలు సొంతతనమొ, కత మని కొనవలెన్
నలఁగఁదగునవి నెయ్యు లొనరిచిన :—
చలము కొనరాదు చిరపరిచయశ్రీన్. 805

6. చెలిమి మేరను నిలుచువా రుడుగ,
ఎలఁతపఱచిన యెడనుఁ, దొలి చెలిమినిన్
నిలిచినట్టిఁడుల కూరిమి తొడుసు :—
కలఁగుఁ బరిమితి మీఱు పరిచితిశ్రీ. 806

7. వెత వచ్చినపి యొనర్చినను స్నే
హితులు, ప్రేముడి విడరు ప్రేమక్రమా
గత మైన నెయ్యంబు గలవారు :—
స్థితిపరిచ్యుతి హితమొ పరిచితిశ్రీన్ ? 807

8. చెలి తప్పుఁ జెవిఁ గొనని యోగ్యతయె
వలనై సహారులకు, సుదినం బగున్
చెలి తమకుఁ దప్పు చేసిన నాఁడు :—
వలయు సహచరు దోషసహనతాశ్రీ. 808

9. చెడిపోని క్రమసమాగతమైత్రిఁ
దొరదు వారల మైత్రి విడని వారిన్
గడు సపేక్షం గొనుఁ లోకంబు :—
చెడదు చెలి చెడుఁ గోర్పు పరిచయశ్రీ. 809

10. అహితు లగువారిచే నైసమున్
రహిఁ గోరఁబడుదురు, చిరాప్తులయెడన్
సహనగుణమునను మాఱని వారు :—
సహచరిత మహితము సహిష్ణుతాశ్రీన్. 810

# దుష్ట సహవాసము.

1. కొఱికి తినువారు వలె ననువుమెయి
మఱగినను, గుణహీనసహవాసమంత, పెం
బెరుఁగుకంటెనుఁ, దఱుఁగుటె మ్మేలును :—
అరితి కా, దఱుఁగు చెలిమికి, గుణశ్రీ. 811

2. కొఱకొఱకు నెయ్య మొసరించి, కొఱ
యఱ, నురువు నొప్పఱిన వారి చెల్మిని
బెఱసినను, దొఱఁగినను, నేమియొకొ ? :—
సరిపడమి స్వార్థతత్పరు ప్రియశ్రీ. 812

3. ఫలపరిమితిం దూఁచు నెయ్యులును,
వెల బెఱయునడి వేచి కొను వేశ్యలున్,
కలిమి దోఁచెడు దొంగలును, సములు :—
స్వలాభైకాప్తులకొ ప్రియనయశ్రీ ? 813

4. సమరమున దిగఁ ద్రోచి చను శిక్షి
తము గాని గుఱ్ఱ మట్టివారల సహవా
సముకంటె నొంటరితనమె మేలు :—
సమయసాహాయ్యతియె మైత్రీఫలశ్రీ. 814

5. చేసియునుఁ గా వవని చిఱువారి
కీసచెలికారంబు నెయిడుకంటెన్,
మోసపోవక, యెయిదమియె నయము :—
గాసిలఁగ నోసరుటొ సుహృత్త్వశ్రీ ? 815

6. తెలివిమాలినవాని మిక్కుటపుఁ
గలసిమెలసెడి నెయ్యమునకంటెనున్
దెలివరుల పగ కోటి మడుఁగు లురు :—
పలుచెఱుపు లవవు పగ గొన బుధశ్రీ. 816

7. నగవువగవారి నెయ్యంబుచే
నగువానికంటెనుం, బగవారిచే
నగునవియె పదికోట్ల మడుఁగు లురు :—
నగు చెల్మి సుగము, పరిణామదుశ్శ్రీ. [విషము] 817

8. వల్లనగు కార్యంబు నేనియును
జెల్ల నటు చెడ విడుచువారి చెలిమిన్
మెల్ల, నొడువక, సడల విడువవలె :—
కల్లకూరిమిఁ జెడుఁ గ్రియాఫలశ్రీల్. 818

9. కలయందు నైనఁ బ్రియ మవదు కద,
సలుపునది వేఱుఁ, బలుకునది వేఱై
తెలియఁబడువారి చెలికారంబు ?—
తలఁపు వేఱమియె కూరిమికి దుశ్శ్రీ. [విషము] 819

10. ఏమాత్రముకుఁ దఱియు టురువవలె,
గీమునం బ్రియమాడి, కూటంబులోఁ
బ్రాము నగ డాడువారల చెల్మి :—
క్షేమమొ ? -ద్విజిహ్వో_క్తిఫలము- దుశ్శ్రీ. [విషము]

83 వ అధికారము　　[సుహృద్భాగము

## కూడని కూరిమి.

1. సరియైన యెడఁగనినఁ గొట్టు నా
దరువు, పట్టెడ యగును, మది పొందకే
దరిఁ జేరి మెలఁగువారల చెల్మి :—
ఉరగపరిచయఫలము తదాశ్రీ. [విషము]　　821

2. చెలులు వలె నుండి, చెలు లవనివా
ండ్ల కూర్మి, వెలఁదుకల మనము వలెనే
విలువరింపక వేఱుపడు చుండు :—
తలఁపు లొలపని కలవు కొలుపు దుశ్శ్రీన్. [విషమును]

3. పలు మేలి విద్దెలం గఱచినను,
దలఁపుమే లెలయువా ఁగుటయే,
యిలను మా నఱిన విమతుల కరిది :—
అలుఁగు పద నఁవె యలఁదిన, వసుశ్రీన్ ?　　823

4. మొగమునం బ్రియము దోపంగ నగ
వగపఱచి, మనసునఁ బ్రియహీనులై
వెగటుఁ గొను వంచకుల కంజపలె :—
మొగమోడ దావు మొగపులి ప్రజశ్రీన్.　　824

5. మనసుచే నమర కున్నట్టివా
రివి, నెట్టి యొక విషయమునఁ, బైపై
నునుడులచే, నమ్మ టుం వవకు :—
కనుఁ బ్రాఁకుఁ, గనరామి లోని దుశ్శ్రీ. [విషము] 825

6. అబద్ధం బగుఁ గావ్య ; మొందొ ? తా
నిబద్ధుం డగును, నెఱిఁయెఱుఁగ నతఁడౌ
అబుధుం డొక పనిని మేకొనిన :—
నిబద్ధించదు మొఱకునకు ఫలశ్రీ. 836

7. పెఱవార లారఁ దనియంగఁ, దన
పరివారు మాఁకొనును, విధివశమునన్
మొఱకు తాఁ బెనుకలిమి బెరయునెడ :—
పొరయు నెటు సులక్షణవితరణశ్రీల్ ? 837

8. పిచ్చివాఁ డొకఁడు కలు ద్రావ మం
పెచ్చిన ట్లగును, దన చేతి యందున్
బెచ్చారి యొక సొత్తుఁ బొరయునెడ :—
వెచ్చపడు వ్యర్థముగఁ దామరుని శ్రీ. 838

9. మిగుల నిమ్మైనయది వెంగలుల
దగు చెల్మి ; విడిపోవు కాలమందున్
నెగు లిచ్చునది యొక్కటియు లేదు :—
తగు లఱుగు నొగిఁ, దదన్యోన్యతాశ్రీన్. 839

10. కడుగ కుందిన కాలు నిమ్మైన
పడుక నిడు టట్టిదే, జ్ఞానుల సభన్
మిడిసిపాటున వెకలి చొరఁబడుట :—
విడునె శునకము, నైజ, మంగళశ్రీన్ ? 840

85 వ అధికారము          [సుహృద్భాగము

# పుల్లెఱుకఁ బూనుట.

1. ఎఱుకలేమిడి లేమిడులలోనుఁ
బొరిలేమి ; పెఱలేవడిని లేమిగాఁ
బరిగణింపదు లోక మెన్నఁడును :—
సిరులచేఁ గొఱల విహపరసుఖశ్రీల్. 841

2. తెలివిమాలినవాఁడు, మన మలర
సలుపఁ జాలిన యీవి, వేఱెదియుఁ గా,
దెలమిఁ గొని నతని సుతపఃఫలము :—
తెలివిలే కమరునె యుదారతశ్రీ ? 842

3. తెలివిమాలినవారు తామె త
మ్మలఁచి పీడించుకొను నంత పీడన్
గలుగఁ జేయుట యరులకును నరిది :—
తెలివిలేమియె కుడుపు మహోఘశ్రీన్. [విషమును] 843

4. వెదఁగుతన మనఁబడున దే ఏనినఁ,
" గడుఁ దెలిపరుల " మని మదించుకొనుచున్
మిడిసిపడు పెడసరపు దుఃహంత :—
మిడుకు టటు, మిడుకఁ గుడుచుట కఘశ్రీ. [విషమును]

5. నేరుపని వెఱిఁగినటు నటియించు
వారు కన టఱఁగ నేరిచినదానిం
గూఱిచియు నరమరికయే కలుగు :—
ధీరత్వ మెట్లబ్బు నఱఁగ ధీశ్రీ ? 845

6. గుహ్యమునె మఱుపఱచు, టల్పమతి,
సహ్యంబొ, తమయందుఁ బెను దోసముల్
బాహ్యదృష్టికి మఱుగుపడ నపుడు ? :—
గ్రాహ్యమే తచ్చరిత లౌకికశ్రీన్ ? 846

7. అరిదిమంతనము నేమఱి వెలుచు
నెఱుకమాలిన యాతఁ డొనరిచికొనున్
బొరికీడు తెన్నొ తానే తనకు :—
కొఱమెఱుకపొర, స్వయంనాశనశ్రీ. [విషము] 847

8. పని చెప్పినను జేయఁ, డెదియు నా
రసి తాను నెఱుఁగలేఁ, డల్పమతి ; యా
యుసుఱు పోమెడు పఱకు నొక నోవు :—
అసియెఱుకనను దుస్సహము సహశ్రీన్. 848

9. కననివానికి గనఁబఱచు నతఁడె
కననియతఁ డగుఁ దానె, కననివాఁడే
కనినవాఁ డగుఁ, దాఁ గనిన గతినె :—
తన కాపథము విడడు నికృష్టశ్రీ. [బుద్ధి] 849

10. లోకస్థు "లున్న" దను దానినిం
జీకొట్టి "లే" దనెడు వాఁడు భువిలో
సోఁకుడుగ లెక్క వేయంబడును :—
వైకృతం బయి భ్రమయు నల్పజ్ఞ శ్రీ. [బుద్ధి] 850

86 వ అధికారము　　　　[సుహృద్భాగము

# మాఱుపాటు.

1. మాఱుపాటం డ్రెల్ల యసుఖులకు
వేఱుడం బనఁబడెడు గుణహీనతన్
మేరమీఱఁగఁ బెంచెడు నోవు :—
చేరి మను టొరులతో, సద్గుణశ్రీ. 851

2. వేఱుడము నెంచి, యించనివి తన
కే రైనఁ జేసినను, మాఱెంచి తా
వారి కించనివి చేయమి మేలు :—
కూరు నప్రతికారి కున్నతిశ్రీ. 852

3. పగ యనెడు దుఃఖకారక మైన
నొగులు నీఁగిన, నెపుడుఁ గ్రుంగనిది యై
మిగులు సత్కీర్తితేజము వెలయు :
నెగడు కూర్మిని గలుగు బహుసుఖశ్రీల్. 853

4. ఇష్టములలో నతిశయంబైన
యిష్టంబు ఫలియించు, మాఱుదల యన్
కష్టములలో నధికకష్ట మఱి :—
ద్వేషి ప్రభ్రష్టుఁడై కుడుచు దుశ్శ్రీన్. [విషమును] 854

5. మాఱుదల యెదురఁ, దలవంచి నయ
మాఱ మన వల్ల నగువారి, నెవరే,
మీఱు గెలు పెంచు నైజమువారు ? :—
మాఱుతలు లేని వారిదె జయశ్రీ. 855

6. తెగ్గిలక పగఁ గొనుటచే, గెలుపు
వెగ్గలపు టిం పను నతని బ్రతుకునున్
ప్రగ్గుటయు మ్రగ్గుటయు దగ్గఱును :—
లగ్గును బగ లేని జీవనశ్రీన్. 856

7. జయము నాపాదించు సత్యార్థ
చయముఁ గనలేరు, ద్వేషాసక్తమై
ప్రియముఁ గూర్చని యెఱుక కలవారు :—
నయముఁ గనువారికే ప్రియజయశ్రీల్. 857

8. పగకు నెదురైనపుడు తల వంచి
తెగడు నది పెంపగును ; దానిఁ గొని పై
మిగుల నెంచిన, నెంచుఁ గీడొలయ :—
పగ వహించిన, దహించదె యఘశ్రీ ? [విషము] 858

9. పగను గాంచఁ దొరకండు పెంపు రాఁ
దగు కాలమున ; దాని మిగులఁ గాంచున్,
దగని తఱిఁ గీడు దప్పించుకొన :—
పగకలిమి, కలిమినిం జెఱచు దుశ్శ్రీ. [విషము] 859

10. కయ్యమున నగు నప్రియము లెల్ల ;
నెయ్యమున నగును మేలయిన నయమన్
తియ్యమును జేకూర్చు సంపత్తి :—
క్రయ్య మొలఁగమి, వ్రయ్యు జీవనశ్రీ. 860

87 వ అధికారము [సుహృద్భాగము

# పగ మేలిమి.

1. బల్లిదులతో మాఱుపడి యెదురు
టొల్లఁబాటున మానవలె ; మానకే
యెల్లిదులయెడఁ బూనవలెఁ బగను :—
పెల్లుకొను విటు లయినఁ బ్రాభవశ్రీ. 861

2. అరితి లే నతఁడు, నిండారు తో
డఱి నతఁడు, తాను దుర్బలుఁ ; డట్టివాఁ
డరిబలము నెట్లు పొరిగొనఁ గలఁడు ? :—
పెరుఁగదే, తన కొఱల, నరిబలశ్రీ ? 862

3. అంజువాఁ, డజ్ఞాని, యమరికను
రంజించనతఁ, డీవి లేనతఁడు నౌ
కింజుండు కడు నెల్లిదుఁడు పగకు :—
భంజితుం డగు నతఁడు స్వవికటశ్రీన్. [బుద్ధిచే] 863

4. నీఁగని కినుకకాఁడు, మది నిలుపు
సాగనతఁ, డేనాఁడు, నేయెడను, నే
లా గొనరు వారికిని, నేలిదుఁడు :—
ఓగుపయిఁ బగ నెఱప, నగు హితశ్రీ. 864

5. అనువుఁ గనసతఁడు, నెఱవేఱు నది
యొనరుపనతఁడు, నిందఁ గననతఁడు, నౌ
గుణహీను పగ, పగఱ కి మ్మగును :—
అణఁగు నతఁ డవలీల స్వవిగుణశ్రీన్. [విషముచే] 865

6. కానని కినుకకాఁడుఁ, గడుఁ బెద్ద
దైన కామము గలాఁతడు ; పీరితో
నానుకూల్యము లేమి ప్రియపడుః :—
హానిఁ గొలుపును వారి యక్రమశ్రీ. [బుద్ధి] 866

7. ఇది యైన నొండు, నిశ్చయముగాఁ
బడయవలెఁ, దన్నుఁ జేరియుఁ దగని వా
బెడఁద యిడునవి చేయువాని పగ :—
కుడుపు వగ, నొండెఁ, దద్వైకృతశ్రీ. [బుద్ధి] 867

8. గుణహీనుఁడై, పలు కలుచలు నుం
డినవాఁ డయిన, విస్రహాయుఁ డగు ; నా
యునికి మాఱుతుల కధిరక్షకము :—
తొన లేని వాని కమరునె జయశ్రీ ? 868

9. పగను గొని యెదురువారికి దూర
ముగఁ దొలఁగ దిమ్మ, నుతి లేనివారై
బెగడు పగతుర నెదురఁ బోఁడియునెద : —
వెగడుబెగడులఁ జెగడు సుఖజయశ్రీల్. 869

10. చదువుఁ గఱవనివాని కెదిరియై
కదురు సులభప్రయోజన మెన్నఁడున్
మది వలవనతని వలవదు కీర్తి :—
ఒదవు నయహీను నదిమిన యశశ్శ్రీల్. 870

## పగ తీఱుగుట.

1. పగ యనెడు గుణహీనమును నొకఁడు,
నొగు లగుట యెఱిఁగ, నగులాట నైనన్
దగులమునఁ గోరఁ దగినది కాదు :—
నగవు తగ వయి, యెగయుఁ బగ, క్రుధాశ్రీన్. [విషముచే

2. విలునాఁగటన్ దున్నువారి పగఁ
గలిగించుకొన్నను౦, గొన వలదు మేల్
పలుకునాఁగెట దున్నువారి పగ :—
కలఁచు నరి కులమునున్, శితవచశ్శ్రీ. 872

3. పిచ్చి పట్టినవారి కంటెనుం
బెచ్చువెడఁ గగు, నొంటికాఁ డయ్యు, మ
త్తెచ్చి, పలువుంద్రఁ బగఁ గొనువాఁడు :—
పిచ్చియిడ, వెగ్గు, నిడుఁదుర్మదశ్రీ. [విషము] 873

4. పగను, నావశ్యకముగా, నెయ్య
ముగ మార్చికొని మనెడు గుణయుతుల మే
లగు యోగ్యతను లోఁగు లోకంబు :—
పగఁ జెలిమిఁ గొనుట సమయోచితశ్రీన్. [బుద్ధిచే] 874

5. తనకుఁ దోడటినఁ, బగ టిర్వు రుం
డినఁ, దా నొకం డగుట, మేల్తోడుగాఁ
గొనవలయు నందుఁ దగు నొక్కరుని :—
అనివార్య మట్టి నేర్పరి జయశ్రీ. 875

6. నమ్మినను నమ్మ కున్నను నొకని,
నిమ్మదప్పున నున్న యొకఁ, డాతవిన్
నమ్మకయుఁ దెగడకయు మెలఁగవలె :—
ఇమ్మడింపదె, యన్యథా, వ్యధాశ్రీ ? [విషము] 87

7. తన నోవుఁ దెలుపఁ గూడదు తామె
కనని చెలులకుఁ ; బైనిడం గూడదున్
దనదు దుర్బలతఁ బగతుర ముందు :—
తన లోటుఁ జాటఁ జే టగు స్వకశ్రీన్. [వృద్ధియందు]

8. వెర వెఱిఁగి, తన్ను బలపఱచుకొని,
మఱి మఱియుఁ దన్ గాచికొనఁగ, మాయున్
బరిపంథులందుఁ బట్టిన మదము :—
పొరపడని జాగరిత కగు జయశ్రీ. 87

9. ఎలమొలకగనె ముండ్ల చెట్టునుం
గొలసేయవలెఁ ; గెలఁకువారి చేతిన్
గొలసేయు నద్ది ముదిరిన యెడను :—
ఒలియనియ కరి నణంచుటయె సుశ్రీ. [బుద్ధి] 87

10. ఊరుపున్ విడువ, నుండెడు వారు
కారు, నిశ్చయము, తమ పగఱ మదమున్,
దీటుపడ, మున్నె చిదుమనివారు :—
పేరి నరిబల, మాఱు స్వకబలశ్రీ. 88

89 వ అధికారము [సుహృద్భాగము

# లోపగ.

1. నీడనీరులు పిడపఁగి డిడినఁ
గీడైనవే ; స్వజననైజంబులున్
గీడైన వగుఁ గీడు నొనరిచిన :—
పైడంబు లో విడంబించు దుశ్శ్రీ. [విషము] 881

2. విచ్చుకత్తులఁ బోలు వెలి విల్చు
మచ్చరుల రంజవల ; దంజవలయున్
నెచ్చెలులఁ బోలు పగతుర చెల్మి :—
అచ్చముగఁ దోఁచు పగ, క్షీంపచ్ఛ్రీ. [విషము] 882

3. లోపగకు నంజి, తన్ గాపవలె ;
నాపద ఘటిల్ల, హృద్భేదకకులా
లోపకరణ మటు, మానక చెఱచు :—
వాపిపై గడ్డి, లోపగ నయశ్రీ. 883

4. మనసు మానవని లోపగయె తోఁ
చిన, బంధువర్గంబు మా నవని బల్
మనికితంబులఁ బెక్కులను నిడును :—
గొనబొ ? -అంతశ్ఛిద్ర- మపహాదుశ్శ్రీ. [విషము] 884

5. వావినెఱితోఁ గూడు లోవైర
మావహిలఁ, జావునెఱితోఁ గూడు బల్
నోవులను బెక్కు తెఱఁగుల నిడును :—
లోవైరమును జేఁచు మధురదుశ్శ్రీ. [విషము] 885

6. ఒంటరము, తన్నొంటి నట్టిఁడుల
నంటునే, నెట్టిఁడును నెన్నండునున్
గుంటుపడి పోమి యొంటుట యరిది :—
గంటు లగుఁ గంటకావృతతనుశ్రీన్.

7. వేఁపు బాణలి మీఁది మూఁత వలెఁ,
బై పోఁడిమిం గూడినను, గూడదే
లోపగలు పుట్టిన కుటుంబంబు :—
లోపగలచేఁ బగులు సమష్టిశ్రీ.

8. ఆకుఱాయిన్ రాయఁబడు విసుము
పీఁకన్, దటిఁగి బల మెడయు, రాయిడిన్
జీకగుచు, లోపగలు గల కులము :—
లోకలహామున వీకు నెడుఁ గులశ్రీన్.

9. నువుగింజ పగు లంత చిఱుతదే
యవు నైననున్ లోవి పగ, దానిలో
నవధికై పొంచి యుండును గీడు :—
రవగుండు పగుల నొగు లగు జగచ్ఛ్రీన్.

10. ఒడఁబాటు లేనివారలతోడ
నొడఁగూడి మనుట, యొక్కఁడు, గుడిసెలో
విడుపాముతోఁ గూడ మనునట్లె :—
చెడ నింటి యొరిమ, చెడు జీవనశ్రీ.

# పెద్దలఁ దెగడమి

1. కృతకర్ములైనవారల కృతలము
ఖతఁ దెగడమియె యాత్మరక్షకులదౌ
హితరక్షణములయం దెల్లఁ దల :—
కృతి యలుగఁ గృతపడవె రక్షణశ్రీల్ ? 891

2. పెద్దలను గౌరవించక మనినఁ,
బెద్దల మహత్త్వమున, నమ్మనికి, యే
ప్రొద్దునున్ విడివడని యిడుమ లిడు :—
పెద్దలం దెగడఁ, గుడుచున దఘశ్రీ. [విషము] 892

3. తన చేటుఁ గోరునే నొరఁ డితవు
వినక చేయునుగాక, యడఁచఁగాఁ గో
రినఁ జేయఁ గలవారియెడఁ, దప్పు :—
ఫణి తోఁకఁ ద్రొక్క ఫల మఘోరశ్రీ. [విషము] 893

4. యమునిఁ గైసైగచేఁ బిలిచినటె,
సమధిక సమర్థులకు, నసమర్థు లా
త్రముతోడ, నప్రియము లొనరుచుట :—
తమకంటె ఘనుల నెదురిమియె సుశ్రీ. [బుద్ధి] 894

5. ఎటకుఁ బోయిననుఁ దప్పించుకొని,
యెటను నుందరు, తీవ్రబలవన్నృపో
త్కటకోపమునకు గురి యగువారు :—
పటిష్ఠుల కడఁగి యుండుటయె సుశ్రీ. [బుద్ధి] 895

6. నిప్పుచేఁ గాల్పఁబడినను జావు
తప్పు టుండును ; దప్పఁ జాల రెటులున్
గొప్పవారలు నొంచి మనువారు :—
వె ప్పెచ్చుఁ గనల, ఘనతాపసశ్రీల్.

7. బహువిధామహిత మగు జీవనము,
బహుళసంపదయు, నే మగు, నున్నతిన్
మహితు లగు తగువారు కినియునెడ ? :—
మహి నమేయంబు తాపసబలశ్రీ.

8. కొండంతవా రడఁచ నెంచునెడ,
మెండుకొను కులముతోడనుఁ బేర్మిమై
నుండువారలును, మాయుదు రిలను :—
మండి కాల్చదె రేఁచఁ, దపోగ్నిశ్రీ ?

9. ఉన్నతాశయులు కోపించునెడ,
నున్నపాటున నడుమఁ జెడి, మేటియా
మన్నియయు రాజ్యభ్రష్టుఁ డగు :—
ము న్నగస్త్యుఁడు కూల్చె నహుషరాట్ఛ్రీన్.

10. మించి యమరిన బలముతో మిటా
రించువా రైననుం దప్పు మనలే,
రంచితమహాశయులు కనలునెడ :—
ఎంచఁ దగుఁ ద్రిపురాంతకక్రుధాశ్రీన్.

91 వ అధికారము [సుహృద్భాగము

# భార్యాటికత.

1. గృహిణీవిలోలుపులు లోకువయి,
మహితఫల మెయిద ; దురుకార్యలోలుల్
మహిని వేడవి యర్థమును నదియె :—
రహి దప్పు భార్యావిలోలు హృచ్ఛ్రీన్. 901

2. మగతనం బోమని మగువతనపుఁ
దగులాటకాని సిరి, యిల నొక్క పెన్
మగసిగ్గుగాఁగ, సిగ్గిడుఁ దనకు :—
తగ వెలవుపడునె భార్యాటికుని శ్రీ ? 902

3. ఇల్లాలి కడ నదలి క్రిందగుచుఁ
జెల్లు నసహాజత యే నాఁడునున్, బైఁ
జెల్లు సజ్జనులలో లజ్జ నిడు :—
వెల్లువడు మనుప కంజెడు మగవి శ్రీ. [బుద్ధి] 903

4. ఇలురాణి కంజు మఱుమేని స
త్ఫలము లేనతవి కార్యారంభవుం
గలితనము పేర్మి నొందుట లేదు :—
ఇలుతేనితనముననె ఫలజయశ్రీల్. 904

5. ఇల్లాలి కంజువాఁ డంజుఁ గద,
యుల్లసిలి యేనాఁడు సుత్తములకున్
జెల్లు సత్కార్యములఁ జేయుటకు!:-
చెల్లుబడి విడఁ దగదు స్వాతంత్రశ్రీన్. 905

6. అవిమిషులు వోలె నిల మనినసున్,
ఘనతావిహీనులే, యిల్లాంౘ్ర నొం
పొనరు బుజములకు నంజెడువారు :—
వనితలకు నోడు టొకా పౌరుషౘ్రీ ? 906

7. ఇల్లాలి యానతిని జేసి మను
పొల్లమగఁటిమి కింకె, లజ్జ గలదై
చెల్లు స్త్రీత్వంబె పేరిమి గలది :—
కల్ల యగు లజ్జ భార్యాటికుని ౘ్రీన్. [బుద్ధియందు] 907

8. సహచరుల కొఱఁతలం దీరుపరు,
మహనీయ ధర్మంబు లొనరింపరున్,
గృహిణీప్సితానుగుణవర్తనులు :—
ఇహపరంబుల వారి కెట ఫలౘ్రీ ? 908

9. ధర్మకార్యం, బర్థకృతి, యితర
కర్మలును, భార్యాజ్ఞఁ దలఁదాల్చుచున్,
బేర్మి సెడఁ, జేయువారికి లేవు :—
నిర్మల మగు వారి స్వధర్మౘ్రీల్. 909

10. ఆలోచనం జేరు మానసవి
శాలతాయుక్తులకు, నే నాఁడు నే,
నాలి నెఱిఁ జేరు దైన్యము లేదు :—
డీలుపడు భార్యాటికుని మనశ్శ్రీ. 910

92 వ అధికారము [సుహృద్భాగము

## వెలయాండ్రు.

నెనరుఁ గూరిచి కోర, కొడియ నగు
ధనముఁ గూరిచి కోరు సింగారి దొ
గొనబు పలు, కొక్కెనికి దొసఁ గొసఁగు :—
గణిక నయమందు నడకంబు దుశ్శ్రీ. [విషము] 911

ఫలముఁ దూఁచుచుఁ, దదనుగుణసరస
ముల నాడు గుణవిహీనల నెనరుపో
కలఁ దూఁచి, పొం దెనయ కుడుగవలె :—
వెలవెలఁది వలఁ దగుల ఫలము దుశ్శ్రీ. [విషము] 912

ధనకామినుల యనృత సంగమము,
కనఁబడని చీఁకటింటను ము న్నెఱుం
గని పీనుఁగును దడవు టట్టిదే :—
గణిక మనుపీస్గు లెత్తుచుఁ బడచు శ్రీన్. 913

పరధనైకార్థరతవేశ్యాల్ప
విరసరతిఁ బొందరు, కృపాధర్మస
త్పురుషార్థ మారసెడు తెలివరులు :—
పురుషార్థ మఱియు వేశ్యయుఁ గృపాశ్రీన్ ! 914

సామాన్య కామినుల యల్పరతిఁ
గామించి పొందరు, మనశ్శ్రేష్ఠతన్
సోమించు మహితు లగు ధీయుతులు :—
లేమ మెయి నద్దె కొందుటయొ సుశ్రీ ? [బుద్ధి] 915

6. తమ మేల్మిఁ బరఁగించు ఘను లౌరయ,
రమరికన్ మురిసి ముఱియరితి, ధనకా
మమునఁ, బఱఁగించు గణికల బుజల :—
తమి తగునె, బిడె మమ్ము చెడిపయెద, శ్రీన్? [బుద్ధిలో]

7. స్థిరహృదయహీనులే యెటయునురు,
పెఱవి యెద పలచి, ముఱికౌఁగిలింతల్
నెఱపు పణ్యాంగనల బుజములను :—
గుఱి, వేశ్య కెవరియెడ? బహుజనస్త్రీన్. 917

8. యోచించు తెలివరులు కాసట్టి
నీచకాముకులకున్, మోహినీపై
శాచ మందురు, మాయినుల పొందు :—
పైవెలువుచిలుప గద భోగిస్త్రీ? 918

9. వలు రేవి శృంగారిణుల మృదుల
కబంధ, మౌన్నత్యరహితాధమమున్
మఱగి ముగ్గెడు నరకవంకంబు :—
చెఱచుఁ జెడిపల పొందు జీవితశ్రీన్. 919

10. ఇటుమనసు వెలఁదులును, గల్లుగున్,
మఱియు జూదంబునున్, సిరిచెడచే
విలసింపఁబడువారి కిష్టములు :—
చెఱపవే వ్యసనములు జీవితశ్రీన్? 920

93 వ అధికారము

# కల్లు త్రాగమి.

1. తెగడఁబడ రరులచే, మఱి స్నున్న
పొగడితయుఁ గోల్పడుడు, రే నాఁడునున్
మొగిసి క ల్లిచ్చుఁగొని మనువారు :—
తెగడదే తాగుఁబోతునఁ జగచ్ఛ్రీ ? 921

2. త్రాగఁ గూడదు -కల్లుఁ- ద్రాగునెడఁ
ద్రాగుదురు గాక, సజ్జనులచేతన్
బైగణుతిఁ బడయఁ గోరనివారు :—
ఓ గొందుఁ, ద్రాగు డలవడిన, ధీశ్రీ. 922

3. కన్నామె సముఖమున నేనియునుఁ
జెన్నటిన దనునె, యే మను సుధీసం
పన్న సముఖమున, నొక్కఁడి మఱపు ?:—
మన్నింప రవశమై చెడిన. హ్రీశ్రీ. 923

4. ప్రీడ యను మే ల్మాగద విముఖియనుఁ,
బాడు క ల్లనెడు కోరండుగని పెన్
కీడుఁ గుడిచెడు మహాదోషులకు :—
గో డగును సి గ్గటిన బ్రతు కిలా శ్రీన్. 924

5. చేయునది యేమొ యెఱుఁగని చేష్ట
యే యగును, ద్రవ్య మిడి యొకఁడు తనకున్
మై యెఱుంగని మస్థ్రితిని గొనుట :—
హేయమును వెలకుఁ గొందురె బుజుశ్రీల్ ? [బుద్ధులు]

6. తూఁగువారలు మృతులకంటె వే
ఱై గోచరించ ; రేనాఁడు నంజే
త్రాగుదురు కల్లు తాగెడువారు :—
లోఁగు నె మ్మెయినేనియును స్మృతిశ్రీ. 926

7. లోవైన మరసి కను తమయూరి
చే వెస న్నగఁబడుదు రేనాఁడుఁ, గల్
ద్రావి మఱుఁగునఁ, దెలి వఱినవారు :—
పైవికారమె తెలుపు లో సురాశ్రీన్. [విషమును] 927

8. "కలు ద్రాగి యెఱుఁగ" నను టుడుగవలెఁ ;
దలఁపులోపల దాఁగి యున్నట్టివౌ
కలుషమునుఁ, ద్రాగినపుడే మిగులు :—
కలు వెలుచు బలుకలుచఁ, గలఁచి హృచ్ఛ్రీన్. 928

9. కలుమత్తువానిఁ గతమును జూపి
తెలుచు టన, నీటిలో మున్గినతనిన్
వెలుచ, దీపమున వెదకిన యట్లై :—
తెలివి చొచ్చునె సురాపంవశశ్రీన్ ? [బుద్ధియందు] 929

10. కల్లు తాగని యపుడు, తాగి మ
త్తిల్లినతనిని గన్నపుడుఁ, గనఁ డొకో
కల్లు తాగిన దాన మైమఱుపు ? :—
ఎల్ల చెఱుపుల మొదలు మద్యదుశ్శ్రీ. [విషము] 930

94 వ అధికారము

# జూ ద ము.

1. వేఁడఁ గూడదు గెల్చినను జూద ;
మాడి గెల్చినది, గాలపు టినుమునున్
గూడ మీనము మ్రింగిన ట్లగును :—
కీడు లొడఁగూడు ద్యూతార్జితశ్రీన్. 931

2. ఒం డెయిది, వడి నూరు కోల్పడుచు
నుండు జూదరులకును నుండునొక్కొ,
మెం డెయిది బ్రతుకునది యొక దారి ? :—
దండసిల వాకొ జూదరికి సుఖశ్రీల్ ? 932

3. ఉరలు పాచికల దాయముల, నెడ
తెఱపిలే కొడ్డిన. ధనాదాయముల్
తొరఁ బోయి యెదిరియెడనే పడును :—
పొరి గడనకాపుగడ లఱ, మరలు శ్రీ. 933

4. చెఱపులను బెక్కు లొనరించి పెం
పఱఁ జేయు జూదంబు వోలె నిఱుపే
దటిక మిడునది మ ఱొక్కటి లేదు ;—
మఱిమఱియుఁ గుడుపు ద్యూతం బఘశ్రీన్. [విషమును]

5. కవఱలుం, గలనునుం, గైనేర్పు,
నవిరతోత్సాహమునఁ గొని, విడనివా
రవమానపడి లేనివా రైరి :—
కవుడునం జెడెఁ బాండవస్థితిశ్రీల్. 935

6. కడుపారఁ గుడువలే, రలజడిం
బడుదురును, జూద మను పెద్దమ్మచే,
నడరు నెడ, మాయంబడినవారు :—
చెడును ద్యూతమున నిహపరసుఖశ్రీల్. 936

7. తొల్లింటి సంపదను, నయము భా
సిల్లు గుణములనుఁ జెఱచును, జూజపుం
గళ్లమునఁ గాలంబు పుచ్చునెడ :—
దుల్లి చెడు జూదమునఁ ద్రివర్గశ్రీల్. 937

8. ధనము మాలిచి, బొంకు మేకొలిపి,
కనికరము మాలిచియు, నవివాక్యమౌ
మనికితము నలవఱచు జూదంబు :—
ఇనుమెయులఁ గుడుపు దూత్యం బుఘశ్రీన్. [విషమును]

9. తెలివి, విద్దియు, కలిమి, కూ, డుపువు,
లీల నడుఁగు లగ నైదు, నడరనివి యౌ,
బలువేడ్క దాయంబులం గొవిన :—
కలుషమూలంబు ద్యూతఁ బిలాశ్రీన్. 939

10. ఓడుకొలఁదియు నాసపడు జూద
కాఁడు వలె, సవిధి పడు కొలఁదియును మైఁ
గూడిమాడఁగ నాసపడూ సుసుఱు :—
కీ దుడుడు కెమ్మెయినొకో సుఖశ్రీ ? 940

# మందు.

1. రీతివిన్ మిగిలినను( గొఱవడిన
నాతంకకరము లగు, వైద్య వేత్తల్
వాత మాదిగ నెన్నినవి, మూ(డు :—
ధాతుసమతనె రోగరహితతాశ్రీ. 941

2. మం దనున దొండు వల దొడలునకు,
ముందు తిన్నది యఱిగె నని యెఱిఁగి ని
స్సందేహముగ, వెనుక( దినినయెడ :—
బొంది నొగి సాఁకవలయును మనశ్శ్రీ. 942

3. అఱిగెనే, నలవి( గని తినవలయు ;
నరయ నదె మెయి( బొంసినతఁడు, దావిన్
జిరకాల మొగి నడప( దగు వెంవు :—
పురుషార్థకలన కురుఁ జిరాయుశ్శ్రీ. 943

4. అఱిగినది యెఱిఁగి మును దిన్న యది,
గుఱి నెఱిఁగి మాఱుపడవివి, తినవలెన్
మఱిమఱియు నాఁకలిం గొన్నపుడు :—
అఱుగవలె సరిగ భుక్తజరసశ్రీ. 944

5. మాఱుపా టవకుండు తిండియును
మీఱ నీయక తినిన యెడ నొడలునన్
గూరు పాటే యుండ దసుఱునకు :—
ఆరోగ్య కుసుభోగ్య సుభాగ్యశ్రీ. 945

6. కొలఁది యెఱిఁగి మితముగా భుజియిం
నదుని యెడ భోగంబు వలె, నిల్చుగ
యెరతిండిపోతునెడ రోగంబు ? :—
కరణానుకూల్యమున సుభోగశ్రీ.

7. ఉదరాగ్ని మితిఁ గాక, యరయకఁ
నెది తగునొ, పెద్దగాఁ దినిన, వ్యా
కుడు రదుర, మితిలేక యేర్పడును
ఉదర మామయమూలమును, వపు

8. తెగు లరసి, తెగులు మొద లరసి,
తెగఁ దీర్చు వెర వరసి, యాతురు
దగిన వైద్యముఁ జేయవలె వెజ్జు :—
తగవి మం దిడ మఱియుఁ జెడు వపుశ్రీ.

9. రోగి యలవియు, వ్యాధి యలవియును.
సాగు కాలమును, వైద్యం దరసియే
బాగుగఁ జికిత్స చేయఁగ వలయు :—
డాఁగురింతలు కాదు సువైద్యశ్రీ.

10. తెగులుగొంటును, వెజ్జు, మందు, నూ
డిగపువాఁ డనెడు నప్పాళ్లు నాల్గా
వగలదే యగును రోగ చికిత్స :—

86 వ అధికారము

# కులీనత.

1. ఐనింటఁ బుట్టినట్టిఁ డుల యెడఁ
గాని యుండవు, స్వభావంబులుగ, మా
నైన తిన్ననయు నానయు నొకట :—
స్థాణువులు గావు కల్పితగుణశ్రీల్. 951

2. నడతయును, నిజమునున్, సిగ్గు, ననఁ
బడెడు విమ్మూటియందును, మఱచియున్,
వెడిసిపోవరు సత్కులోద్భవులు :
అడరుఁ ద్రికరణశుద్ధి కులకతాశ్రీన్. 952

3. నగుమొగం, బీవి, యిం పగు మాట,
అగడు లాడమి ; నాలుఁగును నైజపున్
వగ లంద్రు సత్కులోద్భూతులకు :—
నెగడ వధమోద్భవుల నీగుణశ్రీల్. 953

4. అడుకంబడిన కోటి ద్రవ్యములఁ
బడసినను, నుత్కృష్టవంశోద్భవుల్
నడత కుందునవి చేయుట లేదు :—
చెడుగుఁ గడఁగమి కులికలక్షణశ్రీ. 954

5. దాన మిడు ద్రవ్యంబు లోటయిన
దీనభావమునఁ, బ్రాక్తనకులీనుల్
మానితగుణమునుండి విడివడరు :—
ఆనీత మొకొ, మాఱ, స్వభావశ్రీ ? 955

6. చలముఁ బట్టుచు నక్రమంబులను
నలుప "రకలంకక్రమాగతం బౌ
కులముఁ బట్టియె మనుదు" మనువారు :—
కలిమి కయి విడఁ దగునె స్వధర్మశ్రీన్ ? 956

7. ఉన్నతకులజులందుఁ గలుషంబు,
విన్ననన్ నెలయందు మచ్చ వోలెన్,
విన్నఁబా టొదవఁ బైఁబడి తోఁచు :—
చిన్న కఱ తెలియు వితతాచ్ఛతాశ్రీన్. 957

8. కులసంభవుని స్వభావమునందు
లలి లేమి తోఁచునెడ, జగ మతని స
త్కులభవమునందు సందేహపడు :—
కులకుండు తొలఁకందు స్వధర్మశ్రీన్. 958

9. స్థలప్రకృతి నవటి మొలకయె చూపుఁ,
గులప్రకృతిఁ జూపు సత్కులమునందున్
వెలసి యున్నట్టిఁడుల వాసుడులె :—
ఖలకులభిలత పరుషతనె యిలాశ్రీన్. 959

10. ఇల మేలు వలయునెడ, బిడియంబు
వలయుఁ ; గులకత వలయునెడ వలవఁగా
వలయు నెవ్వరియెడను వినయంబు :—
[illegible] నెలయు సదుణశ్రీన్. 960

97 వ అధికారము

## మానము.

1. బ్రతుకుటకుఁ, జేయ క్రమరనియట్టి
హితము లైననుఁ, గులస్వాభావికో
న్నతి కుంద వచ్చునవి విడువ వలె :—
సతము, మెయికాదు, చిత్తోన్నతిశ్రీ. 961

2. వినుతిఁ గొల్పినను, నభిజనమునకు
ననువుపడనివి చేయరే, వినుతితోఁ
బెనుమానమునుఁ గోరుకొనువారు :—
వినుతిరంబెను మాన మతిశయశ్రీ. 962

3. పెరుఁగు తఱి, నక్క అగు వినతియే-
సిరి కులీనుని పట్టునను- జిఱుతగా
సురుఁగు తఱి, నక్క అగు నున్నతియె :—
తఱుఁగ దిరు తెఱఁగులను మానసుశ్రీ. 963

4. తలనుండి యూడి రాలిన వెంట్రుకల వంటివారు, కులసంభవులు, మేల్
నెలవునం దుండి క్రిందను బడిన :—
నెలవు మే లగుట చిత్తోన్నతిశ్రీన్. 964

5. పెరిమెఁ గొం డంతవారునుఁ గుందు
దురు, కుందుటకుఁ గత మయిన నింద్యమున్
గురిగింజ యంతైనఁ జేయునెడ :—
మరియాద మీఱఁ జెడు మానసుశ్రీ. 965

6. పొగడితం గూర్చ దాయెను ; దేవ
జగమునం జేర్చ దాయెను ; మ తేలో,
అగ డార్చువారి వెనుచను నునికి ? :—
దిగ జార్చఁ దగునె చిత్తోన్నతిశ్రీన్ ? 966

7. అవమానపఱచువారలను వెను
దవిలి మనఃకంబె నొకఁ, " డా విలకనే
యవిసినాఁ ", డనఁబడుట యే మేలు :—
ద్రవిణమును మించు మానమె ఘనశ్రీ. 967

8. మం దొకో చావ కుంటకు, మఱియు
బొంది నోమెడు బ్రతుకు, పెన్తగవు మే
లందంద యవియ వచ్చినయెడను ? :—
బొందివలెఁ జెడ, దోమ, మానసుశ్రీ. 968

9. తన రోమ మూడినను బ్రతుకఁజా
లని చమరమృగ మట్టివా, రుసుఱు వీ
డ్కొనియెదరు మాన మఱఁ దఱియునెడ :—
తనువొకో -నిల్చునది- మానజశ్రీ. [కీర్తి] 969

10. భంగ మెదురైన బ్రతుకక, భౌతి
కాంగముల విడుచు మానాన్వితుల కీ
ర్త్యంగముల మ్రొక్కి పొగడును జగము :—

98 వ అధికారము

# పెరిమె.

1. అధికత్వ మొకని కూ(కువబలుపె ;
అధమత్వ మొక్కనికి " అది లేకె, యే
విధమైన జీవింతు " మనుకొనుట :—
విధి నెఱప ముఖ్య ముత్సాహసుశ్రీ.　　971

2. భవభావ మొవ్వ నుసుఱుల కెల్ల ;
అవగతము లగు యోగ్యభావమ్ము లో
వ్వవు చేయు కర్మముల వేఱిమిని :—
వివిధములు గుణకర్మజార్థ్యాశ్రీల్.　　972

3. అధికస్థు లయ్యు, ననధికచరిత్రు
లధికు లవ ; రధమస్థు లయ్యు, -నెవరే-
నధము లవ, రనధమచరితవారు :—
స్వధర్మాచరణమున నధికతాశ్రీ.　　973

4. ఒఱుపుమదిమగువ శీలము వలెనె,
పెరిమెయును(, దన్ను( దా( గాచికొని మేల్
నెఱియందు( దప్ప కుండిన, నుండు :
చరిత తక్కమి దక్కు గౌరవశ్రీ.　　974

5. పేరిమిగలార లోపుదురు, నెఱ
వేఱుప(గ( దగు నెఱివి గడ(గువారై,
వే ఱెవరికే నరిది వగు, పనుల :—

6. మూఢుల మనస్సులం దుండదే,
" ప్రౌఢులను సేవించి వారి దారిన్
బాఢతను గొందు ", మను లక్ష్యంబు ! :—
వ్యూఢహృదయుల సొత్తు గాఢతాశ్రీ.

7. అతిక్రమమదముననె మీఱు చే
ష్టితము గల దగు, ధనాద్యున్నతియుఁ, దా
నతిహీనమానవుల యెడఁ బడిన :—
హిత మగు వినీతులకె యున్నతిశ్రీ.

8. అణఁగు నెన్నఁడునుఁ బెద్దఱికంబు ;
చెనఁటి చిన్నఱికంబొ, కొండాడుటన్
మొనయుఁ ద న్నదనముగఁ జేసికొని :—
అననుమేయము జగత్స్వభావశ్రీ.

9. పెరిమె యను నది మదవిహీనతయె ;
చిఱుతతన మను నదియె, దుర్మదంపున్
దరి దరినె యూనుకొను న్యూనతయె :—
గరిమ మొదవునె, మదము పొదల, హృచ్ఛ్రీన్

10. అఱగొఱల మఱుఁగుపుచ్చును బెరిమె-
పెఱవారలవి- చిఱుతతనము, తానో,
కొఱగాములనె పలికి వెలిపుచ్చు :—
కరముఁ బెరిమెను నఱుము సద్గుణశ్రీల్.

99 వ అధికారము

# నిండుతన మేలుట.

1. స్వాభావికం బం ద్రఖిలసుగుణ
వైభవము, క్రమ మెఱిఁగి పరిపూర్ణతా
ప్రాభవము మేకొనెడు వారలకు :—
ఆభోగ మగునె యసహజగుణశ్రీన్ ?    981

2. గుణముల నయంబె పూర్ణుల నయము ;
కనఁబడెడు వే ఱయిన రూపునయమో,
కన, నే నయములోనివియుఁ గాదు :—
మనసారు నయమున మనోజ్ఞతాశ్రీ.    982

3. ప్రేమంబు, లజ్జ, యుపకారకత,
మోమోట, సత్యంబుతోడ నైఁమన్,
దాము పూర్ణత నూను కంబములు :—
తేమి నివి, నెలకొనదు పూర్ణతాశ్రీ.    983

4. కొల యొనర్పక యుండు నయమునం
దలిది తాపసవృత్తి ; పరదోషముల్
పలుకని నయమునందలిది నిండు :—
కలుగ నివిలేక ప్రతపూర్ణతాశ్రీల్.    984

5. నేరుపరు లగవులను సెఱవేర్చు
నేరు, పణఁకువ ; అద్దియే ప్రపూర్ణుల్
మాఱుతుల మార్చు సాధనము నగు :—
పూరించు నెదియుఁ బూర్ణపినయశ్రీ.    985

6. చాలికకు నొరగ ల్లదే దనినఁ,
దాళుకొని, యడఁకువను, దుల్యుంద్రుఁ గాఁ
జాల నట్టిఁడులయెడనుం, గొనుట :—
తేల, దధికుల కణఁగఁ, బూర్ణతా్ౖరీ. 986

7. హితరహితములఁ జేయువారికిని
హితములే చేయ కుండెడు నెడల, నే
హితఫలము గల దొకో చాలుబడి ? :—
ౖప్రతిదురాకృత మెడపుఁ బూర్ణతా్ౖరీన్. 987

8. లేమి, యొక్కనికిఁ గొఱపా టవదు,
వైమనస్యము లేని నిండుతన మన్
సామర్థ్య ముండఁగా బెరయునెడ :—
దీమసముఁ గొల్పు గుణపూర్తి హృచ్ఛ్రీన్. 988

9. ౖప్రళయముగఁ గాలంబు మాఱిననుఁ
గలఁగి మాఱరు తాము, సెఱ పూన్కికిన్
జలధిగంభీరు లనఁబడువారు :—
తొలఁకునొకొ నిండుకుండయు నిలా్ౖరీన్ ? 989

10. పరిపూర్ణులందు గుణపూర్ణతా
భరణంబు కుందునెడ, మహావిశ్వం
భర తాను నూనదు కదా బరువు ? :—
పరిపూర్ణు లఱిన, నఱు భూతమా్ౖరీ. 990

100 వ అధికారము

## లౌకికగుణ సంపన్నత

1. సులభదృశ్యతవలన, నెయిదునది
సులు వందు రేరికివి, లౌకికగుణం
బుల కలిమి యనెడు సౌశీల్యంబు :—
వలయు నిల మెలయ లౌకికగుణశ్రీ. 991

2. లలికలిమి, మహితకుల సంభవత :
వెలయు నీరెండునున్, లౌకికగుణం
బుల కలిమి యనెడు సౌశీల్యంబు :—
చెలఁగ దవి లేక లౌకికగుణశ్రీ. 992

3. తనుసమత సుజనసామ్యము కాదు ;
అనుసరణయోగ్యసద్గుణసమతయే
యెనయునట్టిది యైన సామ్యంబు :—
తను వెదయ కనుసరించునె యసుశ్రీన్ ? 993

4. నయసహితసద్ధర్మనిరతి గల
ప్రయోజకు లగువారి సద్గుణంబున్
జయవెట్టి కొనియాడు లోకంబు :—
నయ మానయించు లౌకికగుణశ్రీ. 994

5. నగులాటలోను నింపవ దిగడు ;
పగలోను నించు గుణచేష్ట లుండున్
జగపాడి నెఱుఁగు లౌకికులందు :—
జగతి కనుకూలగతి లౌకికశ్రీ. 995

6. లౌకికగుణోత్కటుల పాలఁ బడి
సాఁకఁబడు లోకగతి; యద్ది, లేదేన్,
వీక మన్ననఁ జొచ్చి మాయుఁగద ? :—
ఊఁకువను గొల్పు లౌకికగుణశ్రీ. 996

7. ఆకుఱా యటు వాఁడివా రయ్యు,
శ్రమాఁ కట్టివారలే, మనుజార్హమౌ
లౌకికగుణంబు లే నట్టిఁడులు :—
ప్రాకటవివేకజము తద్గుణశ్రీ. 997

8. ననుపు నెఱపక యుండి, -తమరియెడ-
ననయచరు లగువారి యెడను, గుణవ
ర్తనము నెఱపనివా రగుట కలుచ :—
చెనఁటి యగు మనమి లౌకికగుణశ్రీన్. 998

9. నగుమోము వల్లసగువా ండవని
విగుణులకు, బహుబృహన్మహి, పగలునున్
విగతమై, యిరులు పాలం బడును :—
నెగడు జగదివ్వె, లౌకికగుణశ్రీ. 999

10. లౌకికగుణము లేనివానియెడఁ
జేకుఱిన పెన్కలిమి, మేలైన పాల్,
బోఁకి కలుచను, జెడినయ ట్లగును :—
పీ కొండు లౌకికగుణాకరుని శ్రీ. 1000

101 వ అధికారము

# వ్యర్థ సంపద

1. వైచె, గడియించి యిలు నిండుగాఁ
దోఁచు పెనుసొత్తు; నది కుడువనాతం
డై చచ్చెఁ; జేయఁ దగినది లేదు :—
నీచలోభిత్వమున వ్యర్థమగు శ్రీ. 1001

2. సిరులచే నగు నెల్ల నని యెంచి,
పరుల కీయక పట్టుకొను లోభపున్
మరులుచే నగు మే లవని జన్మ :—
కొఱలుఁ గద దాత యుత్తమభవశ్రీన్. 1002

3. గడియించి చేర్చుటకె పేరాస
పడి, యశము నభిలషింపని మానవుల్
పొడమి మిడుకునది నేలకు బరువు :—
ఇడమి వెడ యగు, ధనముతోఁ దనుశ్రీ. 1003

4. మిగులుగాఁ దన వెనుకఁ, దన దేది
యగు ననుకొనునో, యే యొకరిచేతనున్,
వెగటుచేఁ, గోరంబడనివాఁడు ? :—
మిగులు పేరే తనది ; తన దవదు శ్రీ. 1004

5. ఇడుటయును దగినవారికిఁ, దాము
కుడుచుటయు, లేనివారికి ధనచయం
బడుకుగాఁ గోటి కల్గియు, లేదె :—
బడలి పడయుట, యదికి యడఁచుటకొ, శ్రీల్ ? 1005

6. నొగులు పెనుసిరికిఁ, దాఁ గుడువఁ డై,
తగినట్టి వారలకు నొం డిడుట యన్
సుగుణ మైనను లేనియాతండు :—
మిగులు సంతతికొఱకొ, లోభంబు శ్రీన్ ? 1006

7. లేనివారల కొండు నిడ కుండు
వాని సంపద, మిగుల నయము గల బొ
చాన యొంటిగ ముదిసిన ట్లగును :—
నానుభుక్తము, లేల సుభగతాశ్రీల్ ? 1007

8. ఇడమి, నొక్కరిచేతనుం గోఁ
బడనతని భాగ్యంబు, నట్టూరిలోఁ
బొడమి, విషతరువు పండినయట్లై :—
వెడ గాదె, యుపకారి కానతని శ్రీ ? 1008

9. నెన రుడిగి, త న్నడఁచికొని పాడిఁ
గన, కొకఁడు, చేరిచిన మేలి సొత్తున్
గొని యనుభవించువారలు పరులు :—
గణన కొకొ గడన సేయుట ధనశ్రీల్ ? 1009

10. ఔదార్యమతు లగు ధనుల చిఱు
పేదఱిమి, మబ్బు వఱ పెక్కువగ నొ
తాదృశం బొక ప్రకృతి గల దగును :—
ఈఁద సోఁకదె ? కురియదే ఘనశ్రీ ? 1010

102 వ అధికారము

## సిగ్గు కలిమి.

1. తగని పని కతన సిగ్గిలుటయే
యగు, సిగ్గు : సుందరలలాట లగు మేల్
మగువలకు నొనరు సిగ్గులు వేఱు :—
విగుణులం దొదవునే యట్టి హ్రీస్త్రీ ? 1011

2. కుడుపు, నుడుపునుఁ, దక్కినవియు, విల
మిడుకు జీవులకెల్ల సామాన్యముల్ ;
బిడియ మూనుటె సజ్జనుల ఘనత :—
కదలుకొను బిడియమున, స్వభావస్త్రీ. 1012

3. మేనులను గుఱి గొన్నయవి యెల్ల
ప్రాణములు ; నాన యను సుగుణంబునే
తాను గుఱిగొన్నయది చాలుబడి :—
న్యూన మగు, నాన తెగ, మావితాస్త్రీ. 1013

4. అలంకారము కాదొకో సిగ్గు
కలిమి, పరిపూర్ణులకు ? అద్ది లేదే,
నిల, బీడు కాదొకో పోఁడినడ ? :—
కలంకం బగు పీడ, వ్రీడ యను శ్రీన్. 1014

5. పరనిందయును, ఆత్మనిందయునుఁ
బొరయ సిగ్గిలువారె, సిగ్గునకుఁ దా
నిరవుకొను నెల వనును లోకంబు :—
పరమంబు స్వపరసమనిసర్గాస్త్రీ. 1015

6. విడియకోటను దమకు నుఱు కాపు
గడగఁ గొనకుండ, విస్తృత ధారణిన్
మిడుకఁ గోరరు మే లయినవారు :—
చెడుగు చొఱఁబడనియక కాచు హ్రీశ్రీ. 1016

7. వ్రీడఁ గాచెదు పొందెఁ బ్రాణమును
వీడుదురు ; ప్రాణంబు పొందె వ్రీడన్
వీడ, రోగి వ్రీడ నేలెడువారు :—
వ్రీడ ప్రాణముకంటె ఘనతరశ్రీ. 1017

8. పరులు సిగ్గిలఁ దగినయది తాను
జరుప సిగ్గిలఁ డేని, ధర్మమతనిన్
దొఱఁగఁ దగినది యగును, సిగ్గుపడి :—
నెరపు నెటు ధర్మంబు, తఱప హ్రీశ్రీన్ ? 1018

9. కులముఁ జెఱచును, నడత, తప్పుడా
రులఁబడిన ; మంచి యెల్లనుఁ జెఱచు, హ్రీ
కలుగమియె నిలువరించినయెడల :—
ఫలరహిత జీవనం బేల ఘూశ్రీన్ ? 1019

10. వ్రీడ మది లేనివారలు కదలి
యాడునది, దారుప్రతిమ త్రాడుచే
నాడి జీవభ్రాంతిఁ గొల్పినటె :—
పాడిపోఁడుల బ్రతుకు హ్రీగుణశ్రీన్. 1020

103 వ అధికారము

# కుల ముద్ధరించు వగ.

1. కుటుంబోన్నతికిఁ దగు కర్మ చే
యుట కొకఁడు "మాన" నను పేర్మి వలె ను
త్కృట మైనయది వే ఱొకటి లేదు :—
కుటుంబోద్ధారణము స్వధర్మశ్రీ. 1021

2. మనుజప్రయత్నంబు, నెఱతెల్వి,
యను రెంటి యెడతెగని కర్మంబుచే
మొనరి యున్నత మగుఁ గుటుంబంబు :—
గొన బవదు తామసుని కుటుంబశ్రీ. 1022

3. "కులము నున్నతము చేయుదు" నంచుఁ
దలకొనెడు నొక్కనికి, దైవ మొనరన్
వలువ బిగియించి తా ముం దగును :—
కులోద్ధర్తకు సాయ మదృష్టశ్రీ. 1023

4. ఆలోచనము చేయకయె, తానె
తేలికగ నెఱవేఱు స్వకులకర్మం,
బాలసింపక కడఁగువారలకు :—
కాలవిధిబలయుత మనలసతాశ్రీ. 1024

5. ఎట్టి తప్పులును లేనట్టిఁ డై,
పుట్టిన కులము మేల్పఱచి మను ఘనున్
జుట్టముగఁ గొని చుట్టు లోకంబు :—
కిట్టునే చెట్టలను సుజనతాశ్రీ ? 1025

6. మేలి మగఁటిమి యనున దొక్కనికి,
వీలుగాఁ, దాను బుట్టిన యింటిపై,
నేలుబడిఁ గలిగించుకొనుటయే :—
గేలిపడు గృహి, డీలుపడ ధృతిశ్రీన్. 1026

7. సమరరంగమునందు ఘనపరా
క్రముల మీఁదిది వలెనె, తమరి యింటన్
సమర్థుల మీఁదిదే, భారంబు :—
అమరుతురు వారె విజయోన్నతిశ్రీల్. 1027

8. కులోద్ధర్తలకు లే దదనుఁ గన
వలసినది ; ఆలసించుచు, మానమున్
దలపోయునెడఁ గుటుంబము చెడును :—
ఎలమికలుముల చెలమ కులబలశ్రీ. 1028

9. ఇడుమకే యెదమొకో, కడఁబడక
కడఁగువాఁ డయి, కుటుంబము బెడఁదలం
బడకుండఁ, గాచునాతని యొడలు ? :—
పడయు నతఁ డిరుమెయుల సురసుఖశ్రీన్. 1029

10. ఇడుమగొడ్డలి మొదలుఁ దెగఁగొట్టి
కెడపఁ, గూలును, గూడి యూనికగ మే
లొడయఁ దుండవి, వంశవృక్షంబు :—
అడరు నుదరచేఁ గుటుంబశ్రీ. 1030

104 వ అధికారము

# సేద్యము.

1. చుట్టినను( బలుపనుల, నేరు వెను
తట్టుదే లోక మగు ; నా కతమునన్
బి ట్టలసినను సేద్యమే మేలు :—
పొట్టకూ డున్న(గద ప్రవృత్తిశ్రీల్. 　　1031

2. కరిసనపు( బనివారె లోకులకు
నిరుసాణి, అది చేయ కితరంబులన్
బర(గు నెల్లరను భరియించుటను :—
ఇరుసు మురిసిన నఱు జగద్రథశ్రీ. 　　1032

3. పై రునిచి, తిని, మనెడువారె మను
వారు ; తదితరు లెల్ల, సేవించి యా
హారించి వెనుక( జెల్లెడువారె :—
స్వైరజీవన మొక్క కృషికతాశ్రీన్. 　　1033

4. పలు గొడుగునీడలను( దమ తేవి
బలుగొడుగుక్రింద( గాంతురు పైరుపెం
పొలయు ఛాయాశీతకర్షకులు :—
బలియు భూవిభు(డు పుష్కలఫలశ్రీన్. 　　1034

5. అడుగ, రడిగినవారి కొండిడుదు
రడకించ, కెపుడు( గై కృషి చేసియే
కుడిచెడు స్వభావంబు గలవారు :—
అడరు( గడు, స్వయంకృత కృషిఫలశ్రీ. 　　1035

6. ఉత్తమార్థముల బాగుగ నెఱిఁగి
యెత్తి చెప్పఁగ బీద, తద్వచనముల్
రిత్త వోవును, శ్రోత లుండమిని :—
వేత్తృతయుఁ బేద కిడ దిహఫలశ్రీన్. 1046

7. పాడి చేసిని పేదఱిమిఁ గుడుచు
వాఁ, డకట ! తన కన్నతల్లివలనం
గూడఁ, బెఱవాఁడు వలెఁ జూడఁబడు :—
కీ దొందయఁ బేదఁ, దో డురువు భూశ్రీన్. 1047

8. " ఇన్నాఁడునున్ వచ్చునదె యొకో,
నిన్నటన్ గొల చేసినది పోతె నా
కెన్నో వ్యథ లిడిన నిప్పచ్చరము ? " :—
ఖిన్నుఁ డగుఁ బేద యిటు, తన్నడుగ శ్రీ. 1048

9. నిప్పులో నిదురించుటయు నగును ;
నిప్పచ్చరములోన, నే వగనునున్,
తెప్పపాటైనఁ గల్గుట యరిది :—
నిప్పు వె ప్పెదపు మంత్రౌషధశ్రీల్. 1049

10. కుడువఁ దగినవి లేవివా రెల్లఁ
గడముట్టఁ దొఱఁగమిరె, మెయి సోఁక వేఁ
డెడు నప్పునకు గండికివి, యముఁడు :—
ఒడలికన్నను మిన్న స్వమానశ్రీ. 1050

106 వ అధికారము

# యాచన.

1. వేఁడవలె వేఁడఁబడఁ దగువారు
చూడఁబడునెడ: దాఁచ, వారి తప్పే;
వేఁడువారలది తప్పే కాదు :—
కీడుపడ దట్టి యాచన జగచ్ఛ్రీన్. 1051

2. ఇమ్మె యవి నొక్కని, కుదారునిన్
నెమ్మి యాచించునది, యాచితము, తే
యుమ్మలము నేర్పడక, వచ్చునెడ :—
ఇమ్ము దాతకును నగు, వితంబశ్రీన్. 1052

3. మఱుపడని మది గలిగి స్వధర్మం
బెఱుఁగువారల ముందు నిలిచి యాచనన్
జఱపుటయు నొక మనోజ్ఞత కలదు :—
తొఱఁగ దపు దర్థార్థి స్వమానశ్రీన్. 1053

4. యాచనయు నీవినే పోలుఁ గద,
దాఁచికొను టనునదే కల నైననున్
దోఁచు తెఱఁగనివారి పట్టునను :
యాచన యొసంగు, దాతకు, యశశ్శ్రీన్. 1054

5. దాఁచికొన కిడువారు లోకమునఁ
దోఁచుటనె, యెదుట నిల్చెదు మానులౌ
యాచకులు తద్వృత్తి మేకొనుట :—
ప్రోచికొన, రొండెఁ, బేదలు తనుశ్రీన్. 1055

6. దాఁపురపు టిడుమ లేనట్టిఁడుల
దాపునం గనిన, నిప్పచ్చరంపున్
వేఁపు టిడుమలు నెల్ల నొకటఁ జెడు :—
ఆపదుద్ధారకుం డుదారశ్రీ. 1056

7. తెగడి యెల్లిదము సేయక, యిచ్చు
సుగుణుఁ గాంచిన, నలరి పేద యుల్లం
బొగిని లోలోనె యానందించు :—
పొగియు నుడి, యీవియు, వదాన్యతాశ్రీ. 1057

8. యాచకులు లేరేని విపులజగ
తీచరిత, దారుప్రతిమ త్రాటిచే
నూఁచఁబడి చెల్లి వచ్చుటఁ బోలు :—
రేఁచు నిల జీవకళ ననఘతాశ్రీల్. [కీర్తులు] 1058

9. ఈవికాంద్రురయందు నే మొదవు
భావుకోన్నతి, వేఁడి పుచ్చుకొనుటల్
కావలసినట్టిఁడుతె లేనియెడ ? :—
ఈవి నెఱపినఁ గద సుకృతయశశ్శ్రీల్ ? 105

10. అడుగువాఁ డలుగరా ; -దీవికాఁ
డిడమికినిఁ,- దా నేమిచేఁ బడునవొ
యిడుమ తానేయు, నమరెడు సాక్షి :—
ఇడఁ గలఁడె, లే నపుడు, నుదారశ్రీ ? 10€

107 వ అధికారము

# యాచ్ఞాభీతి.

1. మఱుఁగుపుచ్చక యలరి యిడునట్టి
నిరతిగల కను లట్టి ఘనులకడనున్
దిరియమియె కోటి మడుఁగులు నయము :—
మఱొక జీవిక ప్రోవదో తనుశ్రీన్ ? 1061

2. తిరిప మెత్తియు నుసుఱుతో మనుట
జరుపవలె నని విధించినఁ, దానునున్
దిరిగి చెడుఁ గాక, లోకస్రష్ట ! :—
పురాకృతజము లిహప్రవృత్తిశ్రీల్. 1062

3. లేమియిడుమనుఁ "దిరిసియే తీర్తు
మే" మనెడు మోటుందనము వోలె, వే
తే మోటుఁదనమునున్ లే దిలను :—
లేమి యఱఁ, గల వెన్నొ ప్రవృత్తిశ్రీల్. 1063

4. పుడమి యెడ మెల్లఁ జాలని పేర్మి
యదరునదె, కుడిబండ ముండనపు దే,
నడిగి కొను టొదఁబడని చాలుబడి :—
మిడుక, బిచ్చము కాదు సువృత్తిశ్రీ. 1064

5. తెలినీరు వంటి యంబలియేని,
లలిఁ, గడఁకఁ యిడినయది కుడుచుకంటెన్
బలుమించు రుచియించునది లేదు :—
బలు వైననున్ భిక్ష నఱు రసశ్రీ. 1065

6. " అవునకు నీ " యనియె యడిగినను,
జీవకరుణావిధిని, నాలుకకు యా
చ్ఞావాక్కు వలె విస్పృష్టము లేదు :—
ఏవిధియు నెఱపఁ డగు స్వయత్నశ్రీన్. 1066

7. యాచింతు యాచకుల నెల్లరను,
" యాచించునెడ, దాఁచుకొను లోభులన్
యాచింపకుండి చుండీ ! " యంచు :—
కాచ, విలుచును మాన, మఱుఁ దను శ్రీ. 1067

8. తిరిప మనియెడు కాపుగడ లేని
ముఱిదోనె, లేమి యను కడలిలో, దాఁ
పుర మనెడు మిట్ట తాఁకఁగఁ, బగులు :—
దరిఁ జేర ఱతన మను తరియె సుశ్రీ [సాధనము] 1068

9. యాచనను దలఁప, నుల్లము కరఁగు ;
దాఁచి యిడమివి దలఁప, మును పున్నదౌ
ఆ చాడ్పు నుండకయె వే చెడును :—
నీచతర ముండినను లే దనుట, శ్రీ. 1069

10. మఱుపుచ్చి లే దనెడువారి కెట
మఱుఁగుపడునొకో, లే దని యాచకుల్
మొఱ లాడఁగనె పోవునది, యుసుఱు ? :—
తిరుచనున్, మఱుపఱచనున్ దగదు, శ్రీన్. 1070

108 వ అధికారము

## నీచత్వము.

1. మనుజులే వలె నుండ్రు నీచులునుఁ
గన; వారి యట్టి పోలిక మే మిలన్
గనలేదు వే ఱీరు తెగలందు :—
జనుల, రూపొకటె; భేదము, గుణశ్రీన్. 1071

2. శ్రేయోవిదుల కంటె నీచులే
శ్రీయుతులు, దేని కైనను గుండె లం
దే యలమటయు లేవివా రగుట :—
న్యాయహేయాజ్ఞలకు సాహసశ్రీ. 1072

3. దేవతల యంతవార లధములు,
లోవ కెవరికిని, వారునుఁ దా మెదన్
భావించునవి చేసి మిడుకుటను :—
పై విధాయులు లేమి, స్వైరితాశ్రీ. 1073

4. అగ్గపడు పోకిరులఁ గాంచుచో,
నెగ్గునను వారినిన్ మిక్కిలుట నౌ
నగ్గలిక మదము నొందును నీచు :—
సిగ్గువడఁ దధమాధముఁడ నంచుశ్రీన్. [బుద్ధియ్యందు]

5. అడలుననె, యొకపు, డధముల మంచి
వడత ; తక్కినపు, డాసించునది చే
పడు టుండునే, నుండు నది కొంత :—
అడర దధములకు సహజశీలశ్రీ. 1075

కొట్టఁబడు తమ కట్టఁడులు విచ్చ
కెట్టవియుఁ దా మాలకించినవి యొ
గుట్టు లొరులకు మోసి చెప్పటను :—
కట్టడల కదఁగె రథములు జగచ్ఛ్రీన్. 1076

ఎంగిలిచెయియు దులుప రథముంద్రు,
గింగు రనఁ జెంపఁ బగులం గొట్టఁగా
వంగు చెయివా రవవి వారలకు :—
చెంగుఁ గద జీవకృప వికృష్టశ్రీన్. [బుద్ధియందు] 1077

చెప్పికొనఁగనె యొదవుదురు పేర్మి
యొప్పారు నుత్తములు ; చెఱకును వలెన్
పిప్పి చేసినవె యొదవును నీచు :—
చొప్పదునె మేలు తలఁ పవద్యశ్రీన్ ? [బుద్ధిలో] 1078

ఉడుచుటయుఁ, గుడుచుటయుఁ గాంచునే
వెడవారియెడ, లేని తప్పులను గాం
చెడు నంత నెఱవాది యగు నీచు :—
ఇడుగడకె యెడ మిడును వికృష్టశ్రీ. [బుద్ధి] 1079

దేని కుఱుదురు నీచు ? లిడుమయే
దే నొందు పొరయు తఱిఁ, ద మ్మమ్ముకోఁ
బూను న్యూనత కుఱుదు, రురవదిని :—
హీను లడియంద్రుగనుఁ దగ రిలాశ్రీన్.

(అరవరము సంపూర్ణము)

#  పదులు

(పంచాక్షర మాలికలు)

# కామ వర్గము

"సత్కవిహంస"
శొంఠి శ్రీపతి శాస్త్రి,
ఆంధ్ర కావ్యకర్త.

కామ వర్గము

# విషయ సూచిక

## సంయోగ ప్రకరణము (గాంధర్వము)



## వియోగ ప్రకరణము (పాతివ్రత్యము)

# సొగసు నెగులుఁ గొలుపుట.

(పొలిమేర నొక యుత్తమయువకుఁ డొక యుత్తమయువతిని గని యనుకొనునది)

1. " అనిమేష యొకొ ?– –ఉరుమయూరి యొకొ ?–
ఘనకర్ణికావిభూషిత ! మాయురే !
మనుజయే యొకొ ? కలఁగు నా మనసు ! :—
కని యెఱుఁగ మున్నిట్టి సురూపస్త్రీన్. 1081

2. " చూచినది, నా చూపు నెదురుకొని
చూచు, టది, తాఁకు మోహిని, నేననున్
రేఁచి తోడ్కొని వచ్చు టట్టిదియె :—
ఏఁచె మై చెలువు ; మఱి వేఁచె దృక్ఛ్రీ ! 1082

3. " మును పెఱుంగక యుంటి " యమరూప "
మనున, దిపు డెఱిఁగితిని ; " స్త్రీప్రకృతితో
మను పేరు పోరు కన్నులు గలది " :—
వనిత చూపులు తూపు లయ్యె హృచ్ఛ్రీన్ ! 1083

4. " కనువారి యుసుఱుఁ దిను స్వభావం
బునను, నబలాప్రకృతి గల దీన, కీ
వనితకున్, మాఱుపడినవి కనులు :—
కనుకఱకు చనునె దుర్బలతనుస్త్రీన్ ? 1084

5. " నొగిలిచెడు కాలుఁడో ? –మోమోటఁ
నెగడు కనులో ? –బెగడు హరిణియో ?– లే
మగువ చూ, పీ మూడునుం గలది ! :—
సొగపుమగవగ లొలయుఁ జెలియ దృక్ఛ్రీన్. 1085

6. " కడిఁది బొమముడి వికట మవక మఱు
పడినయెడ, వికటించి నడుఁకించు నా
గడము చేయునె యీమె కన్దోయి ? :—
ముడిబొమలు, విండ్లు; కం, డ్లంబకశ్రీల్ ! 1086

" మదగజము హింసకము కామికై
యుదుటు కనులను మూయు మొగవడం, బీ
మదట వాలని చనుల పైపైఁట :—
ప్రిదులునే నది, కుదులునే హృదిశ్రీ ! 1087

8. " మడఁతి మిసమిస లెసఁగు నొసటికే
యడఁగెనే, రంగమున నెట్టి పగఱున్
జడియుటకుఁ గతమైన నా బలము ; :—
అదరు నీ యబల తేజోబలశ్రీ. 1088

9. " హరిణి వలె వెఱచూపు, నెఱసిగ్గు,
నారిమమెయిఁ గొఱలు సుందరికి నగ లే
కొఱకొఱకొ, పొందుపడనివి, యిడుట ? :—
బరు వకట ! చాలవే సహజసుశ్రీల్ ? [అలంకృతులు]

10. " కుడుచువారినె కావి, మద్య మె
న్నఁడునుఁ గామిని వోలెఁ, గనువారినిన్,
బెడ గొడియ, మైకపఱచుట లేదు :—
కుడువ, నిసుమడి సొగపొ, మదవతీశ్రీన్ ? " 1090

# గుఱి నెఱుంగుట.

(అతఁడు)

1. "ఇరుచూపు లీమె కాటుకకండ్లఁ
బరఁగు; నొక చూపు నొగులుచు చూపగున్;
మఱి యొకటి యన్నొగులునకు మందు :—
ఒరిమఁ గామప్రేమ లురలు దృక్ఛ్రీన్. 1091

2. "కనుమూఁతఁ గొనుచు సను, గనుఁగొనెడు
పవిత చిఱుచూపు, కామాసక్తిలో
నొనరు సమభాగ మవ, దెక్కు వగు :—
తనువు లెనయవె, యెనసెఁ గద మనశ్శ్రీల్ ? 1092

3. "కాంచినది; కాంచి తల వాంచినది;
యించు గుఱి, యది. యామె చెలిమిమొలకన్
బెంచ నాసించి పోసిన నీరు :—
మించువలెఁ గాంచి కొంచించు హ్రీశ్రీన్ 1093

4. "నేఁ జూచు సమయమున నిలఁ జూచు;
నేఁ జూడ కున్న సమయమ్మునందో,
తాఁ జూచి మగువ మెల్లఁగ నగును :—
ఈ జాడలం దెలియు హ్రీముదశ్రీల్ ! 1094

5. "గుఱిఁ గొనుచుఁ గనుఁగొనమియే తప్ప,
నొఱఁగు నొక కంటం గటాక్షం బొగిన్
బరఁగించునది వలెనె యల్ల నగు :—
అరమరిక యురునె యిఁక మన్మనశ్శ్రీన్ ? 1095

6. “ అననుకూలురు వోలెఁ బలికిననుఁ
గినుక మనసున లేనివారి పలుకుల్
వెనుక హితములుగ, వే తెలియఁబడు :—
అనుఁగుఁజెలి గదుమ, నదలదె హృదిశ్రీ ! 1096

7. “ విరసింపనట్టి పరుసపు నుడియు
విరసులటు చూచుటయు, నోరులు వలెనే
వఱలు నోరిమిక గలారల గుఱులు :—
తెఱవ వెర వుఱవె ; వెఱవదు హృదిశ్రీ. 1097

8. “ అసియాఢు లేమ కోక సోగ సెసఁగుఁ,
గోసరి నేఁ జూడఁ, గారుణ్యవతి తా
మిసిమి పోసఁగఁగ మెల్ల నగు నపుడు :—
మసక మెసకోలిపె నీ విలాసశ్రీ. 1098

9. “ ప్రేమరహితులు వోలె నోండోరులు
సామాన్యదృష్టులన్ జూచు ప్రకృతుల్
కాముకులయందే వెలయఁ గలవు :—
క్షేమ మగు మోహోపగూహనశ్రీన్. 1099

10. “ కమలతోఁ గను, లిరువురవి, చూడ్కి
నెనసికొని యొక్క టగునెడ, వానుడుల్
పోనరు నే ఫలమునున్ లేని వగు :—
మనసిజస్థితిఁ దెలుపఁ గోంకు వాక్ఛ్రీ ”. 1100

111 వ అధికారము [గాంధర్వము]

# సంయోగ ప్రమోదము.

(అ తఁ డు)

1. "కవి, వినియు, ఆని, మూర్కొవి, తాఁకి
యునుఁ, గుడువఁ దగు నైదు విషయములు, నీ
మనోజ్ఞాభరణయందే కలవు :—
ఎనసి తనిసెనె యొకట నింద్రియశ్రీల్ ! 1101

2. "నోవునకుఁ, గతమొండు మం దొండు
నై వెలయు ; సింగారి, తానె కత మౌ
నోవునకుఁ, దానె మందును నయ్యె ! :—
నో వగునె, కత మెదయునెడ విలాశ్రీన్ ? 1102

3. "తాము వలచిన వనిత లలితబా
హాముక్తసంస్థితి వలెన్, సుఖ మొకో,
తామరసలోచనుని లోకంబు ? :—
నోమి శ్రమపడినఁ గద పరసుఖశ్రీ ? 1103

4. "దూర మగునపుడు తాపముఁ గొలుపఁ ;
జేరు నపుడో, జిల్లు మను, నౌర ! యీ
తీరు ని ప్పెందుఁ బడసిన దీమె ? :—
తాఱుమా అయ్యొ లలనానలశ్రీ ! 1104

5. "వేడు కగు తఱిఁ దత్తదర్థముల
పోఁడినే, నవనవానంద కరము లౌఁ
గూడ, సుమభూషితాలక భుజలు ! :—
నేఁడు కౌఁగిటఁ గలిగె నవరుచిశ్రీ. 1105

6. " పొందునవు డెల్ల నుసు తొగిఁ దేఁబు
చందమున నంటుఁ గావున, నబల యా
సుందరికి, నమృతకృతములు బుజలు :
డిందనే, యెడయ సంజీవినీశ్రీ ? 1106

7. " తమ యింటిలో నుండి, తమదు భో
గ్యముఁ బంచి యిడి, కుడుచుటను బోలుఁగా,
రమణి యా శ్యామసుందరి పొందు ! :—
అమరుఁ గద యమరసుఖ మీ నయశ్రీన్ ! 1107

8. " తగులంబు గొను విరువురకు నిమ్మె
యగు, గాలి చొఱఁబాఱు నెడ మేనియున్
పగులుగాఁ బడవి యాలింగనము :—
తెగ కుండుఁ గాక ! మా సమైక్యశ్రీ ! 1108

9. " పొలయలుక కలుగుటయు, చల మెడలి
తెలియుటయుఁ, గలియుటయు, నివ్వి కామం
బెలయువారలు బెరయు ఫలము లగు :—
అలుక రా దస్మదైకమత్యశ్రీన్. 1109

10. " తెలియఁ దెలియఁగ నవార్థములు, మున్
దెలియమివి గనినట్లె, కామం బగున్,
గలియఁ గలియఁగ సుభాషిత యెడను :—
మలుపొందు మఱపించుఁ బ్రాగ్రతిశ్రీన్. 1110

112 వ అధికారము [గాంధర్వము]

# నయము నభినందించుట.

(అ త( డు)

1. " సదతిమృదు భావయుతసుమమ ! మని
యెదు గాక ! అనిచ్చమ ! నీ కంటెనున్
మృదులభావిని మేము వలచినది ! :—
మద ముడుగు మిం(క నీదు మార్దవశ్రీన్ ! 1111

2. " అలరులం గనిన మై దొందెదవె,
తెలివిమాలిన మనస !, యీామె కన్నుల్
పలువురుం గను పూల నెనయు నని ! :—
చెలి, వారులు కనవి, యసదృశదృశశ్రీల్ ! 1112

3. " తలిరు జిగి, ముత్తెములు పళ్లు ; సుర
భిళము నిజపరిమళము, బల్లెములు క
జ్జలనేత్రములు, వేణుభుజవతికి :—
అలివేణి మెయి విషయనిధానశ్రీ. 1113

4. " కను సేవి( గువలయంబులు, సిగ్గు
సను దలలు వంచికొని యిలను జూచున్
" ఘనవిభూషిత కనుల నెనయ " మని :—
విను దిక్కు నిక్కు కలువలకొ హ్రీశ్రీ ? 1114

5. " అనిచ్చపు( బూల(, దొడిమల( దునుమ,
కొనర( దుటిమెనె, కౌను నకు మంగళ
ధ్వను లొనరుపవు కదా వాద్యములు ! :—
మనునె బరు వూని సూక్ష్మమధ్యాశ్రీ ? 1115

6. “ నెలయు, బెడఁగెడు మడఁతి నెమ్మొగముఁ,
దెలియ, కెది యెదియొ వేరౌ టున్ననున్,
నెలవులం గలఁగినవి తారకలు ! :—
నెలఁ గలదె నెలఁతఁ గల యధికతాశ్రీ ?

7. “ అఱిన కళ లోగి నెఱయ వెలుఁగు చం
దురునందు వలెఁ, గలంకం బున్నదో
స్థిరరుచిర మగు మగువ మొగమందు ? :—
మఱచెనే యుడు, లోదయు స్వరూపశ్రీన్ ?

8. “ మగువ నెమ్మొగము వలె నెమ్మెఱుఁగు
నెగడింపఁ గలవేని మా ప్రేమకున్
దగు దీవు ; మనియెదవుగాక, శశి ! :—
జిగ వెలితి నీదు పూర్ణబింబశ్రీన్.

9. “ అలరులం బోలు కను లొప్పు నీ
కలికి మోమును బోల వలతు వేనిన్
బలువురుం గనఁ దోఁచకుము, చంద్ర ! :—
చెలి మొగము నా చూపునకె స్వకశ్రీ.

10. “ అనిచ్చంబును, హంసతూలికయు,
వనిత యడుగుల గ్రుచ్చుకొని వేదనన్
మొనపు, నుచ్చిఁత పండ్ల ముండ్లు వలె :—
కనియుఁ బుంతను నడువ మృదుపదశ్రీల్. ”

113 వ అధికారము [గాంధర్వము]

# గాదిలిపేర్మి వాకొనుట.

(అతఁడు)

1\. "పాలతోఁ దేనె కలియఁగఁ దేరు
మేలి కల వట్టిదే, మృదువాణి యా
గోల తెలిపళ్ల నూరెడు నీరు :—
తేలిచెనె, యధరరస, మది సుధాశ్రీ ॥ 1121

2\. "ఒడలితోడను నుసుఱునకు నేరు
పడున నెటువంటివో, అటువంటి వే,
మడఁతితోడను మాకుఁ బ్రేముడులు :—
ఎడ నైఁచ, దెడల సాహచర్యశ్రీ. 1122

3\. "కఱిగ్రుడ్డునం దున్న పాప ! నీ
వరుగు మటనుండి ; మే మెద వలచు నీ
తిరునుదుటి నెచ్చెలికి లే దెడము :—
ఇర విడినఁ గంటఁ, విరియదు ప్రియాశ్రీ. 1123

4\. "మనుట యుసుఱున కట్టి, దరసి తీ
ర్చిన తొడవులది -కూడు తఱి- ; దానికిన్
మనుఁగు టట్టిది, -వీడు తఱి- ; నాకు :—
అవిశ మగుఁగాక, మా సంగమశ్రీ ! 1124

5\. "స్మరియింతు మఱి నేను, మఱచునెడ—
మఱచు టేమాత్ర మేనియు నెఱుంగన్-
సురుచిర సమరనేత్రి గుణములను :—
అఱిమె నెమ్మది నీమె స్వరూపశ్రీల్". 1125

6. “ కనులలో నుండి వెలువడి పోరు ;
కనుఱెప్ప లొాఱగc, బఱిపఱి గా, రహో ;
అణుభావభాసితులు మా ప్రియులు :—
మన ననువా వారికి మదీక్షణశ్రీ ? 1126

7. “ కనులలో నున్నారు ప్రియు, లగుటc,
గనులc గాటుక నలcదుటయుః మానెదన్,
గనcబడక వారు మఱుపడు టెఱిcగి :—
అనిశమునుc దోcచవలె సుమూర్తిశ్రీ. 1127

8. “ హృదయ సంస్థితులు మాప్రియు, లగుట,
నెదిమైన వేcడితిండివి లోc గొనన్
బెదరుదుము వారు వేcగుట యెఱిcగి :—
పదిలింపc దగిన సుస్వరూపశ్రీ. 1128

9. “ కనుఱెప్పపాటున మఱుం గగుదు
రని యెఱుంగుదు ; వారి నామాత్రకే
యనురాగహీను లను నీ యూరు :—
కునుకుదునె కనక సముఖసుముఖశ్రీన్. 1129

10. “ ముద మొందు మనుచుందు రెదయందు
సదా, మాప్రియులు ; “ విడి మనుచు నున్నా.
రదయాళు ” లను వారి నీ యూరు :—
ఎదురుపడవలెనొా యూరికిc బ్రియశ్రీ ? ” 1130

114 వ అధికారము [గాంధర్వము]

# బిడియము ముడిగి నొడుగుట.

(అ తఁ డు)

1. " కామంబుఁ గుడిచి నొగిలెడువారి
కోమునది, *మట్ట నూరేగుటయె కా
కేమియును లేదు బలవత్తరము :—
కామాతురతఁ, గొఱఁతపఱుతు హ్రీశ్రీన్. 1131

2. " పా టోరువని యొదలు నుసుఱునుం
*దాటిమట్టల గుఱ్ఱ మెక్కి వలపున్
జాటు వీటను, సిగ్గదపి నిలిపి :—
పాటిల్ల దొండె, నిఁక సంగమశ్రీ. 1132

3. " బలుసిగ్గుతో మేల్మగఁటిమి, మున్
గలవాఁడ ; నేఁడు కలవాఁడ నైతిన్
వలపుకాం డ్రెక్కు *మట్టల కట్ట :—
కలవాఁడఁ గావలదె కామితశ్రీన్ ? 1133

4. " కామాతివేగప్రవాహంబు
ప్రామి, కొనిపోవునే, లజ్జయును, మేల్
సోమమును, నాఁబడెడు దోనెలను :—
కామితాప్తియె వేగనిరోధశ్రీ. 1134

5. మాలవలెఁ దొడరు చిటుకడియముల
గోల నా కిడె, *మట్టతోడ, సాయం
కాల ముడికించు కామాతురత :—
తాళి విడఁ, *దాళాశ్వగతి, గతిశ్రీ. 1135

* మట్ట యూరేగింపు వివరము కావ్యాదిని " పరిచయము " నందున్నది.

6. " *మట్టయూరేగింపె నడురేయి
పట్టునను( దలఁతు నెట్టన, తెప్పపా
టొట్టమివి, బేలకై, నా కనుల :—
చట్టనం గొఱ తీర్తు(, గొని *హయగ్రీన్. [సా] 1136

7. " కదలి యంతటి కామతాపమును
గుడిచినను, *మట్ట లెక్కవి పడఁతి య,
ట్లడరు పెన్దగిన పుట్టువె లేదు :—
కదలుకొను స్త్రీకామ మదఁగు హ్రీగ్రీన్ ". 1137

(ల మె)

8. " ఉఱిదిమది యరిది యగు చపల, బహు
కరుణకుం దగిన, దని కనక, కామం
బురక మర్మము మీఱి రచ్చఁ బడు :—
వఱ మీఱఁ దగునె మఱి స్వధర్మగ్రీన్ ? 1138

9. " ఎఱుఁగ రెల్లరు నటంచే యెంచి
దురుసుగా నా కామ మతివేల మై
తెరువులం దిరుగాడు మరు లొంది :—
నెఱవు తప్పితి నేమొ స్వధర్మగ్రీన్ ? 1139

10. " మేము కనులారఁ గన నవ్వుదురు,
ధీమందు, లేము పడుచున్న నొగులున్
దామునుం బడకున్న కతమునను :—
కామబాధకు జాలిపడరె సుగ్రీల్ ? " [బుద్ధులు] 1140

115 వ అధికారము	[గాంధర్వము]

# అపవాద మెఱుకపఱచుట.

(అతఁడు)

1. " అపవాద మెగయంగ నరిదియును
అపసరిల్లక నిలుచు ; దానిఁ బలువుం
డ్రిపు దెఱుంగరు నాదు భాగ్యమున :—
అపవాద మాఁగఁ, నెగయునొ యసుశ్రీ ?	1141

2. " అలరులం బోలు కన్నుల నెలఁత
సులభ కా దని యెఱుఁగ, నపవాదమున్
వెలయించి మా కొదవె నీ యూరు :—
కలిగె నపకృతినె యుపకృతిఫలశ్రీ.	1142

3. " ఉఱవిదో, యూ రెఱిఁగి యగు నింద ?
అరయ, దానిని బెరయ కుండంగనే,
బెరసినటు తోపించు నంతటిది ! :—
సరస మయి యరుస మిదె విరసవాక్ప్రి.	1143

4. " అవ్వవలసను జివ్వనను బైకి
జువ్వరించెను గామ ; మది లేనిచో
ఱు వ్వనుచుఁ గుందు, నైజం బెడసి :—
ఒవ్వ దెనయమి, కామనిజసుఖశ్రీన్.	1144

5. " కళ గలుగు మత్తుఁ గొలిపిన కొలఁదిఁ
గలు ద్రావు వేడ్క వలె, వలపు, వెలియౌ
కొలఁది నపవాదమున, నిమ్మగును :—
అలరు, నల్లరికిఁ దలఁకక, మనశ్శ్రీ. "	1145

6. " కన్నదో, నే వారి, నొక నాఁడె ;
మన్న యయి, యపవాదమో, పరఁగెనే,
పున్నమనెలం బాము కొనినట్లు :—
కన్నదింతురొ పరిణయక్రియా శ్రీన్ ? 1146

7. " ఊరివారల దూ ఱెరువు గాఁగ,
సారెకును మా యమ్మ చీవా ట్లొగిన్
నీరు గాఁగను, నిగుడు ని న్నొగులు :—
పై రీనవలెఁ, బైరచే, ఫలశ్రీన్. 1147

8. " నెయ్యిచే ని ప్పార్తు మను నట్టి,
ది య్యూరివాఁ ఁగడుచేఁ గామమున్
జయ్యనం బోకార్తు మనుకొనుట :—
డయ్య కొఁగి బలిసెఁ గామము మనశ్శ్రీన్. 1148

9. " అగడునకు సిగ్గిలుట నా కుఱునొ,
" బెగడవల '' దన్న వారే, పలువురున్
నెగడ సిగ్గిలఁగ, వీడిన వెనుక ? :—
తెగడ కిఁక మగిడి రాఁ దగుఁ బ్రియశ్రీ. 1149

10. " తాముఁ, గోరిన నేము, కరుణింత్రు
కాముకులు ; మేము కోరిన దూఱు పె
ల్లాముకొన రేఁచెఁ గద ఈ యూరు :—
కామింతు వారి సాహచర్యశ్రీన్ ''. 1150

116 వ అధికారము [ప్రాతివ్రత్యము]

# ఎడబాటు సైఁపమి.

(ఆ మె)

1\. " ఎడయమియె యుండునేనిన్ నాకు
నొడువుఁ; డొందేవి, మీ వే రాకనున్,
మిథుకఁగలవారికే, నొడువుండు :—
ఒడ లుడిగి చనదె మీకయి యసుశ్రీ ? 1151

2\. " ప్రియ మిడెను వారి దర్శనమాత్ర
మయిన నపు; డిపుడో, యెడయిక నంజు పెన్
భయ మిడెను గద కౌఁగిలింతయును ! :—
వియోగావేగ మాఁగునె యసుశ్రీ ? 1152

3\. " అరిది కద నమ్మకము ? నా తెలిఁగు
నెఱుఁగు ప్రియులందును వియోగభావం
బిటికి యొక్కెడ నున్న హేతువున ? :—
అరితిమెయి నెడయ ననిరే ప్రియశ్రీ ! 1153

4\. " నెమ్మిమెయి " నంజవల " దన్నవా,
రెమ్మె నెడ విడిన, నమ్మించు నుడులన్
నమ్మువారికి నుండునో తప్పు ? :—
ఒమ్మకుండుటె తప్పు, వాక్ప్రియాశ్రీల్. 1154

5\. " ఓమునెడ నమరినట్టిఁడు లుడిగి
పోమి నోమవలె; మఱి, వా రెడయుచో
నీ మైె నరిది పునస్సంగమము :—
మామకప్రాణపతి కద ప్రియశ్రీ. 1155

6. " ఎడబాటునుడు లాడు కఠినులౌ
నెడ, నరిది, యట్టివా రిఁకఁ గ్రమ్మఱం
బడి, ప్రియము లాడుదు రనెడు నాస :—
అడియాసఁ గొలిపి యెదయుటో నయశ్రీ ? 1156

7. " దొర తొఱంగిన యమరికను దెలియఁ
బఱచ వొకొ, ముంజేతి మనికట్టునున్
దొఱఁగి జరగుచు నున్న వలయములు ? :—
మఱుపడదె విరహ మంతరంగశ్రీన్ , 1157

8. "ప్రియ మవదు ప్రియవర్గ విరహితం
బయిన యూరున మనికి ; యంతకంటెన్
బ్రియ మవదు ప్రేయసుల విరహంబు :—
ద్వయవిరహితతయు సయిఁచునె మనశ్శ్రీ ? 1158

9. " తాఁకునెడఁ గాల్చినం గాల్చు, నం
తే కావి, కామతాపము వలె, దరిన్
లే కెడయఁ, గాల్చఁగలదో నిప్పు ? : —
కాఁక యదరనె యెదవుపదఁ [illegible]శ్రీ !

10. " అరిదియెద పొదఁబడియు, నెగులు నొగు
లురలిచియు, విరహంబు నోర్చికొనియున్,
మఱి, యుండి మనువారు పలువుంద్రు ! :—
తరమె, మను టట్టి స్థితి నొక సతిశ్రీ ? "

117 వ అధికారము	[ప్రాతివ్రత్యము]

# బెంగచేఁ జిక్కి వగచుట.

(ఆ మె)

1. " మఱుపఱతు మఱి నేను, గాని యీ
విరహవేదనయొ, -తోఁడెడువారికిన్
బొరి నూటనీరు వలె, -మిక్కిలునె ! :—
స్మరియింప కెటులుందు, నా స్మరశ్రీన్ ? 1161

2. " దాఁచుటయు వలను గా కుంటి, నీ
యేచు నోవును ; నో విడినవారికిన్
వాచించఁ బంచుటయు నాన నిడు :—
సైఁచు కొలఁదియు నేఁచెనే మనశ్శ్రీన్ ! 1162

3. " కామాతురతయు, లజ్జామతియుఁ,
దా, ముసుఱు కావడిగ, ప్రేలుకాడున్
నా మోయఁ జాలని యొడలునందు :—
ఈమెయిని మనునె యీ మెయి నసుశ్రీ ? 1163

4. " కామాబ్ధియే యున్నయది నాకు ;
లో మునుంగక దాని నీఁదుటకు నౌ
క్షేమప్లవంబు లే దయ్యెఁ గద ! :—
నే మనను, మునిఁగి, యా గభీరశ్రీన్. 1164

5. " వేరమున మఱియు నె ట్లగుదురో
నేరము కదా, నొగులు వచ్చునట్టుల్
కూరిమితఱిన్ జేయఁగల వారు ! :—
వేఱిమికి నోరిమిం గొన దసుశ్రీ. 1165

6. సుగము కడలియె, కామ మనుభూత
మగునపుడు ; మఱి యద్ది ప్రేఁచునపుడో,
నెగు లకట ! దానికంటెనుఁ బెద్ద :—
సుగవగల కామ, మమృతాస్యదుశ్శ్రీ. [విషము] 1166

7. కామాతివేలవేగము నీఁది
యే మాత్రమును దరివి గాన కుంటిన్ ;
యామినిం గూడ నేనే యుంటి :—
ఏముంటి నొంటిబ్రతుకున క్షమాశ్రీన్ ? 1167

8. మను నుసుఱులను నెల్లఁ గునికించి,
కనికరము గలిగించు నీ రేయియున్
నను వినా లేవి దయ్యేను దోడు :—
కనఁబడక యెడసె, రాత్రికిని, రాట్ప్రి ! 1168

9. గడుసరుల గడుసు కంటెనుఁ, దాము
కడు గడుసు గల వయ్యె, నీ నాళ్లలో
నిడుదలై కడచుచుండిన రేలు ! :—
అడఁగె మును, నా కడఁ దత్కృపాశ్రీ. 1169

10. ఉల్లంబు వలె, వారు గల యెడకుఁ
జెల్లఁ గలిగిన, బాష్పనీరతత మౌ
వెల్లి నీఁదవు కదా నా కనులు :—
వెళ్ల వోచెల్ల, న న్నుడిగి దృక్ఛ్రీల్ ! " 117

118 వ అధికారము [ప్రాతివ్రత్యము]

# దర్శనావేశ దుఃఖము.

(ఆమె)

1. "కనులు తామునుఁ గలఁగు టేమొకో?
తనువడని తాపంబు, తామె వారిన్
గనఁబఱచఁ గద, మేము కాంచినది?:—
అనుతాపమొకొ? కాదు; దిదృక్షశ్రీ! 1171

2. "అరసి తెలియక, వారిఁ గాంచి యే
మఱిన కాటుకకండ్లు, సహ్య మని వే
ఱ్ఱఱచి తెలియక, వగఁ బొగులు టేమి?:—
తరమె కుడువమి స్వకృతదుష్ఫలశ్రీన్? [విషమును]

3. "గ్రద్దనం దామె కని యపుడు, కను,
లుద్దికొని, యిపుడు, తామే యేడ్చునే!
యిద్ది నగఁబడఁ దగిన నైజంబు:—
బుద్ధికొఱఁ బెద్దపఱచెను దృశాశ్రీల్. 1173

4. "చివికి యేడ్చుట కవక, నీ రింక,
మునుకు మసికనులు, తప్పుట కవవి దొ
నవివార్యబాధ నాయెద నిల్పి:—
వనరించువారి కొనరునొ శుభశ్రీ? 1174

5. "పడి కునుకఁ జాలక వనటఁ గుందుఁ,
గడలి చాలని యంత కామాతురం
బడరఁ జేసిన యట్టి నా కనులు:—
అడలె నఁట, పతిని గొట్టిన సతీశ్రీ! 1175

6. సుగము కదలియె, కామ మనుభూత
మగునపుడు ; మఱి యద్ది ప్రేఁచునపుడో,
నెగు లకట ! దానికం టెనుఁ బెద్ద :—
సుగవగల కామ, మమృతాస్యదుశ్శీఘ్రి. [విషము] 1166

7. కామాతివేలవేగము నీఁది
యే మాత్రమును దరివి గాన కుంటిన్ ;
యామినిం గూడ నేనే యుంటి :—
ఏముంటి నొంటిబ్రతుకున క్షమాశ్రీన్ ? 1167

8. మను నుసుఱులను నెల్లఁ గునికించి,
కనికరము గలిగించు నీ రేయియున్
నను వినా లేవి దయ్యేను దోడు :—
కనఁబడక యెడసె, రాత్రికిని, రాట్ప్రి ! 1168

9. గడుసరుల గడుసు కంటెనుఁ, దాము
కడు గడుసు గల వయ్యె, నీ నాళ్లలో
విడుదలై కదచుచుండిన రేలు ! :—
అడఁగె మును, నా కదరఁ దత్కృపాశ్రీ. 1169

10. ఉల్లంబు వలె, వారు గల యెదకుఁ
జెల్లఁ గలిగిన, బాష్పనీరతత మౌ
వెల్లి నీఁదవు కదా నా కనులు :—
వెళ్ల వోచెల్ల, న న్నుడిగి దృక్ఛ్రీల్ ! " 1170

118 వ అధికారము [ప్రాతివ్రత్యము]

# దర్శనావేశ దుఃఖము.

(ఆమె)

1. "కనులు తామునుఁ గలఁగు టేమొకో?
తనువదని తాపంబు, తామె వారివ్
గనఁబఱచఁ గద, మేము కాంచినది?:—
అనుతాపమొకొ? కాదు; దిదృక్షశ్రీ: 1171

2. "అరసి తెలియక, వారిఁ గాంచి యే
మఱిన కాటుకకండ్లు, సహ్య మని వే
ఱ్ఱఱచి తెలియక, వగఁ బొగులు టేమి?:—
తరమె కుడువమి స్వకృతదుష్ఫలశ్రీన్? [విషమును]

3. "గ్రద్దనం దామె కని యపుడు, కను,
లుద్దికొని, యిపుడు, తామే యేడ్చునే!
యిద్ది నగఁబడఁ దగిన నైజంబు:—
బుద్ధికొఱఁ బెద్దపఱచెను దృశాశ్రీల్. 1173

4. "చివికి యేడ్చుట కవక, నీ రింక,
మునుకు మసికనులు, తప్పుట కవవి దౌ
ననివార్యబాధ నాయెడ నిల్పి:—
వనరించువారి కొనరునొ శుభశ్రీ? 1174

5. "పడి కునుకఁ జాలక వనటఁ గుందుఁ,
గడలి చాలని యంత కామాతురం
బడరఁ జేసిన యట్టి నా కనులు:—
అడలె నఁట, పతిని గొట్టిన సతిశ్రీ! 1175

6. “ ఓ ! మఱిమఱియుఁ బ్రియమె, మాకు, నీ
కామాతురతఁ గలుగఁ జేసిన కనుల్
తాము వి వ్వేతలఁ బడి కుందునది :—
తాము చూచిన, రేఁచఁ జనునె హృచ్ఛ్రీన్ ? 1176

7. “ ఉరియ నురియఁగ, నురలి, లోని నీ
రజుఁ గాక ! ము న్నారిమ నోరిమి, వేడ్కన్
మరలుపక, వారిఁ గాంచిన కనుల :—
అరతికొఱకో, అరితిఁ గొల్ప దృక్ఛ్రీల్ ? 1177

8. “ మన నుంచరయె బుజ్జగంబు లా
డినవారు కలరు కద ? అట్టివారిన్
గనకుండ నమఃకుందెనె కనులు ! :—
కినుకఁ గొని కునుక వలదో దృక్ఛ్రీల్ ? 1178

9. “ వారు రానపుడు తూఁగవు, వచ్చి
నా రేనియునుఁ దూఁగ ; వి ట్లా యెడన్
బేరరిది యగు ననరు పడుఁ గనులు :—
తీరి సంకటము, కూరుకునొ దృక్ఛ్రీల్ ? 1179

10. “ గు, ట్టెఱుఁగు, టూరి ప్రజ కరిది కా
దెట్టులును, మము బోంట్ల కొట్టుతమటం
బటి కన్గవవారి, లోఁ గలది :—
మట్టుపడ వియవు గోప్యమును దృక్ఛ్రీల్ ”. 1180

119 వ అధికారము  [ప్రాతివ్రత్యము]

# వెలవెలఁబాఱి విలపించుట.

(ఆమె)

1. " ప్రియుల కెడయిక నొడఁబడితి నపుడు ;
మెయి వివర్ణంబైన నా నైజమున్
సయిఁప కెవరికిఁ జెప్పుకో నిపుడు ? :—
స్వయంకృత, మిది, తీర్తు రెవ రిలాశ్రీన్ ? :— 1181

2. "వారు కలిగించి రను పెరిమెచే,
నారూఢ మయి నాదు మేని మీఁదన్
బాఱు చున్నదియె వెలవెలపాటు ! :—
ప్రేరితమునకునా నామేని స్వశ్రీ ? 1182

3. " చాయయును నానయును వారు కొం
పోయిరి కదా, నాకుఁ గైమాఱుగా
మాయనోవియు వెల్వెలయు నిచ్చి ! :—
ఈ యసమవినిమయ మొకో, నయశ్రీ ? 1183

4. ఉల్లంబునం దలఁతు, మఱి, నేను
జెల్లఁ బల్కుదు వారి సుగుణంబులే :
కల్లతనమో, వేఱొ, వెల్వెల్ల ? :—
ఒ ళ్లలఁతి కాదనియొ, త్రికరణశ్రీన్ ? 1184

5. " అదిగొ, మా ప్రియు లరుగువా రవఁగ,
నిదిగొ, నా మేనియం దంతలోనే
మొదలిడెను వెల్వెల్ల పాఱునది ! :—
కదియుఁ గద రేయి, కదలఁగ నహశ్శ్రీ ? 1185

6. " దీపాస్తమయ మెదురుచూచు నిరు
లే పోలెఁ, బ్రాణేశ సాంగత్యపున్
లోపం బెదురుచూచు వెల్వెల్ల :—
ఏపంచఁ బొంచెఁ, గాంచుచుఁ బ్రియశ్రీన్ ? 1186

7. " కవుఁగిలి బిగించి యుండినదాన,
రవ సడలినా నొకపు, డంతలోనే
తివిచి కొవిన ట్లయ్యె వెల్వెల్ల ! :—
ధవుఁ డెడసె, నిపుడు ద్రింగదె తనుశ్రీన్ ? [కాంతిని]

8. " వెలరువాటిన దీమె, యని నొడిచి
పలుకుదే కాని, " యీమెను దొలఁగి, రో
చెల ! వార " లనువారు లేరయ్యె !
కలుచ నా దొకొ ? కారకులు ప్రియశ్రీ. 1188

9. " వెలరువాటుత ! ఉన్న యటులె నా
బెళుకు, సమ్మతిలఁ జేసిన వారు మేల్
విలువు కలవార లగుదుర యేని :—
సలుపరొకొ, మాట పొలుపునఁ, బ్రియశ్రీ ? 1189

10. " వెలవెలన యవి పేర్వడుట మేలె,
వెలలు నవు దొడఁబఱచినట్టిఁడుల యీ
యలఁచు, బెవ్వరును దూఱర యేని :—
లలితహృదయులు కదా మాప్రియశ్రీ ? " 1190

120 వ అధికారము [ప్రాతివ్రత్యము]

# ప్రత్యేక విరహవ్యథాధిక్యము.

(ఆ మె)

1. " తాము వలచినవారు తము వలచు
ఆమేలుఁ గనువారు, కనువారలే
కామ మను, టెంక యుండని పండు :—
ఈ మందభాగ్యకొకొ తత్ఫలశ్రీ ? 1191

2. మనువారి కొగి మబ్బు కురియు వా
నను బోలుఁ, దము వలచువారలకుఁ, దా
ముసు వలచువా, రొనం నిడు నెనరు !—
మను చెట్టు, కుడు పెడపి చన ఘనశ్రీ ? 1192

3. ప్రియపతులవలనఁ బ్రేమింపఁబడు
దయిత లగు భాగ్యవతులకు నమరుఁగా
వియతసుఖమున మనుదు మను ముదము ! :—
దయయె లే దయిన వారికొ ప్రియశ్రీ ? 1193

4. మెచ్చఁబడు వారు నిల, సుకృతు లవ,
రిచ్చఁ దా మభిలషించినవారి చౌ
మెచ్చుఁ బడయకయె మిడుకుదు రేవి :—
మెచ్చుఁ గొన ; రెడసె నా సుభగతాశ్రీ ! 1194

5. మేము ప్రేమించువారలు మాకు
నేమి ముదమును గలుగఁజేయుదు రొకో
తామునుం బ్రేమించ కున్నపుడు ? :—
కామమున, విడి పడయ, కెటు సుఖశ్రీ ? 1195

6. “ ఒక తలనె యున్నయెడ నుంతయును
సుఖ మవదు, వలపు, కావడిబరువు వో
లిరుగ, నిరుతలల నున్ననె సుకము :—
అకముపా రైతి వలవమిఁ బ్రియశ్రీ.

7. “ వనటచేఁ గుందుటయు, వేఁగుటయుఁ,
గనలేఁ దాకో కాముఁ, దాకరియందే
యువికిఁ గొని చరియించు నాతండు ? :—
మనసిజుం దజుఁ దగునొ, ప్రియమనశ్శ్రీన్ ?

8. “ వలవఁబడువారి యిచ్చకపు మా
టలను బెరయకయె లోకమున మనువా
రలు వోలెఁ గఠినజీవులు లేరు :—
పొలియకే మిడుకు చుంటినె యిలాశ్రీన్ !

9. “ ననుపఁబడు ప్రేయసులు వలవ రై
నను, వారి యెదనుండి యే మాట లై
నను నాలకింప నింపగుఁ జెవికి :—
కనఁబడరు, వినుచరునుఁ గద, ప్రియశ్రీ !

10. “ ఒరిమ లేనట్టిఁడుల కొఱపునో
వెఱఁగింపఁ దలఁచెదవె ! కడలి నడఁచన్
గుఱిని గొనుమా ! మనుమ ! ఓ మనమ ! :- -
సగాఁగదే దయితు హృదయము, దయాశ్రీన్ ! ”

121 వ అధికారము    [పాతివ్రత్యము]

# తలఁచి వారు విలపించుట.

(అతఁడు)

1. "ఉల్లమునఁ దలఁచినను, దీఅని మ
హోల్లాస మొనరఁ జేసెడు కతమునన్,
గల్లు కంటెనుఁ, గామ మిమ్మగును :—
కల్లు కుడిచిన యపుడె కద మదశ్రీ ?    1201

2. "ఏమయిన నింపె కామము ; తాము
ప్రేమించువార లొండొరులఁ దలఁపన్,
బాము వచ్చిన దొకింతయు లేదు :—
సోమొదవుఁ దత్సంగమస్మృతిశ్రీన్"    1202

(ఆమె)

3. "తలఁచువారలు వోలె నుండియును
దలఁపకే యుండినా రొకొ ? తుమ్మ, తా
వెలలునని వోలె నుండియును, జెడు : :—
తలఁచు తటి, మలఁచు మటి యెదొ, హృదిశ్రీన్.    1203

4. "మేము నుందుమొ వారి డెంద మం
దే మూల నైన ? మా డెంద మందో, ?
అముకొవి యున్నవారే వారు :—
రామి వా, రేము లేమినొ మనశ్శ్రీన్ ?    1204

5. "తమ యెదను, మముఁ బోవిడక, రక్ష
ణము సేయువారు, లజ్జింప రొక్కొ,
తమరి, మా యెదను మానవి రాక ? :—
తమయందు వలదొ ధారాళతాశ్రీ ?    1205

6. " వే ఱెక్కతన నేను మనుచుంటి ?
వారితో నేఁ గనిన నాఁటి సుఖ మా
ధారముగఁ దలఁచుటనె మనుచుంటి :—
తేలుచు మరీచికయొ తత్ప్రతిశ్రీ ?

7. " మఱచునెడ దాని, నే మగుదునో ?
మఱ పెఱుంగనిదాన ! ఆ విరహామున్
స్మరణ చేసినను గుండియ మండు ! :—
వెఱవేఁకి లోఁకు వగుఁ దత్ప్రతిశ్రీన్.

8. " ఎంతగాఁ ద మ్మెంచినను గినియ ;
రంత మాత్రమె కాదొకో ప్రేయసుల్
వంత మఱ మాఁడుఁ జేసెదు వంతు ? :—
చింతింతు రొకొ పునస్సంగమశ్రీన్ ?

9. " విలయ మొందును నా ప్రియాసువులు,
తొలి, " వేఱుగాము మన " మన్న జీవే
శుల యురులు లేమి మిక్కిలి తలఁచి :—
తెలుచు మా టయిన ననిపిరె ప్రియశ్రీ ?

10. " విడివడక యుండి, చెల్లిన వారిఁ
దొడరి కన్నులవి నేఁ గాంచఁగాఁ గ్రుం
కుడువడకు ! మను మోయి ! చందురుఁడ ! :—
[illegible] గుసంగమశ్రీ ! "

# స్వప్నస్థితి నుడువుట.

(ఆమె)

1. " వలపుకాం ద్రవిపిన సమాచార
ములతోడ దూత్యమున వచ్చినది యా
కల కేమి చేయుదు నాకో విందు ? :—
కలదె, కలఁ దనుపఁ గల సత్కృతిశ్రీ ? 1211

2. " గండెకను లే వేఁడఁ దూఁగునెడ,
విందుకలఁ, గలయు వారికిఁ, దపివ నే
నుండు వైనమును జాటుదును గద ? :—
మొండికను లొరగ ; వెట స్వప్నసుశ్రీ ? 1212

3. మెలఁకువతటిన్ జేరి లాలనము
సలుపనట్టిఁడులఁ, గల నైనఁ గాంచం
గలుగుటనె నిలుచుండు నా యుసులు :—
మలుకలకు నెడ మిడంగలవె దృక్ఛ్రీల్ ? 1213

4. కలయందుఁ గలుగుఁ గామాసక్తి,
మెలపందు లాలింప కున్నవారిన్
గలయ వెదకుచుఁ దెచ్చి యిడుటకే :—
కలవలనఁ గద నా సహిష్ణుతాశ్రీ ? 1214

5. మెలపందు మును గన్నదియు నపుడె,-
కలయందుఁ గన్నదియుఁ గన్నయపుడే-
లలితమోదాపాదకము లయ్యె :—
తులితానుభూతిఁ గద, నిలుతు భూశ్రీన్. 1215

6. "వే తెక్కతన నేను మనుచుంటి ?
వారితో నేఁ గనిన నాఁటి సుఖ మా
ధారముగఁ దలఁచుటనె మనుచుంటి :—
తేఱుచు మరీచికయొ తత్ప్రతిశ్రీ ? 1206

7. "మఱచునెడ దాని, నే మగుదునో ?
మఱ పెఱుంగనిదాన ! ఈ విరహామున్
స్మరణ చేసినను గుండియ మండు ! :—
వెఱవేఁకి లోఁకు వగుఁ దత్ప్రతిశ్రీన్. 1207

8. "ఎంతగాఁ ద మ్మెంచినను గినియ ;
రంత మాత్రమె కాదొకో ప్రేయసుల్
వంత మఱ మాఱుఁ జేసెదు వంతు ? :—
చింతింతు రొకొ పునస్సంగమశ్రీన్ ? 1208

9. "విలయ మొందును నా ప్రియాసువులు,
తొలి, "వేఱుగాము మన" మన్న జీవే
శుల యురులు లేమి మిక్కిలి తలఁచి :—
తెలుచు మా టయిన ననిచిరె ప్రియశ్రీ ? 1209

10. "విడివడక యుండి, చెల్లిన వారిఁ
దొదరి క న్నులవి నేఁ గాంచఁగాఁ గ్రుం
కుడువడకు ! మను మోయి ! చందురుఁడ ! :—
అడరు బింబమున ద్వత్సంగమశ్రీ !" 1210

122 వ అధికారము [పాతివ్రత్యము]

# స్వప్నస్థితి నుడువుట.

(ఆ మె)

1. " వలపుకాం డ్రనిపిన సమాచార
ములతోడ దూత్యమున వచ్చినది యీ
కల కేమి చేయుదు నాకో విందు ? :—
కలదె, కలఁ దనుపఁ గల సత్కృతిస్త్రీ ? 1211

2. " గండెకను లే వేఁడఁ దూఁగునెడ,
నిందుకలఁ, గలయు వారికిఁ, దప్పి నే
నుందు వైనమును జాటుదును గద ? :—
మొండికను లొరగ ; వెట స్వప్నసుస్త్రీ ? 1212

3. మెలఁకువతటిన్ జేరి లాలనము
సలుపనట్టిఁడులఁ, గల నైనఁ గాంచం
గలుగుటనె నిలుచుండు నా యుసుఱు :—
మలుకలకు నెడ మిడంగలవె దృక్ఛ్రీల్ ? 1213

4. కలయందుఁ గలుగుఁ గామాసక్తి,
మెలపందు లాలింప కున్నవారిన్
గలయ వెదకుచుఁ దెచ్చి యిడుటకే :—
కలవలనఁ గద నా సహిష్ణుతాస్త్రీ ? 1214

5. మెలపందు మును గన్నదియు నపుడె,-
కలయందుఁ గన్నదియుఁ గన్నయపుడే-
లలితమోదాపాదకము లయ్యె :—
తులితానుభూతిఁ గద, నిలుతు భూస్త్రీన్. 1215

6. “ మెలఁకు వనఁబడు నొకటి లే దయినఁ,
గలయందుఁ గలసిమెలసిన ప్రియులు నన్
గలకాలమును వీడ కుండ్రు గద ? :—
కలగలపుఁ గలఁచె మెల, పే నయశ్రీన్ ? 1216

7. “ మేలుకొని యున్నపుడు లీలమెయి
లాలింపనట్టి కఠినులు, స్వప్నమం
దే లొకో మమ్ముఁ బీడించునది ? :—
చాల జాగ్రద్భీరు లభీకశ్రీ ; 1217

8. ‘ తూఁగు కాలమున భుజముల మీఁద
సాగువా రయి, మేలుకొను కాలమం
దేగి యెదలో దాఁగుదురు వేగ :—
ఈ గుప్తరీల నీఁగరొ ప్రియశ్రీ ? 1218

9. “ మెలపు తఱి వచ్చి బహిరంగముగ
లలిని జూపని వారి నొడుతురు, కలన్
వలపుకాండ్రను గనని చేడియలు :—
నెఱి వెఱుంగరు, లేమి ననుభవశ్రీ. 1219

10. “ మెలపందు మమ్ము వా రుడిగి రని
పెలుచ నాడుదురు, కలయందుఁ గాంచం
గలుగ రొకో ? ఊ యూరివా, రకట ! :—
తలమె కన, స్వప్నగుహ్యస్థితిశ్రీన్ ? ” 1220

123 వ అధికారము [పాతివ్రత్యము]

# ప్రొద్దుఁ గని విలపించుట.

(ఆమె)

1\. "సాయమవా ? కా, వకట ! విరహిణుల
యాయురవధిగ, నుసురులను మ్రింగు పెన్
సాయకమ వీవు ! మను మో ప్రొద్దు ! :—
ఆయాస మాయె సాయంతనశ్రీన్. [క్రాంతిచే] 1221

2\. "మునికెదవె ? మనుము ! సందెను మరులు
కొనిన మునిమాపు ! నా తోడు వలెనే
పెనుఁగడిఁది యైనదో నీ తోడు ? :—
అనురక్తి లే కెడసె రక్తిమాశ్రీ ! 1222

3\. "మంచుపొగ తోఁచ వెల్వెలఁబాటుఁ
గొంచు మునిమాపు, నా కెద వెగటుఁ దో
పించు నొగు లొగిని బెరుఁగఁగ, వచ్చు ?—
పొంచె మును, గలుగఁ బ్రియసంగమశ్రీ. 1223

4\. "ప్రేయసులు దఱి లేని యిత్తఱిని
సాయంసమయ మదరి, కొలకలనునన్
వ్రేయు దయలేని పగ వలె, వచ్చు ! :—
సాయ మిదె పూయఁబడెఁ బ్రదోషశ్రీన్. [విషమున]

5\. "మునిరేపునకు నే మొకో యొనరి
చిన మేలు ? -క్రొత్తగానే- నేమొకో
మునిమాపునకు నొసంగితి కీడు ?
చన వారు, మాఱుపడె ద్విసంధ్యాశ్రీల్ ! 1225

6. " సాయంసమయ మీ పగిది నోవు
చేయు నని, సంగమించిన వారు నన్
బాయనవు, దెలుఁగుదానను గాను :—
ఈయకొన నెఱిఁగినం, జనఁ బ్రియశ్రీ. 1226

7. " మునిరేపునందునఁ మొగడించి,
దినమునం దెల్ల రే కెత్తినది యై,
మునిమాపునం దలరు నీ నోవి :—
కనియు, నిసి, నెనయమిం జికిత్సాశ్రీన్. 1227

8. " అనలముం బోలు మునిమాపునకు
మును దూతయై, గొల్లపిల్లఁగ్రో, ల
య్యెను గదా కొల నేయు కొఱముట్టు ? :—
కనలెఁ, గ్రో లూఁద సాయంతనశ్రీ. [విషము] 1228

9. " జనపదము మైకంబు నొంది వే
దన పడును, మది మైక మొందించుచున్
మునిమాపు వలవంత నిడు నపుడు :—
మనసు మన మవిసి ; మునుకును జనశ్రీ ! 1229

10. " ధనభావ మేలు వారివి దలఁచు
కొనఁ, సొగయు నీ సంజెయందు, మాయున్,
మును మాయనిదియైన, నా యుసుఱు :—
చనె గడువు ! స్వస్తీ యొకో ? —అనుఁగు— శ్రీ ! 1230

124 వ అధికారము　　　　[పాతివ్రత్యము]

# అంగ సౌష్ఠవ మఱుంట.

(ల మ)

1. " వలవంత మనసు మిగులఁగ, దూర
తలగతులఁ దలఁచి యేడిచిన కతనన్
సులతాంతములకు సిగ్గిలుఁ గనులు :—
కలఁగి యెద, నీ రొలికి, వెలచె దృక్ఛ్రీన్. [కాంతివి]

2. " వలవఁబడువారు లాలింపమిని
బలుకుఁ గాఁబోలుఁ జూపెడువారికిన్,
వెలరారి నీరు మూరెడు కనులు :—
తలఁపు లోఁచఁగ నియువు లోచనశ్రీల్.　　1232

3. " విడివడిన యమరికను జాఁలఁ దెలి
విడి చేయుఁ గాఁబోలుఁ, గౌగిలింపం
బడిన నాఁ డుబ్బి పొంగిన బుజలు :—
వడిసి క్రుంగెను గదా భుజలతాశ్రీల్ !　　1233

4. " అద రుడిగి, పైడిగాజుల జార్చు,
నొదయు తో పుడిగి, తొల్లిటి సౌజ మౌ
బెడఁగునున్ వాడిన భుజద్వయము :—
గడువు గడపఁగ సడలెఁ గంకణశ్రీ !　　1234

5. " కడిఁదివాఁడల కతింతను నొమగుఁ,
గడియములు సడలి, దొల్లిటి సౌజ మౌ
బెడఁగునున్ వాడిన భుజద్వయము :—
నొడుచు టబ్బురమె యితరులు, ప్రియశ్రీన్ ?　　1235

6. " సడలు తొడవులతోడి భుజయుగళి
వడలఁ, జూపటు వారిఁ గడిఁదివా రన్
నుడు లనఁగ నొచ్చుదును నెగు లొంది :—
విడు పోర్చు ; నొడు పోర్చ టెటు ? మనశ్శ్రీ 1236

7. " పేరిమిం బొంయుదువొ ? హృదయమా !
క్రూరులకు నా వాడు బుజలు కతమొ
నారభటి విన్నపం బొనరించి :—
నేరుపరి ! కొఱలఁ దీరుపఁ, బ్రియశ్రీ ". 1237

(అ ౦ఁ డు)

8. " కౌఁగిలించిన కైల సడలించ
వేగ విన్నం బడెను, బసవిగాజుల్
కైఁ గదురు ముగుద దగు నెన్నుదురు :—
యోగవిరహిత నొసట విపు డఱెె శ్రీ ? [కాంతి] 1238

9. " కవుఁగిలింతకు నెదను జలిగాలి
రవ చొరంబాఱఁగనె వెల్లఁబాఱెన్
నవల సోగ లగు చల్లని కనులు :—
నవయవే వెరవేఁకి నవయవశ్రీల్ ? 1239

10. " కన్నుఁగవ గొన్న విన్నందనమొ
ఖిన్నత్వ మెయిదెనే, చిఱుసడలునన్,
నెన్నుదురు విన్న నైనది కాంచి ! :—
చె న్నడఁగ గొడఁగు సడుగులఁ బ్రియాశ్రీ ? " 1241

125 వ అధికారము [పాతివ్రత్యము]

# హృదయముతో వదరుట.

(ఆమె)

1. " యోచించి యొండు వచియింతువో,
యో చిత్తమా! ఎట్టి యొండయిన, నీ
యేఁచు నోవును దీఱిచెడు మందు ? :—
ఏ చికిత్సయుఁ దోఁచనియదె హ్రీఁశ్రీ ! 1241

2. " గాదిలియె వారు లేనట్టిఁడులు
గాఁ, దమిని నీవె నోయుట దైన్య మౌఁ
గాదె ? యూరక మనుమ ! నా మనమ ! :—
కాదొ ? మిడుకుము, సుహృదునెడ, మనశ్శ్రీ ! 1242

3. " ఉండి, తలఁచుచుఁ, గుందు టెందులకు ?
గుండె ! కరుణించి తలఁచుట, వంతనో
వుండఁజేసిన వాఁరలకు, లేదు :—
కొండ కదలునె ? నీవె, చను ధృతిశ్రీన్ ! 1243

4. " కన్నులను గూడఁ గొని చేరుమీ,
మన్నించి, మనస ! యివి నన్నుం దినున్
గ్రన్ననన్ వారిఁ గాంచుట నెంచి :—
కన్ను లుడుగమి సాకొ ? చనవు, హృచ్ఛ్రీ ! 1244

5. " వెగటొంది రని కై విడుచు టుండఁ
దగునొ, హృదయమ ! మేము ప్రేమింపఁ, దా
మొగిని ప్రేమింప కుండెడు వారి ? .
తగు లొంది, తెగువఁ దెగడుటొ నయశ్రీ ? 1245

6. “ కలిసి లాలించఁ గల ప్రియులఁ గన
నలిగి యెఱుఁగవె ! యిపుడు కల్లమంటన్
గొలిపికొని మందెదవె ! నా మనస ! : —
అలుకఁ బ్రణయింతు, వెటఁ బ్రణయసుశ్రీ ? 1246

7. “ కామమును విడు, మొండె, బిడియపున్
నేమమును విడుము ! సుహృదయమ ! నేనో,
యీ మెయిని దాళలే నీ రెండు :—
ఓమ కుసు, తోమఁ దిగు సతీత్వశ్రీన్ ! 1247

8. “ వగపొంది, వారు లాలింపని
దిగు లొంది, వే అయిన వారి వెనుకన్
దగు లొంది చనెదె, నా పేదమది ! :—
తెగ దొందు నీ మనవి, తన్మనస్ఫూర్తిన్. 1248

9. “ ఉల్ల మందలివారు ప్రియు లవఁగ,
నుల్లమునఁ దలఁచి నీ వెవరిచెంతన్
జెల్లఁ బోయెదవె నా డెందమా ? !—
చెల్లఁబో ! తొట్రుపా టేటు ? హృత్స్ఫూర్తి ! 1249

10. “ చెంతఁ జేరక, తొఱఁగిన వారి
నాంతర్యమున నుంచుకొని యుంటివా,
యింతకు మఱింత విడుతుము బెదఁగు ! :—
నొంతు నంతర్యామి యఁట ప్రియశ్రీ. 1250

126 వ అధికారము    [పాతివ్రత్యము]

# నిలుపుడుగుట.

(ఆమె)

1. "కామపరశువు ఛేదించును స్థైర్య
నామకంబగు- బిడియగడియ తడయై-
లోమర్మ మోమెడు, కవాటమును :—
కామవేగము నాఁగ వశి మనశ్శ్రీన్. 1251

2. "కామ మను నొండు, దాక్షిణ్య మఱి,
నా మానసమును, వ్యాపృతిశూన్య మౌ
యామినిం గూడఁ, బనిగొని యేలు :—
ఏమి ? మనసిజజవము స్వజననీశ్రీన్ ! 1252

3. "మఱుఁగుపఱతును నేనా, కామమును ;
గ్రుఱియించినటు కాక, తుమ్ము వోలెన్,
మఱిమఱియు నడియె, బైటను దోఁచు :—
వెర వెఱుఁగ వలపు నిలుపఁగ మనశ్శ్రీన్. 1253

4. "నిలుపు గలదాన నని, నను, నేనా,
తలఁచుకొను చుంటి ; నా కామమో, లో
పలి మఱుఁగు మీఱి వెల్లడిఁ బడును :—
తలమె కామావరోధము మనశ్శ్రీన్ ? 1254

5. "విసిగించినారి వెనుకనె చనని
పరమయోగ్యత యొంటు, కామపీడన్
బెరయువా, రెఱుఁగునట్టిది కాదు :—
అఱును మానము, కామదష్టహృచ్ఛ్రీన్. 1255

6. " వచ్చుఁ గావుత, నన్నుఁ గొన్నవా
రిచ్చమెయి నొక నాఁడు ; కుడిచెదను మై
నెచ్చు వెల్వెల్లనో వెల్లఁ జెడ :—
అచ్చంపు టమృతౌషధము ప్రియశ్రీ. 1266

7. " పొలయలుకనుం గానఁబఱతు నొకొ ?
లలిఁ గౌఁగిలింతు నొకొ ? కలియుదు నొకో ?
వలచి, కను లట్టి పతి వచ్చునెడ :—
తెలియ నెటు లుందునో, కనఁ బ్రియశ్రీన్. " 1267

(అ ఆఁ డు)

8. " మొనపనిం గలసి, గెలుచును గాక
మనుజపతి ! గృహిణినిం గలసి, ఁహిమై
మునిమాపునకుఁ జేయుదుము విందు :—
అని జాగుపడ, వేగపడు మనస్స్మృ ! 1268

9. " ఒక్క నాఁ దేడు నా ళ్లటు చెల్లు
వీక్క, దూఁగతు లేతెంచు నాళ్లన్
లెక్క యిడి బెంగఁ గొనువాఁలకు :—
చిక్క నొకొ ? దక్క నొకొ ? యిఁకఁ బ్రియాశ్రీ ?

10. " బెఁయునెడ నే మగును ? –మ మ్మెపుడొ–
బెఁసినపు డే మగును ? కలసి యే మొ ?
గరిత యెద పగిలి యుక్కినయపుడు ? :—
అరుగుదుమె ? అఱుగుటకు ముసు బ్రియాశ్రీ ? 1270

# గుఱుతెఱుగఁబఱచుట.

వారు కలిసినపుడు :—(అరఁడు)

1. " దాఁచినను నీవు, నిను మీఱి, మది
నాఁచు టోడఁబడని నీ కాటుకకనుల్
వాచించఁ దగు విషయ మొం డుండు :—
లోఁచ కీవే చెప్పు ! ప్రేయసీశ్రీ ! 1271

2. " కనులు నిండిన సొబగు, వేణువుల
నెనయు బాహువులుఁ, గల యీ పేదకున్
వనితాత్వపూర్ణ భావము మెండు :—
పెనఁగు ననుమానలజ్జలు ప్రియాశ్రీన్. 1272

3. " స్ఫటికమణిమాలలోఁ దెలియఁబడు
చిటినూలు వలె, మదఁతి సోయగములో
స్ఫుట మగుచు నున్న గుఱి యొండుండు :—
తటుకునం దోఁప దది యెదొ, మనశ్శ్రీన్ ! 1273

4. " మొగడ యుబ్బున నున్న దయి, బైటి
కెగయ కుండెడు తావి వలె, ముగుద లే
నగవు టుబ్బున నున్న దొం డుండు :—
నిగదించదే నిగూఢముఁ బ్రియాశ్రీ ! 1274

5. " చేరుగాజుల నెలఁత, శంకించి
తాఱు ; ఆ కల్లగుఱి, గురువేదనన్
దీఱిచెడు మం దొండు కలది యగు :—
తేఱుపదె వేఱుపడ మని, సఖీశ్రీ ? 1275

6. "కడుఁ దాప మార్చి ప్రియ మొదవ ముద
మిడెడు కలయిక, యరిదిఁ గావించి ప్రే
ముడి తేమి గుఱికొనుట కల దయ్యో! :—
ఎడయుటకొ మఱలఁ జేరుట ప్రియశ్రీ? 1276

7. "చల్లనగు దొరవారి వే అయిన
యుల్లంపు టమరికను, పాకంబెనున్
దొల్లిగనె తెలిసికొనె వలయములు :—
కల్లకలయిక నిఱిసె మద్భుజశ్రీ. 1277

8. "నిన్ననే చవిరి నాప్రియు, లయినఁ,
గన్న దేమును నేడు నాఁడు లయ్యెన్
జెన్నఱుట, యొగి మేని వెలరారి :—
ఇన్నెలవునన్ విడుటొ ప్రియనయశ్రీ?" 1278

(అతఁడు)

9. "ముదియ యొఁగిఁ దన గాజులను జూచి,
మృదు భుజలఁ జూచి, యడుగులఁజూచి, -బౌ
నదియె గుఱి-యట్లామె చేసినది :—
స్వదయితానుగతి లక్షితార్థశ్రీ. 1271

10. "భామాత్వమునయందు నుత్కృష్ట
భామాత్వయుత మంద్రు, కనుచూపుచేఁ
గామాతురతఁ దెల్పి వేఁడునది :—
ఏ మాడ్కి మనుదు విడి సహచరీశ్రీన్?" 1280

# సంగమావేగము.

(ఆమె)

1. " ఉల్ల మెంచఁగ, ముదముఁ గొలుపుటయు,
కళ్ల కాంచఁగ, మదముఁ గొలుపుటయునున్
గల్లునకు లేవు ; వలపున కుండు :—
ఒళ్ల సొగపున సుగము కామసుశ్రీన్. 1281

2. " జొన్న పాటియును నలుగమి వలయు,
నన్నువ మదిని, దాటి పాటియును, మే
కొన్న కామము, మెండుకొను నెడల :—
ఖిన్నయగు నొందె, రతి చెడి సతిశ్రీ. 1282

3. " ననుచకే నాపట్ల, విచ్చగిం
చినవే యొనర్చినను, బ్రాణేశ్వరున్
గనక యమంవు గదా నా కనులు ? :—
కినుక యెటు లునికిఁ గొను మనశ్శ్రీన్ ? 1283

4. " పొలయలుక యంపె చెల్లితిఁ గాని,
చెలి ! యద్ది మఱచి, కలయిక యందునన్
మలసి చెల్లినది కద, నా మనసు ! :—
తలఁపుతోఁ జెల్లెఁ బరవశతనుశ్రీ. 1284

5. " అలఁదు కాలమునఁ గాటుకపుల్ల
నలుపుఁ గాంచవి కన్నుపలె, మగని త
ప్పులఁ గాంచలే నెదుటఁ గన్నయెడ :—
అలుక చెడు కులుకు నిడు, దర్శనశ్రీ. 1285

“ కాంచు తఱిఁ, బ్రేయసులఁ, గాంచలే
నెంచఁ దప్పైన యవి ; కాంచని తఱిన్
గాంచలేనునుఁ దప్పు కావియవి :—
మంచిలో ముంచుఁ దద్దర్శనశ్రీ. 1286

7. “ కానిపోవు నని యెఱిఁగియును వెల్లి
వను దుముకువారు వలెఁ, బొల్లగుఁగదా
యవి యెఱిఁగియును నేటికాకో యలిగి ? :—
కావిపోవు దృష్టివేగము మనశ్శ్రీన్. 1287

8. “ ఒల్లగిలు నహితము లొనర్చినను,
ఒల్లెఱుంగవి మత్తులకు మఱియునున్
గల్లల్లె, కల్లరీ ! నీ రొమ్ము ! :—
ఒల్లమిం గొలుప దవురా ! యురశ్శ్రీ ! 1288

(అతఁడు)

9. “ అలరుకంటెనుఁ గోమలము కామ ;
మిలలోనఁ గొందఱే దాని యిమ్మొ
ఫల మొరిమఁ బడయఁగూడెదువారు :—
అలుగునెడఁ గలుగునే తత్ఫలశ్రీ ? 1289

10. “ కనుచూపునం గనలియే, కలం
గెను లలన, కలయికను నాకంటెనున్
మొనకట్టి తానె మును వేగపడి :—
కినుక కలఁగదె సంగమత్వరాశ్రీన్ ? 1290

130 వ అధికారము [పాతివ్రత్యము]

# హృదయముతో విరసించుట.

(ఆ మె)

1. " వారి హృదయంబు వారికె యగుటఁ
దేఱఁ గాంచియు, నేల, నో హృదయమా,
వేఱుపడి, నీవు మా కవకుంట? :—
మీఱి మమ్మెంచునొకొ వారిహృచ్ఛ్రీ? 1291

2. " అఱితి లేనట్టివారినిఁ గన్న
తఱియందునున్ వారి, నలుగ రంచున్
మురిసి, చేరుదువు నా హృదయమా? :—
పరిచయపు మోమోట మురదు హృచ్ఛ్రీ! 1292

3. " చెడినవారికిఁ జెలులె యుండ" రని
యెడు నదో కతము, మతి! నీ వపేక్షన్
బడినట్లె వారి వెనుకలఁ జెల్ల? :—
" చెడె బెంగ" నవి జాలి పడవె హృచ్ఛ్రీ! 1293

4. " ఇఁక నట్టి విషయముల నీతోడ
నొకట యోచించు వా రెవరు మనసా?
వికృతి నలిగియుఁ, గుడువ వైతి మతీ :—
ఒక పెన్ని, యొకటి పన్నుటొ క్రమశ్రీ? 1294

5. " బెరయమికి నంజు, -నెడసిన ప్రియుని-
బెరసినను విరహమున కంజు; నకటా!
అఱవి యిడుమకె యెడము, నాయెడఁద! :—
స్థిరతత్పరత కిదియొ ప్రతిఫలశ్రీ? 1295

6. " వేఱుపడి యుండి తలపోయు తఱి
వారి కరకరుల, నసుఁ గొఱకొఱలతో
గీఱి తిని నటు లుండె నా గుండె ! :—
మాఱెనే, మగనిఁ గనఁగనె, మనశ్శ్రీ ! 1296

7. " నాననును మఱచితిని, వారి నెపు
డేని మఱవఁగ లేని, నాదు మహిమా
హీన మగు, మూఢమతిఁ బట్టువడి :—
కానఁబడఁ దఱియుటయొ ప్రౌఢిమశ్రీ ? 1297

8. " ఎల్లిదము చేసినం జెడు గగును
జెల్ల దని, వారి చరితలఁ దలఁచుఁ దా
నెల్లపుడు, నుసుఱు వలచెడు నెడఁద :—
ఉల్లమును నోము మానప్రాణశ్రీల్. 1298

(ఒమెయు, అతఁడును, ఎమలో)

9. " చింత కొరు లెవరె తో డగువారు ?
స్వాంతరాశమునఁ దా మూనినది యా
సొంత దెందమె తోడు గానియెడ :—
గంతు లిడి చేరెఁ గాంతాంతరశ్రీన్ ! 1299

10. " ఎల్లిదమె తమవారు కామి యొరు,
లెల్లపుడునుం దాము పూనినది యా
నుల్లమే తమది కా కున్నపుడు :—
చెల్లి పెఱకూర్మిఁ గొనె మన్మనశ్శ్రీ ! 1300

# పొ ల యు లు క.

(ఆమె)

1. "చెల్లి, కూడక యుండి, బొలయలుక
వెల్లడింపుము ; వారు పడుచున్న దొ
అల్లాట నోవుఁ గాంతము సుంత :—
ఎల్లిదం బిపుడె చేరినఁ బ్రియశ్రీన్. 1301

2. "ఉప్పమరి నట్టులుగ, భోగ్యమున,
నొప్పుఁ బొలయలుక ; అది సుంత హెచ్చొ
నప్పగిది నగు, దాని నిగుడుచుట :—
దెప్పరం బెదియుఁ, జెఱచిన రసశ్రీన్. 1302

(సామాయమై, అతఁడు విన, ఆమె)

3. "అలఁదురిన వారలను మఱిమఱియు
నలఁత చేయుటఁ బోలుఁ, దమ్మలుగు వా
రలను లాలించి యలమక విడుట :
అలఁతిఁ బెఱ వలఁతి నలఁచుటొ నయశ్రీ ? 1303

4. "అలిగినాపెను నరితిమెయి నిమిరి
తెలుచ కుండుట, వాడి యున్న వల్లిన్
జల మిడక, మొదలు నఱకిన యట్లె :—
మలఁగి లాలించు టామెను, నయశ్రీ." 1304

(అతఁడు తనలో)

5. "గుణయోగ్యసత్పురుషులకు సొంపు,
ప్రణయకోపప్రకృతియే, స్వీయ లొ
వనజసుమసమనేత్ర లందలిది : —
ప్రణయినీకోపశృంగార మిదు శ్రీన్ [శోభను] 1305

6. " కినుకయునుఁ బొలయలుకయును లేవ
యిన దేవిఁ, గామంబు, కుడిచెడు నెడన్,
కివిసిన ఫలంబుఁ, గసురునుఁ, బోలు :—
అనుభావ్య నూత్నరసమున రుచిశ్రీ ? 1306

7. " పొలయలుకవలననే నుండు నొక
కలవరము " సంయోగభోగ మిటుపై
వెలయ విగుడునది కా దొక్కొ " యని :—
కలసిమెలసిననె నెమ్మది ముదశ్రీ." 1307

(అతఁ డామె విన గొణఁగుకొనుట.)

8. " నో వొందునది యెందు కొక్కొ, మఱి,
నో వొంది రవి, దావి నెఱిఁగి, తేఁపన్
భావించు ప్రేయసులు లేవియెద ? :—
నోవె మిగులగుఁ, బోవఁ బ్రియత్వశ్రీ. 1308

9. " నీరంబు నీడయందలిదె ప్రియ
మూరించు ; గోపమును బ్రణయయుతులొ
వారియందలిదె ప్రియ మూరించు :—
తీఱ దుడు, కుడుగ శీత ప్రీతిశ్రీల్. 1309

10. " పొలయలుక వాడఁగా విడి యుండఁ
గలవారితోడ, నా హృదయం బొగిన్,
గలియఁగల మనుకొనుట పేరాస :—
తెలియఁబడవే, కలియు సూచనాశ్రీల్ !" 1310

132 వ అధికారము [పాతివ్రత్యము]

# పొలయలుక యలుకన.

(ఆమె)

1\. " నారిప్రకృతివార లెల్లఁ గ
న్నార సాధారణముగాఁ గుడుతురే !
చేరను, బరాత్వయుత ! నీ ఱొమ్మ :—
నారులకు వలదె హ్రీసుశీలశ్రీల్ ? 1311

2\. " కౌఱకౌఱన్ మిన్న కుంటివి గాఁగ,
మఱపింపఁ దుమ్మినా, రేము తమ్మున్
" చిరజీవి " యంచు వాకొందు మని :—
ఉర కున్నవారి రేఁచుటొ నయశ్రీ ? 1312

(అతఁడు)

3\. " రెమ్మపూదండనుం దొడిగిననుఁ
గొమ్మ కనలును, " మఱొకతెనుగూర్చియే
యెమ్మెఁ జూపంగఁ దొడిగితి " రంచు :—
నమ్మ యెమ్మెయి నెమ్మిఁ గనుఁ బ్రియాశ్రీ ? 1313

4\. " ఎవరికంటెనుం బ్రేమింతు " నని
వివరించితివి గాఁగఁ, గినిసె నవలా
" యెవరికంటెను నెవరికంటె ? " నని :—
తివిరి వికటార్థ మెత్తుటొ నయశ్రీ ? 1314

5\. " ఈ మేని పుట్టువున వేర్పడం
టొ " మన్న మాట వాకొంటిఁ, గాఁగా,
లేమ కన్నులు చెరయ నీరుఁ గొనె :—
" పై మెయులఁ గూడ " మనొ తదర్థశ్రీ ? 1315

6. " స్మరియించినా " నంటి; మఱి, " నన్ను
మఱచితిరి " యంచు, ననుఁ గౌగిలింపన్
దఱియునదియే, మాని, కినిసినది :—
మఱచి, తలఁచితి నంచుఁ గొనెఁ బ్రియాశ్రీ ! 1316

7. " దీవించినది తుమ్మితివి గాఁగ ;
ఆవలనె యాఁగి విలపించె నవలా,
" యేవారు తలఁచి తుమ్మితిరి ? " యని :—
భావించు లేని తప్పులఁ బ్రియాశ్రీ ! 1317

8. " తు మ్మఁడఁచికొనినను విలపించె,
" మిమ్ము మీవారు స్మరియించుకొనుటన్
మమ్ముఁ గననియక దాఁచితిరొ ? " యని :—
తుమ్ముకత మితర మెఱుఁగదొ ప్రియాశ్రీ ? 1318

9. తన్ను వినయమునఁ దేర్చుటకుఁ బై
కొన్ననుం గనలుఁ " బెఱవారికిని మీ
రి వ్విసర్గమువారె యగుదు " రని :—
మన్నమతకునుఁ గినిసెనె సతీశ్రీ ! 1319

10. " తన యంగరుచి నెంచి, యుఁటకుండి,
కనినను గనలు " నెల్లను మీర లే
వనిత నెదఁ దలఁచి కాంచితిరి ? " యని :—
అణు వగముగా నీను పడుఁ బ్రియాశ్రీ ! 1320

# పొలయులుక యులరు.

(అ మె)

లేదు దోసము వారియెడ ; నైన
నూఁదఁ గలిగించి యలిగించఁ గలుగున్
మా దయితు లరితి లాలించు వగ :—
రాదొ కొఱకొఱ, లేదు లాలనశ్రీ ! 1321

చిఱచిఱం దోఁచు చిఱునొగులుచే,
వరుల మే లరితి, వాడిననుఁ, బిదపన్
మఱి మఱియు బలుపేరిమిని బెరయు :—
వఱలు నపు దపూర్వానుభోగశ్రీ. 1322

పొలయలుక కంటె స్వర్గము కలదొ,
యిలతోడ జల మెలసి సమరసం బౌ
లలి నమరువారియెడఁ జూపునెడ ? :—
కొలుపు నది కలపుమెలపుల సుఖశ్రీన్. 1323

పొందు విడమికి హేతు వగు నలుక
యందునం దోఁచును దటాలుననును, నా
డెందంబు నోడించు నాయుధము :—
డిందుఁ గ్రుధ, లాలనజలాలసాశ్రీన్. 1324

(అ తఁ డు)

దోస ముండనివా రయిననుఁ, దా
మాసించు వారి మృదుభుజ లెడవు గా,
నీసుచే, నపు డొక్క యిం పొనరు :—
వాసి యగు పొం, దనంతరఫలశ్రీ. 1325

6. తినుట కంటెనుఁ, దిన్న దఱుగుటయె
తనువునకు వి మ్మగును ; గామమునకో,
పొనరు కంటెనుఁ గనలె యి మ్మగును :—
అనుభావ్య మగుఁ బిదప సుభోగశ్రీ. 1326

7. పొలయలుకయందు నోడిన వారె
గెలు పొందినట్టివా ; రది పిదప నౌ
కలయికం బ్రత్యక్షముగఁ దెలియు :—
పొలుచు వారికె, యధికసమ్మదశ్రీ. 1327

8. పొంఁతి పొలయలుకఁ గొని, మఱి బెరయఁ
గల మొకో, నెన్నుదురు చెమ్మరింపన్
గలయికం దోఁచిన నెఱాచవివి ? :—
కలుగదే యలుగదే, నతిరతిశ్రీ ! 1328

9. ప్రణయకోపముఁ జూపుఁ గాక ! మఱి,
మినుకుతొడవుల వెలఁది ; మేము వేఁడన్,
మొనర విగుడును గాక ! మఱి రేయి :—
ప్రణయకోపోపరతి, ప్రణయనుశ్రీన్. [సాధనమున] 1329

10. పొలయలుక కామమున కిమ్ము ; అ
పొలయలుక కిమ్ము, మితిఁ దెలిసి, యొరిమన్
గలిసి రమియింపఁగాఁ బొరయునెడ :—
కలసిమెలయుత మిల సతిపతిశ్రీల్ ! 1330

కామవర్గము సంపూర్ణము.

శ్రీపదులు సమాప్తము.

ఓం తత్సత్.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 16 | 10 | చౌటివేలను | చౌటినేలను |
| 20 | 16 | శ్రీ | శ్రీ |
| 20 | 19 | వంటిదె | వంటిదే |
| 22 | 19 | ప్రాచితమును | ప్రాచితమును |
| 24 | 1 | సే | నే |
| 39 | 14 | చెడు | సెడు |
| 45 | 15 | సేవి | నేవి |
| 46 | 2 | వలయునదె | వలయు ; నదె |
| 47 | 21 | దైన్యముమ | దైన్యమును |
| 47 | 21 | నొండనుర | నొండమర |
| 53 | 7 | తద్వపుశ్రీన్ | తద్వపుశ్శ్రీన్ |
| 66 | 20 | మహిఁసా | మహింసా |
| 69 | 2 | వ్రతభాగము | జ్ఞాన భాగము |
| 73 | 2 | వ్రతభాగము | జ్ఞానభాగము |
| 74 | 2 | మంచిధర్మము | మంచి ధర్మము |
| 124 | 14 | యొక్కనికిఁదన్ | యొక్కవిదియా |
| 137 | 14 | విస్తారిసమువ | విస్తారిసమున |
| 142 | 10 | గవి, తన్ | గనుచున్ |
| 143 | 28 | మును సభాసదశ్రీన్ | సభాసదుల వాక్ప్రిన్ |
| 149 | 17 | ముటు | ముట్టు |
| 150 | 16 | రణీవీర | రణవీర |
| 155 | 17 | తన్ | తా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 159 | 15 | వనపు | వగపు |
| 167 | 7 | 581 | 831 |
| 171 | 6 | మీఱుఁగ | మీఱంగ |
| 190 | 8 | వపుశ్రీన్ | వపుశ్శ్రీన్ |
| 190 | 12 | వపుశ్రీ | వపుశ్శ్రీ |
| 191 | 2 | 86 వ | 96 వ |
| 200 | 3 | పీక | పీఁక |
| 202 | 17 | ఔదార్యమతులగు | ఔదార్య యుక్తులగు |
| 216 | 12 | తలఁపవద్యశ్రీన్. | తలఁ పవద్యాశ్రీన్ |
| 218 | 8 | హృదిశ్రీ | మతిశ్రీ |
| 219 | 9 | నను, గనుఁగొనెడు | ననుఁ గనుఁగొనెడు |
| 220 | 4 | హృదిశ్రీ | మతిశ్రీ |
| 220 | 8 | హృదిశ్రీ | మతిశ్రీ |
| 223 | 12 | దృశశ్రీల్ | దృశాశ్రీల్ |
| 226 | (పుట సంఖ్య క్రింద) | | (ఆమె) |
| 228 | 4 | (సా) | (సాధనమును) |
| 230 | (పుట సంఖ్య క్రింద) | | (ఆమె) |
| 231, 233, 235,237,239. | 2 | ప్రాతివ్రత్యము | పాతివ్రత్యము |
| 232 | 16 | యడరనె | యడరెనె |
| 244 | 16 | నెఱవెఱుంగరు | నెళ వెఱుంగరు |
| 256 | (పుట సంఖ్య క్రింద) | | (ఆమె) |
| 256 | 16 | 1271 | 1279 |

# SRIPADULU




POST-SCRIPT *(Author)*

LETTERS/OPINIONS *(Savants & Journal)*

అభిప్రాయములు (పండిత/పత్రికలు)

ఒక విన్నపము (కావ్యకర్త)

parent, so that the original could be seen through. Although some Telugu verses are somewhat terse mainly for the above reasons, should my aims be found successful, I should feel gratified at my attempt. In this connection, I would quote

an excerpt from Dr. P. V. Rajamannar's opinion which reads : "I am sure this new translation of Kural into Telugu will act as another step towards the goal of national integration", and from Mr. Rallapalli Ananthakrishna Sarma's opinion which, translated in English, reads : "This is a fine and talented composition which prompts that the original must, however, be read."

Many of the Kurals, like superstructures on invisible foundations, have certain fundamental points which do not readily disclose themselves in the bare text. The ten verses of each chapter may be assorted and grouped under sub-subject headings, as I had done in my book "Sri Bhagavadgita Gitalu".

The Kurals, being mostly unprosaic, curt and crisp, do not radically and readily yield to one's understanding, unless one reads between the lines, and adopts a few other suitable words to soften them and adapt correct and full meaning with the aid of an expert-commentary. About ten commentaries were written to Tirukkurral, and recently, "**Bharata Ratna**" Sri C. **Rajagopalachari** has also been publishing his commentary in Tamil. Even in this edition of Sripadulu, a commentary or at least a glossory may be felt wanting, but an attempt at one such is left for future fulfilment.

The first three lines of the Telugu verses in this book do not merely represent an adoption of the bare ideas of the Kurals. As such adoption lacks the force, fullness, diversity and dignity of the original, I have attempted at direct translation literally with close sequence of words and modes of expression true to the original, and liberally with interpolated complementary words here and there, which

are essentially explanatory and not expletive. Thus, the first three lines represent a literal-cum-liberal translation; while the fourth line present my own volition of pertinently and impliedly hinting the themes underlying the previous three lines, or additional ideas.

Short Telugu verse couplets are inadeqate for a close and exact rendering of the Kural couplets. Although triplets (rare in Telugu Prosody) are ample, the sentiment of evenness and other reasons, including fuller exposition of the theme of each verse, induced me to supplement the fourth lines compulsorily ending with the auspicious word "Sri" which has several meanings.

This book is entitled as "SRI–PADULU" particularly because the word SRI conveys also the meaning: "Trio (Tri-varga) of Righteousness, Economics and Love", (the three-canto-contents of Tirukkural), and PADULU means (*a*) "Tens" in Telugu (each chapter deals on a subject in ten verses) and (*b*) "Lines having "Sri" emblems, etc." in Sanskrit, vide the Introduction.

The above procedure is peradventure, unprecedented in literature; but I took the liberty of causing it, as well as the new metrical medium of PANCHAKSHARA-MALIKA in which this ethical lyric poetry runs, concurrently with Tirukkural and with natural liberty.

In fact, I translated 630 Kurals first, in metric stanzas of about four varieties of time-measures (Talas) without supplements, and on a retrospective review thereof, I was quite dis-satisfied because they did not appear lively, althought they carried the bare meaning. Hence, in a desparate mood, I destroyed them and pondered over whether

'to do or not to do' and 'how to do'. One fine evening, while squatting still in a wavering mood in the Temple of the Divine Poet, Saint Tiruvalluva Nayanar, at Mylapore, I was intuitionally prompted to start afresh and progress on the lines on which this work proceeded since. It appeared as though there was a vision of, and an encouragement from the Divine Poet.

In fine, I must apolgize reverentially to the Divine Poet Saint Tiruvalluva Nayanar's great Spirit, which prevailed upon me to fulfil this enterprise. and to the readers, for my having thoughtlessly omitted to mention the above in the Telugu Introduction to this book.

Madras
27-4-1967

**S. Sripaty Sastry,**
*Author*

**H. E., Dr. S Radhakrishnan,**
President of India.

Rashtrapati Bhavan,
NEW DELHI-4.
*May 26, 1966.*

Dear Sri Sonty Sripaty Sastrygaru,

Thank you for your letter of the 24th of May and the copy of "Sripadulu", your Telugu translatian of "Tirukkural". I have got the book. I have seen it also. It is not necessary to have any formal or informal ceremony for the purpose.

*You have done a useful piece of work.*

With all good wishes,

Yours sincerely,

**S. Radhakrishnan.**

**H. E., Sri M. Ananthasayanam Ayyangar,**
Governor of Bihar.

Camp — RANCHI,
*July 10, 1966.*

Dear Sri Sripaty Sastry,

Thank you for having sent me a copy of the "*Sripadulu*", your rendering into Telugu verses of '*Tirukkural*'. The aphorisms in Tirukkural are terse and it is not easy for a lay man to understand the same. ***It is more difficult to render it into Telugu or any other language and more so into verse. I am glad that you have tried to bring out the original meaning as much as possible.*** Some others also have rendered Tirukkural into Telugu verses. I congratulate you on having undertaken a difficult task.

With kind regards,

**Yours sincerely,**

**M. Ananthasayanam Ayyangar.**

**Dr. P. V. Rajamannar,** D.LITT., L.L.D.,
Chief Justice of Madras (Retired) M. L. C.

9, Victoria Crescent Road,
MADRAS-8.

*June 14, 1966.*

I am sure this new translation of Kural into Telugu — Sripadulu—will act as another step towards the goal of national integration. There are certain special features of this translation. The translator has used a new metric form in which each verse consists of four feet, three of which contain a *faithfull rendering of each Kural,* and the fourth is in the nature of a summary or commentary. Shri Sripaty Sastry, who possesses an excellent knoweledge of both Tamil and Telugu, is also endowed with a poetic talent. I commend his enterprise. I hope Shri Sripaty Sastry will translate other great Tamil Classics into Telugu.

**P. V. Rajamannar.**

**Sri T. P. Meenakshisundaran,**
Vice-Chancellor, Madurai University.

University Buildings,
MADURAI-2.

Sri S. Sripaty Sastry has given me the opportunity of going through his interesting book "*Sripadulu*", a translation in Telugu of the great Tamil classic, *Thirukkural,* by Saint Thiruvalluvar. I have seen a few other translations in Telugu. But *this translation is simple and to the point,* though it is not possible for any one to bring the full force of the original in any translation however great it be. *This translation is true to the original without any unnecessary additions for making up the metre. He translates the two lines of every Kural into three lines of his verses. The fourth line is an addition by the Auther trying to give the central idea.* This last line always ends in "*Sri*". I hope this will be popular among the Telugu public.

**T. P. Meenakshisundaran.**

Ashtavadhani, Vidwan,

**Sri A. Subbaraya Gupta,**
M.A ,B,O.L.,B.Ed.,

Retired Lecturer, Research
Scholar and Author.

*Salem—7.*
*21—2—67.*

Dear Sri Sripaty Sastry garu, Namasthe

This is to acknowledge with thanks the receipt of your **"Sripadulu" striking a singularly original note in its metre as well as its interpretation which is certainly admirable, though a bit prolix.** But you could have with greater felicity and facility reached both the Andhra classes and masses, if you had done it in "Ataveladi" metre, for our Telugu maxims and aphorisms, especially of Vemana have been mostly couched in "Ataveladis" and our Andhras find them more readable and understandable as well as more rememberable than any other metre

Sri Kanuparti Venkatarama Vidyananda, who was the first translator of Tirakkural, rendered it in Telugu Kandam metre in last century, while Sri Putalapattu Sriramulu Reddi's rendering of this century is in "Dvipada" metre, but both are terse in language and pointed in import, though not so well as the original. You seem to have attempted to achieve both the terseness in language and pointedness in import. I think *you have fairly well succeeded in your attempt*

Yours Sincerely,

**A. S. Gupta.**

THE SUNDAY STANDARD—July 3rd, 1966

"Kural in Telugu"—SRIPADULU

This is a Telugu poetical translation of "Kural" in the metrical medium of "Panchakshara Malika". The first three lines of each verse are a faithful metrical rendering of the original. The last line is the translator's summary of the substance of the preceding three lines. **The translation is sound and sensitive. The secret of the author's success lies in his mastery of Tamil & Telugu**

Mr. Sripathy Sastry has rendered, a service to the Telugu public by bringing out this poetical version.

THE WEEKLY MAIL—July 9th, 1966.

Sripadulu is a rendering of Tirukkural into Telugu in verse. **The author has taken great pains to bring out the correct meaning of the Kural stanzas in Telugu.** However, the style of the Telugu verses is rather tough.

THE "HINDU" 9—7—1966.

**Sri Padulu**

This is Tirukkural in Telugu. The importance of Tirukkural in world literature cannot be over-estimated. Belong-

ing to one of the oldest languages of the world, it is at once a book on morals and pure poetry. Its antiquity gives it all the more glory and to-day it is acclaimed as a universal book daily inspiring translations in all the important world languages. Teaching a moral is the ideal of Indian literature and all other advantages are only incidental. Rajaniti, Lokaniti, Grihaniti and Sadachara are all found as subjects of many minor chapters in the Mahabharata, Srimad Bhagavata and Ramayana. Separate books also came later into vogue like Kamandaka, Panchatantra and Hitopadesa.

This kind of teaching found its earliest and full analytical expression in Tiruvalluvar's Tirukkural, which broadly, under the heads of Dharma, Artha and Kama, gives every Indian in a nut shell maxims of conduct for both day to day life as well as for life-long practice. The seer has no chapter on Moksha, but it is perhaps understood that when man perfects his way of life by these three ways, Moksha automatically follows. These maxims are so universal that they do not attach themselves to any religion or people in particular and the mystery over the caste of the author adds to the merits of its casteless and creedless character.

The present translation, though not the first in Telugu, is welcome in many respects as it does not merely translate the original. *True to the tradition of ancient Telugu poets like Nannaya and Tikkana, the author follows the free and explanatory way adding his own comment or explanation in the last line.* While rendering the two lines of the Kural in Telugu he completes the translation within the first three lines and in the fourth gives his own comment ending with the auspicious letter "Sree." The translator also follows a new metre,his own creation, called "Panchaksharamalika" of

64 mantras. *The translation is true to the original, but the words chosen and the manner of expression have made it somewhat terse. Pure Telugu words (Achcha Telugu) are used more frequently than Sanskrit* and average readers cannot understand the text without the help of some language expert. In general, *the translation is ably done* and is an excellent help to the Andhras to understand the great Tiruvalluvar.

**Vedam Venkataraya Sastry.**

# అ భి ప్రా య ము లు

## "బాలవ్యాస", "మహోపాధ్యాయ" శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పీఠికాపురము, 23-6-1966.

"శ్రీపదులు" అను ఈ గ్రంథమును రచించిన "పత్త్రి విహంస" శ్రీ కొంతి శ్రీపతి శాస్త్రిగారు, పండితులును, కీర్తిశేషులును అగు కొంతి భద్రాద్రి రామశాస్త్రులవారి కుమారులు. పీఠికాపురము అభిజనముగా గలవారు. ద్రావిడ భాషలో "దైవకవి" తిరువళ్లువర్ రచించిన "తిరుక్కురళ్" అను గ్రంథమునకు ఆంధ్రానువాదముగా, సానుబంధముగా రచించినది యీ శ్రీపదులు అను కావ్యము. తిరుక్కురళ్ పద్యములు రెండేసి పాదములు కలిగియుండ, వీరందలి భావమును మూడు పాదములలో నిమిడ్చి, నాల్గవ పాదమును సంగతార్థముగా శ్రీపదాంతముగా కూర్చి చక్కగా ఆంధ్రీకరించినారు. వీరి ప్రతిభావిశేష మీ రచనలో గోచరించుచుండును.

వీరు తమ పద్య రచనను గూర్చి చెప్పుచు — "ప్రసిద్ధ గణయతి నియమములు లేక నాచే స్వచ్ఛందచ్ఛందస్సరణి నేర్పరచుకొనబడిన లక్షణములు గల పద్దెము"—అనుటనుబట్టి వీరు నవ్య పద్ధతి నవలంబించి రచన సాగించినారని తెలియుచున్నది.

ధర్మ — అర్థ — కామ రూపమగు త్రివర్గమునకు సంబంధించిన విషయములను ప్రతిపాదించునట్టి ఈ గ్రంథము జాగ్రత్తగా చదివి అర్థము చేసికొనువారికి చక్కగా నుపయోగించు ననుటలో సందేహములేదు. పాఠకులకు వీరి రచనలో విశేషములు గలవని విశదము కాగలదు.

—వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి.

## శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు,
## తిరుపతి. 8-6-1966.

"ఉదాత్త గ్రంథములకు ఒక భాషలో ఎన్ని పరివర్తనలున్న అంత మంచిది. అన్నిటి మూలాన చదువరులు మూల గ్రంథమునందలి తత్త్వ సౌభాగ్యములను సమీపించి తెలుసుకో గల్గుదురు". ఇది కీ॥ శే॥ సారస్వత మహాయోగి శ్రీ హిరియణ్ణగారు నాతో ఒకసారన్నమాట.

తిరువళ్లువ నాయనారు రచించిన 'తిరుక్కుఱళ్' అట్టి గ్రంథములలో అగ్రపంక్తిది. తమిళ వాఙ్మయము విశ్వమున కిచ్చిన మహా ప్రసాదము. దాని యందచందములు అరనివి, తావి తఱుగనిది.

మిత్రులు శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు దీని నిదివరకే 'త్రివర్గము' అను పేర తెనిగింపును తెలుగువారి కందిచ్చినారు. అది యెంతో సుందరమైన చిక్కని రచన. ఒక్కొక 'కుఱళు'ను ఒక్కొక 'ద్విపద'గా వారు సంతరించిరి. అందుచేత మూలమునకన్న తెలిగింపు ఎక్కువ సంయతమైనదేమో యనిపించును. మొదటి గ్రంథకర్తకే యీ యేక వృత్తశృంఖల ఒకచో బిగువుగాను ఇంకొకచో సళ్లుగాను పరిణమించును. ఇక పరివర్తకుల మాట చెప్పనేల?

'త్రివర్గదీపిక' అను పేర కంద—కందార్థములలో ఎవరో రచించిన దీని తెలిగింపును ఎప్పుడో చూచినాను. ఇంకను కొందఱా పని చేసిన వారుందురు.

ఇప్పుడు మిత్రులు శ్రీ కొంతి శ్రీపతిశాస్త్రిగారు ఈ పరివృత్తిని ప్రకటించి ధన్యవాద పాత్రులైనారు. ఇందుకై "పంచాక్షరమాలిక" అను త్రిపదవృత్తి మొకటి క్రొత్తగా కల్పించుకొని రచన సాగించినారు. నాల్గవ పాదముగూడ నున్నను అది మూలమునకు చేరదు. పాద సంఖ్య విషమముగా నుండరాదని భావించిరేమో? కన్నడ సాహిత్యమందలి 'త్రిపది'ని రెండవ పాదమును రెండు మార్లు పాడి పాదవైషమ్యమును

[illegible] గీతములలో. శ్రీపతిశా[illegible]

గారు నాల్గవ చరణము తుదను తప్పక శ్రీకార మతికించి ప్రతి పద్యమును మంగళాంతముగా తీర్చినారు. కాని దానిచే మూలము చిక్కదనము కొంత అతంత్రమైనదేమో ?

శ్రీపతిశాస్త్రిగారు భగవద్గీతాంధ్రీకరణాది గ్రంథములచే సుగృహీత నామధేయులు. "అన్యం నయాతిహి విభూతి రపత్యభాజాం" అన్నట్లు పితృపాదులు శ్రీ భద్రాద్రి రామశాస్త్రిగారి యనుగ్రహమున, సంస్కృతాంధ్రముల లోతు లెఱిగినవారు. అద్వైత విద్యోపాసకులు. ఉద్యోగములో సంబంధములేని సారస్వత వ్యాసంగము వారిది. తమిళ భాషా పరిచయము చాలదని చెప్పుకొన్నారు పరిచయములో. కాని తిరుక్కుఱళ్ మూల వ్యాఖ్యలందలి వారి పరిశ్రమ వారి నా యెల్లను దాటించినది. మూలమును ఎట్లైనను చదివి తీరవలె ననిపించు చదురైన చక్కని రచన యిది.

ప్రాచీన జైనాచార్యులలో సుప్రసిద్ధులై, సంస్కృత ప్రాకృతములలో బహుగ్రంథకర్తయై పూజ్యులైన కొండకుందాచార్యులే యీ తిరువళ్లువరు అని జైన సాంప్రదాయమువారి నమ్మిక. ఆయన వసించిన గ్రామము కొండకుంది—ఇప్పుడు కొనకొండ్ల — అనంతపురము జిల్లాలో నున్నది. చెట్లు చేమలు మొలవని ఆ యూరి కొండ గుండ్లమీద నేటికిని అఱిగిపోయిన జైన చిహ్నముల చాయలు చూడవచ్చునని విన్నాను. పై సంప్రదాయపు మాటయందేమేని సత్యమున్నచో ఈ "తమిళ వేదము" నకు తెలుగుదేశపు పొత్తుగూడ గలదని ఆంధ్రులును ఆత్మీనముగా దీని నుపాసింపవచ్చును.

— రా. అనంతకృష్ణశర్మ.

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు, సాహిత్య అకాడమీ.
మదరాసు 11-3-67.

మహాకవియు, మహాతాత్త్వికుడునైన తిరువళ్లువర్ ప్రసాదించిన గ్రంథరాజము తిరుక్కుఱళ్. దీనిని తమిళులు వేదముగా భావించు

వీరు అర్థానుసారమును మానుకొనందున లక్షణాభిమానం చూపు న్నరు. పత్వ (తత్వ?) శాస్త్రమును పాటించక పోలేదు. ఐతే పాటించినన్ని సార్లకంటె ఉల్లంఘించిన సార్లెక్కువ. 'రచింపఁబడిన' తడవలకంటె 'సూచించబడిన' తడవలెక్కువ. ఈ అవ్యవస్థకంటె కేవలం అపభ్రంశంలోనే వ్రాసి 'శిష్ట వ్యావహారికం' అను పేరు పెట్టు టంటే మేలనిపించింది. మచ్చుకు కొన్ని :

(మూలములోని 1, 45, 261 వ కుఱళులును, ఈ మూడిటికి శ్రీపదులలోని పంచాక్షర మాలికలును, ఆంధ్రీకరణ తారతమ్యము తెలుపుటకు విమర్శకులు 1,261 వ కుఱళులకు ప్రదర్శించిన మంజరీ ద్విపదలును గలవు. వీనిని గూర్చి, పిదప వచ్చు "ఒక విన్నపములో" విస్తరింపఁ బడినది).

—ప్రభాకర్.

## ఆంధ్రప్రభ - సచిత్ర వారపత్రిక 1-2-67

తమిళ సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన గ్రంథ రాజములలో ఒకటి తిరుక్కుఱళ్ ...ప్రస్తుతానువాదం తెలుగువారికి కొత్తదికాదు... ప్రస్తుతానువాదకులు శ్రీ శ్రీపతిశాస్త్రిగారు పండితులు; బహు గ్రంథకర్తలు. తమిళునుంచే అనువదించడమేకాక, తమ అనువాదాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించారు కూడా. ఇందుకు వారు అభినంద నీయులు...(శ్రీపదాంత తురీయ పాదములలో) మూలములోని భావాన్ని విపులీకరించడానికి అనువాదకులు ప్రయత్నించినట్లు స్పష్టమవుతున్నది. (మచ్చునకు : మూలములోని మొదటి కుఱళు, భావము, 1 వ పంచాక్షర మాలిక) మూలమునకూ తెలుగుసేతకూ గల భేదాన్ని పాఠకులే గ్రహించ గలరని భావిస్తున్నాను. మూలానికి సన్నిహితంగా ఉన్నా, కొన్ని కుఱళులు సులభగ్రాహ్యంగా లేవు. ఈ కింది తెలుగు సేతను పరిశీలించండి. (మచ్చునకు: 831 వ పంచాక్షరమాలిక) తిరుక్కుఱళ్ వంటి ఉద్గ్రం థాన్ని అనువదించడం తేలిక పనికాదు. అల్పాక్షరములలో సంతరింప బడిన అనల్పార్థ రచన అది. మొత్తంమీద అనువాదకుల కృషి కొనియాడదగింది.

—కృష్ణ

## —: ఒక విన్నపము :—

ఈ కావ్యమును గురించిన పండిత పత్రికాభిప్రాయములకుఁ గృతజ్ఞుఁడనై, యందలి కొన్ని విషయములఁ గూర్చి యిటఁ బ్రస్తావించుచున్నాను.

ఇందలి కొన్ని పద్యములు సులభగ్రాహ్యములు గావనియుం, లఘు వ్యాఖ్య అవసరమేమో యనియుఁ గొందఱు వ్రాసిరి. ఇది సరియే...... ద్రావిడ సమాంధ్ర పదములు, అచ్చ తెలుఁగు మాటలు, విశేషముగఁ బ్రయోగింపఁబడుటచేతను, కుఱళ్ పద్యము లనేకములు దూరాన్వయ సూక్ష్మార్థములు కలిగియుండఁగా, అట్లే మూల క్రమానువాదము సాగుటచేతను, గొన్ని పద్యములు సులువుగా బోధపడవు; కనుకనే వ్యాఖ్యాపేక్ష కలిగించవచ్చునని పరిచయములో వ్రాసితిని.

ఆటవెలఁదిలో వ్రాసియుండవలసినదనియు, "మంజరీ ద్విపదలో అనువదించితే సంక్షేపసారళ్యాలు కాపాడడం వీలవుతుంది" అనియు, అభిప్రాయములు ప్రకటింపఁబడినవి. తేటగీతి లేక కందము రెండు పాదములలో అనువాదము మాత్రము చేసియుండఁగూడదా యనియుఁ దోఁచవచ్చును......ఇందేదియు నాకు సరిపడమికి, తిరుక్కుఱళ్ లోని మొదటి కుఱళ్ పద్యమునే, పంచాక్షర మాలికలలో అనువాదానుబంధ విరచనకు, మూలహేతుభూతముగా నిట నిరూపించుచున్నాను.

ఏలయినంతలో 'తు, చ' తప్పకుండ మూల పదక్రమ బహు విధేయముగను, కుఱళులయొక్క బాహ్యస్థూల భావములుమాత్రమే కాక సూక్ష్మాంతర్విశేషములు గూడ విడువకుండఁగను, అనువదింపవలె నను నా యుద్యమ నియమములకుఁ ఆ పద్యభేదములం దేదియూ అమరలేదు. మొదటి కుఱళ్ తొట్టిన మొట్టమొదటనే పట్టు వచ్చినది. అది 'అకర' అని మొదలిడఁబడి యుండఁగా, 'అకార' అని నేను మొదలిడుటకు

ఈగణమే విద్ధపద్యమునకును గూడ దయ్యెను. తొలుదొలుత నే తొత్తి కడన యగు నియమభంగమునకు సమాధానములేక, పంచాక్షరమాలికను గల్పించుకొని, ‘అకార’ యనియే మొదలిడి, 32 మాత్రలుగల రెండు పాదములు చాలక, 47 మాత్రలు గల మూడు పాదములలో అనువాదము ముగించి, సూక్ష్మ విశేషార్థ ప్రతిపాదకముగ 17 మాత్రల నాలుగవ పాదము విరచించితిని. కొన్ని కుఱళ్ పద్యములు 38 మాత్రలవఱకుఁ గలవి. నా నియమముతే కాక, ‘అకార’ యనియే మొదలిడుటకును, అనుబంధ విరచనకును, ఇతర కారణము లీక్రిందఁ దెలుపుచున్నాను :

మొదటి పద్యములోని రెండు భాగములందును క్రమముగ ‘అకర’, ‘ఆదిభగవన్’ అనువాని ఆదిమస్థితి విశేషమును, ఆ రెండు భాగములను ప్రకారార్థక పదముచేఁ గూర్చఁబడక వేఱు వేఱు వాక్యములుగా నుండుట యందలి విశేషమును, అనువాదమునఁగూడ ఆ పదముల నా రెండు వాక్యములందును క్రమముగ వక్రస్థానికములుగానే నిగడఁజేసిను... [1]ఆ రెంటియందును నాకు స్ఫురించిన అద్వయ సమష్టి భావమును, అక్షర పరమభావమును, ప్రణవనాద భావమును (మాండూక్యోపనిష ద్విషయము) సకలాక్షర భూతాంతర్యామిత్వ భావమును, ఈ గ్రంథమున వేఱుగ లేని తురీయ పురుషార్థమగు మోక్ష(పర)జ్ఞానమును ప్రదర్శింపవలెనని, యనుబంధముగ శ్రీకారాంత తురీయపాదమున నిఱికించితిని

[1] ప్రాణనాదాక్షరములగు అచ్చులలో ‘అ’ పరమ ప్రాణనాదాక్షరమై (నోరు సరిగ విప్పి చేయఁగల కంఠనాదము ‘అ’ ఒకటియే), ఆదియే (నోరు నాలుక మొదలైనవాని వివిధాకార విన్యాసముల కనువుగ), వికారమునొంది తక్కిన యచ్చులుగా నుచ్చరింపఁబడుచున్నది. అచ్చుల కలయిక చేతనే హల్లులగు ప్రాణ్యక్షరములకుఁ బ్రాణనాద చైతన్యము... ఆదిభగవానుఁడు = పరమాత్మ. ఈ పద్యమున ‘ఉలగు’ = ‘లోకంబు’ అను పదమునఁ బ్రత్యక్ష భూతజాతముకంటెను, నందలి పరోక్ష భూతాత్మ స్థితియే ప్రధానముగ లక్షింపఁబడినది...ఎంత వ్రాసినను దఱుఁగని విశేషములుగల విషయము లివి.

మిక్కిలి కులువరైన మొదటి కుఱళ్ పద్యమును, నా యనువాదము గల పంచాక్షరమాలిక మూడు పాదములలోని మూలక్రమ గమనికయూ, విశేషార్థ ప్రతిపాదకానుబంధ మగు నాల్గవపాదమును, ఈ క్రిందఁ బొందు పఱచుచున్నాను.

క॥ అకర ముదల

పం॥ (౧) అకార స్వరము మొదలుగఁ గలవి

ఎళుత్తెల్లామ్, ఆదిభగవన్

(౨) సకలాక్షరములు; ఆదిభగవానుం

ముదట్రే ఉలగు

(౩) ఒకఁడు మొదలుగఁ గలదె లోకంబు

(౪) అకారాదికమె 'ఓం' పరాత్మశ్రీ.

పై యనువాదమున 'స్వరము', 'ఒకఁడు' అదనములే కాని వ్యర్థ పదములు గావు.

స్వరము = నాదము; అక్షరము. 'అ' యనునది అక్షరక్రమ లిపిలో మొదట వ్రాయఁబడునది యగుట చేతనే కాక, అంతకంటెను ముఖ్యముగ, అదియే ఆదినాదమగుట చేత, రెంటిని సూచించు సమగ్ర పదము "స్వరము".

ఒకఁడు = కేవలుఁడు = పరమాత్మ ..."ఆదిభగవానుఁడు" అను సమాసమునకు "మొదటి భగవానుఁడు" అని అర్థము చేసినఁ, గనీసము రెండవ భగవానుఁడైన నున్నట్లగును. అట్లుకాక, "అద్వయుఁడైన భగవానుఁడు" అనఁగా "పరమాత్మ" అనియే అర్థము చేయవలెను "ఆదిభగవానుఁడు" అద్వితీయుఁడని నిగదించుటకే "ఒకఁడు" అని అదనముగాఁ జేర్చఁబడినది.

పై రెండు మాటలవల్ల సంక్షేపసారళ్యాలు కాపాడఁబడలేదా? 'మూలంతో పోల్చిచూస్తే రాజును జూచిన కంటితో భర్తను జూచి నట్లున్నదా?' కావచ్చు. రాజు, భర్తల యందలి పైచూపుల చేతనో, పొట్టి పొడుగుల చేతనో, భేదముండవచ్చు. రసవిన్యాసము ముఖ్యము.

అనువాదానుబంధములలో 'చిగురువను పడలుబాటు, రసానికి పలుచబాటు' వచ్చి మూలము 'అతంత్రమైనదేమో' రసజ్ఞులు నిర్ణయింపవలెను. కనుక పుష్టికృత మని నే ననుకొనుట స్వాభావికము కదా? పై యనువాదానుబంధములు వలె, నీ కావ్యమందలి పద్యము లన్నియూ సమర్థనీయము లగు నని నా యాశయము.

మొదటి పద్దెము "అకార" యని కాక అ యర్థమిచ్చు మఱియొక పదముతో మొదలిడరాదా? అ + అక్షరము = అక్షరము; అ + స్వరము = అస్వరము. రెండును విశారాశ్లీలములే. "అ యను" అని మొదలిడి యాంధ్రీకరించి చూపుచున్నాను:—

తే॥గీ॥ 'అ' యనునది మొద అక్షరా లన్నిటికిని;
ఆదిభగవానుఁ డొకఁడె లోకాదియుండు.

'అకార' యని మొదటఁ గాక మఱొకచో నిమిడిచి యాంధ్రీకరించి యిటుఁ జూపుచున్నాను

ఆ॥వె॥ అక్షరములకెల్ల ఆది అకారంబు;
విశ్వమునకు ఆద్యుఁ డీశ్వరుండు.

మం॥ద్వి॥ అఖిలాక్షరాద్యమైనది అకారంబు
నిఖిల లోకాద్యుండు నిత్యుఁ డీశ్వరుఁడు.

కం॥ సకలాక్షరముల కాదిది
అకారము; జగముల కాద్యుఁ డభవుం డొకఁడే.

మూలవిధేయత, సూక్ష్మభావప్రసక్తి, లేకుండ ఇట్లే నిడుద కులుకులఁ గూడ, స్థూలభావము లితికించి యాంధ్రీకరించవచ్చుఁ గాని, యది యనువాదము గాఁజాలదు. కుడిచేతికి బదు లెడమ చేయియే యగును.

శ్రీ రామకృష్ణప్రభ సంచికలో శ్రీ ప్రభాకర్ అనువారు నా రచనను గురించి, "వీరు...లక్షణాభిమానం చూపుకొన్నారు. పత్వ (తత్వ?) శాస్త్రమును పాటించకపోలేదు. ఐతే పాటించినన్నిపార్ల కంటె ఉల్లంఘించినపార్లెక్కువ. రచింపఁబడిన 'తడకలకంటె'

'సూచించఁబడిన' తడవ లెక్కువ. ఈ అవ్యవస్థకంటె కేవలం అపభ్రంశం లోనే వ్రాసి 'శిష్ట వ్యావహారికం' అను పేరు పెట్టుకుంటే మేలనిపించింది.'' అని వ్రాసిరి.

వా రేశాస్త్రము నుద్దేశించి వ్రాసిరో కాని, ఆ శాస్త్రము పాటించక నే నెన్నిసార్లు ఉల్లంఘించిన వేవో, రచింపఁబడిన తడవలకంటె సూచించఁబడిన యెక్కువ తడవలేవో, అవ్యవస్థ నా రచనయందలి యే కారణములవలన వారికి గోచరించినదో, వా రొక్క యుదాహరణమైనఁ జూపలేదు; నాకో, తట్టలేదు. తెలిసినను సరిచేయఁ గలుగవలదా? అపభ్రంశములోను వ్రాయలేనివాఁడను గావచ్చును. ''శిష్ట వ్యావహారికం'' అనఁగా శిష్టుల వ్యావహారికమా, శిష్టమైన వ్యావహారికమా? నా రచనయందు 'అవ్యవస్థ' కలదుగదా, శిష్టవ్యావహారికమున కొక వ్యవస్థ కలదా? అవ్యక్తావస్థ వలన సందేహములు.

శ్రీ ప్రభాకర్ అనువారే—మచ్చునకొన్ని—మూలమందలి 1, 45, 261 వ కుఱుళులను, వానికి నా పంచాక్షరమాలికలను, దారతమ్య పరిశీలనమునకొఱకు, 1, 261 వ కుఱుళులకు (వారు రచించినవేమో) అనువాదములగు మంజరీ ద్విపదలనుఁ బ్రదర్శించిరి. 1 వ కుఱుళును, దానికి నా పంచాక్షరమాలికయు ముందే విస్తరించితిని గాన, దానికి వారి యనువాదము మాత్ర మిటఁ జూపుచున్నాను.

మం॥ద్వి॥ వర్ణాలకెల్ల అవర్ణమే ఆది
లోకతతికి నెల్ల లోకేశుఁ డాది.

పై పద్యమునందలి భాష అపభ్రంశ మగు శిష్ట వ్యావహారిక మేమో, నా కట్లు తోఁచలేదు. కాని వా రనుకొనని అపభ్రంశము లొకటి రెండు నాకుఁ దోఁచినవి...''అవర్ణము'' అనగా ''అ యను అక్షరము'' అని రచయిత భావమై యుండవలెను. కాని అది బహు వివర్ణాశ్లీలపదము ''అవర్ణము'' అనఁగా ''నింద''; ఇది అసార్థము కాదు. ''అవర్ణము'' మూలమున కనర్థము తెచ్చినది. అదికాక, 'అ' యనునది వ్యతిరేకార్థక పదముగానే తోఁచి, తాఱుమాఱైన యర్థమునే కలిగించును...వర్ణము = రంగు;

అనువాదానుబంధములలో 'బిగువునకు సడలుబాటు, రసానికి పలుచబాటు' వచ్చి మూలము 'అతంత్రమైనదేమో' రసజ్ఞులు నిర్ణయింపవలెను. రసము పుష్టీకృత మని నే ననుకొనుట స్వాభావికము కదా! పై యనువాదానుబంధములవలె, నీ కావ్యమందలి పద్యము లన్నియూ సమర్థనీయము లగు నని నా యాశయము.

మొదటి పద్యము ''అకార'' యని కాక ఆ యర్థమిచ్చు మఱియొక పదముతో మొదలిడరాదా? అ + అక్షరము = అక్షరము; అ + స్వరము = అస్వరము. రెండును వికారార్థములే. ''అ యను'' అని మొదలిడి యాంధ్రీకరించి చూపుచున్నాను:—

తే॥గీ॥ 'అ' యనునది మొద అక్షరా లన్నిటికిని;
ఆదిభగవానుఁ డొకఁడె లోకాదిముండు.

'అకార' మని మొదటఁగాక మఱొకచో నిమిడిచి యాంధ్రీకరించి యిటుఁ జూపుచున్నాను

ఆ॥వె॥ అక్షరములకెల్ల ఆది అకారంబు;
విశ్వమునకు ఆద్యుఁ డీశ్వరుండు.

మం॥ద్వి॥ అఖిలాక్షరాద్యమైనది అకారంబు
నిఖిల లోకాద్యుండు నిత్యుఁ డీశ్వరుఁడు.

కం॥ సకలాక్షరముల కాదిది
అకారము; జగముల కాద్యుఁ డధవుం డొకఁడే.

మూలవిధేయత, సూక్ష్మభావప్రసక్తి, లేకుండ ఇట్లె నిడుద పలుకులఁ గూడ, స్థూలభావము లితికించి యాంధ్రీకరించవచ్చుఁగాని, యది యనువాదము గాఁజాలదు. కుడిచేతికి బదు లెడమచేయియే యగును.

శ్రీ రామకృష్ణప్రభ సంచికలో శ్రీ ప్రభాకర్ అనువారు నా రచనను గురించి, ''వీరు...లక్షణాభిమానం చూపుకొన్నారు. పత్వ (తత్వ?) శాస్త్రమును పాటించకపోలేదు. ఐతే పాటించినన్నిసార్లకంటె ఉల్లంఘించినసార్లెక్కువ. రచింపఁబడిన 'తడతలకంటె'

‘సూచింపఁబడిన’ తడవ లెక్కువ. ఈ అవ్యవస్థకంటె కేవలం అపభ్రంశం లోనే వ్రాసి ‘శిష్ట వ్యావహారికం’ అను పేరు పెట్టుకుంటే మేలనిపించింది.’’ అని వ్రాసిరి.

వా రే శాస్త్రము నుద్దేశించి వ్రాసిరో కాని, ఆ శాస్త్రము పాటించక నే నెక్కువసార్లు ఉల్లంఘించిన వేవో, రచింపఁబడిన తడవలకంటె సూచింపఁబడిన యెక్కువ తడవలేవో, అవ్యవస్థ నా రచనయందలి యే కారణములవలన వారికి గోచరించినదో, వా రొక్క యుదాహరణమైనఁ జూపలేదు; నాకో, తట్టలేదు. తెలిసినను సరిచేయఁ గలుగవలదా? అపభ్రంశములోను వ్రాయలేనివాఁడను గావచ్చును. ‘‘శిష్ట వ్యావహారికం’’ అనఁగా శిష్టుల వ్యావహారికమా, శిష్టమైన వ్యావహారికమా? నా రచన యందు ‘అవ్యవస్థ’ కలదుగదా, శిష్టవ్యావహారికమున కొక వ్యవస్థ కలదా? అవ్యక్తావస్థ వలన సందేహములు.

శ్రీ ప్రభాకర్ అనువారే—మచ్చుకకొన్ని—మూలమందలి 1, 45, 261 వ కుఱళులను, వానికి నా పంచాక్షరమాలికలను, దారతమ్య పరిశీలనముకొఱకు, 1, 261 వ కుఱళులకు (వారు రచించినవేమో) అనువాదము లగు మంజరీ ద్విపదలనుఁ బ్రదర్శించిరి. 1 వ కుఱళును, దానికి నా పంచాక్షరమాలికయు ముందే వి[illegible]ంచితిని గాన, దానికి వారి యనువాదము మాత్ర మిటఁ జూపుచున్నాను.

మం॥ద్వి॥ వర్ణాలకెల్ల అవర్ణమే ఆది
లోకతతికి నెల్ల లోకేశుఁ డాది.

పై పద్యమునందలి భాష అపభ్రంశ మగు శిష్ట వ్యావాహారికమేమో, నా కట్లు తోఁచలేదు. కాని వా రనుకొనని అపభ్రంశము లొకటి రెండు నాకుఁ దోఁచినవి...‘‘అవర్ణము’’ అనగా ‘‘అ యను అక్షరము’’ అని రచయిత భావమై యుండవలెను. కాని అది బహు వివర్ణాశ్లీలపదము ‘‘అవర్ణము’’ అనఁగా ‘‘నింద’’; ఇది అపార్థము కాదు. ‘‘అవర్ణము’’ మూలమున కనర్థము తెచ్చినది. అదికాక, ‘అ’ యనునది వ్యతిరేకార్థక పదము గానే తోఁచి, తాఱుమాఱైన యర్థమునే కలిగించును...వర్ణము = రంగు;

అని గ్రహించి, అవర్ణము = రంగులేనిది = స్వచ్ఛము = "తెలుపు" అని సాధించి, మొదటి పాదమునకు "రంగులకెల్ల తెల్లరంగు మొదలు" అని అర్థము తీసిన, రెండవ పాదముతో సమన్వయము కుదుర్చవచ్చు. (వస్తుతత్వ విజ్ఞానశాస్త్రము—*Physical Science*—లో రంగులకు తెలుపు మొదలని కొన్ని పరిశోధనలవలన తెలియును) ఇట్లే "వర్ణము" అను పదమునకుఁ గల మఱికొన్ని యర్థములుగూడ ఈ పద్య మన్వయించుటకు సరిపడు నేమో ? కాని మూల విరోధమై అప్రకృతమగును... రెండవ పాదములోని "లోకేశుడు" అను సమానమునకు "లోకతతి కీశుఁడు" అని యర్థము కాఁగా, రెండవపాదమునకు "లోకతతికి నెల్ల లోకతతి కీశుఁ డాది" అని యర్థము తేలును. ఈ అత్యుక్తి యతి క్రియ క్రమేమో?...మూలమునకంటె నెక్కువ బిగువు ఎక్కువ చిక్కని రసము వెలయించుటకై, ఒకటి అర్థాంతరన్యాసముగాను, మఱొకటి దృష్టాంతముగాను ప్రయోగింపఁబడినవేమో. అట్లయిన, నా తెలివిలేమికి క్షమింతురుగాక !

ఇఁక, 261 వ కురలును, నా పంచామృతమాలికలోని అనువాదము యొక్క మూలక్రమానుసరణమును, అనుబంధమును జూపి, వివరించి, పిదప శ్రీ ప్రభాకర్ అనువాదరూపమున మంజరీద్విపదను జూపి, నాకుఁ దోఁచిన తారతమ్యముల విస్తరింతును.

261–కు: [illegible]

పం॥ (౧) కలుగు [illegible]

ఉయిర్కు [illegible]

(౨) మెలఁగు [illegible];

అ[illegible]

అ (౩) [illegible].—

(౪) [illegible].

మెలఁగు అను అదనపుమాట వ్యర్థముగాక, "పరసు లగు" అను అర్థము గలదై, "పసులులకు" (ప్రాణులకు) అను పదమునకు ముందు

విశేషణముగాఁ జేర్పఁబడుటచే, "చరజీవులకు" అను అర్థము కలిగినది. స్థిరప్రాణులగు కృత్యాదులకు బాధ కలిగించుట దోషము కాదని అర్థాపత్తి.

౨వ పాదము దమము, యమము, అను రెంటివలననే తపస్స్వరూపము పరిపూర్ణమా, యను శంకకు నివారణముగాను (అట్లే తపత్తిక్కుఱు) "ఆ కొలఁది గలదే తపోరూపంబు" అను వాక్యమునకు విపులీకరణముగాను, నాలుగవపాదములో, ఆ రెంటి పరిమితిగల తపస్స్వరూపములోఁ దపముయొక్క పెక్కులగు అంగములు అడకము లని తెలుపఁబడినది.

శ్రీ ప్రభాకర్ అనువా రుదహరించిన, **261**వ కుఱలునకు అనువాద మీ క్రిందిది:—

మం॥ద్వి॥ ఏమి బాధలు గల్గెనే నోర్చుకొనుచు,
నొరుల బాధపఱుపకుండుటే తపము.

ఈ పద్యమున మూలభావము చాలవఱకున్నది; కొంతవఱకు లేమికిఁ గారణము: "ఒరుల"యనుటవల్లను, "అట్లే...ఊరు" అను పదముల భావము సడలిపోవుటవల్లను, "బాధ లోర్చికొని, యితరుల బాధింప కుండుటే తపము" అని అగుటవల్ల, మూలభావము కొంత సంకుచిత మయ్యెను. ఇక్కడఁ గొన్ని తారతమ్య విశేషములు.

1 "ఉయిరుక్క" అనుటయందు (**261** వ కుఱళులో) సామాన్యముగఁ జరాచర సకల జీవరాశులు నుద్దేశింపఁబడి, అపరిమిత హింసానిషేధము నిగదింపఁబడినది.

2. "మెలఁగు నుకుఱులకు" అనుటయందుఁ (నా పంచాక్షర మాలికలో) జరజీవరాశులు మాత్ర ముద్దేశింపఁబడి, పరిమిత హింసానిషేధము నిగదింపఁబడినది.

8. "ఒరుల" (ఇతర మానవుల) అనుటయందుఁ (వై మంజరీ ద్విపదలో) జరజీవరాశులలోను, మనుష్య జీవరాశి మాత్రమే యుద్దేశింపఁబడి, బహున్యూనపరిమిత హింసానిషేధము నిగ

దింపబడినది......ఇందుచే మనుష్యేతర జీవహింసా స్వేచ్ఛ
తపస్వికి నిర్దోష మని తేలినది. ధర్మశాస్త్ర సమ్మత మగునో ?

పాఠక మహాశయులారా ! శ్రీ ప్రభాకరీ అనువారు నా యను వాదమును విమర్శించి స్థాలీపులాక న్యాయముగనె, తారతమ్య పరిశీలనము కొఱకును, రెండు కందములను, వానికి నా పంచాక్షరమాలికలను, వారి మంజరీ ద్విపదలనుఁ బ్రదర్శింపకుండిన, ఆ రెండు పద్యములనైన విస్తరించి వ్రాయవలె నని నాకుఁ గోరిక యుండెను. వారి పద్యములఁ గూర్చి విమర్శనము తారతమ్య పరిశీలనము కొఱకే. ఎవరి యభిప్రాయముల కైనను నావల్ల నైనంతలో బదులిడి సమాధానపఱచుటే, యీ విన్నపమునందలి నా యుద్దేశము కాని, నిరసనము కాదు. తమ యమూల్యాభిప్రాయములఁ దెలిపిన యందఱకును నా కృతజ్ఞతాపూర్వకాభివందనములు.

మదరాస్
27-4-67.

శ్రోత్రి శ్రీపతిశాస్త్రి.

